# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

డిశంబరు 1979

సంపుటము : 56 సంచిక : 12

---

విడిపత్రిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## డిశంబరు 1979


| | | |
|---|---|---|
| పేరు పెట్టలేని కవిత | శ్రీ ఎస్. మునిసుందరం | 4 |
| కోరిక | శ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి | 5 |
| ''శిశిరంతో పోరాడే హరిత పతాకాలు'' | శ్రీ ఆసు రాజేంద్ర | 5 |
| మా ఇంటి ముందరనుండి పోయే త్రోవ | శ్రీ మెతుకు మనోహర్ రెడ్డి | 6 |
| సమాధానం | శ్రీ ఎల్లూరి శివారెడ్డి | 8 |
| సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలు | డాక్టర్ శివలంక శ్రీరామచంద్రమూర్తి | 9 |
| సందె చినుకులు | ప్రత్యూష | 17 |
| ధవళతరంగాలు<br>కర్నాటకపురి<br>సాగరిక సోయగాలు | డాక్టర్. పి. జి. రామారావు | 18 |
| కనిపించని కోయిల | మహేంద్ర | 19 |
| కైవారము | అనంత శ్రీ | 24 |
| కావ్యాత్మానుశీలనము | శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ | 25 |
| ''కవితానందం'' | శ్రీ నందిగాం వీరవెంకటరమణ జోగారావు | 27 |
| నది విస్వానికి పెన్నిధి | డాక్టర్ గంధం జోయెల్ | 28 |
| స్వేచ్ఛాపథం | శ్రీ బి మురళీధర్ | 29 |
| వియోగి | శ్రీ పి. ఆర్. భానుమూర్తి | 29 |
| అమితగతి — సుభాషిత సన్దోహం | శ్రీ ఇ. సాయిబాబా | 30 |
| ముదిగొండ చాలుక్యులు - 1 ప్రాచీనులు | శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి | 32 |
| గోవులు | శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి | 37 |
| సంస్కృతములోని తెలుగు వ్యాకరణచ్ఛన్దోగ్రంథములు | శ్రీ విక్రాల శేషాచార్యులు | 38 |
| చీలిక | శ్రీ చందు సుబ్బారావు | 42 |
| అనుభూతికి యేతం | శ్రీ కె అంజయ్య | 45 |
| ధ్వని మార్పులు | డా. లింగంనేని బసవశంకరరావు | 46 |
| అర్థశాస్త్రంలో 1979 సం॥పు నోబుల్ బహుమతి గ్రహీతలు | శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్ | 51 |
| కలగూరగంప | | 54 |
| గ్రంథవిమర్శలు | | 74 |




# పేరు పెట్టలేని కవిత

## శ్రీ ఎస్. మునిసుందరం

అలల బంతుల్ని విసురుతున్న సముద్రుడు
కాపాలికుని రక్తపూరిత కపాలంలా
కొండలమధ్య దిగులుగా సూర్యుడు
ఎగిరే పక్షుల రెక్కలకు పారాణి పూస్తున్న
ముదుసలివాడు.
సగం విరిగిన కోవా జాంగ్రీలా
శూన్యంలో నిస్సారంగా చంద్రుడు
తడి ఇసుకలో నేను.
రాజకీయునిలా నమ్మించి
కాళ్ళకింద మట్టిని లాగేస్తున్న పిచ్చితరంగం
ఎదురుగా వేరు సెనక్కాయలు కొనండని
అడుక్కొంటున్న కుర్రడు.
ఇది బాలల సంవత్సరం
నాకు విసుగ్గావుంది
తినాలని లేదు కాబట్టి కొనాలని లేదు.
''ఒక్క పదిపైసలకు బాబూ!''
ఆ గొంతులో జీర
ఆ జీరలో భవభూతి.
గుండెపై బ్లేడ్‌ను సానబెడుతున్న చప్పుడు.
కొన్నాను.
దూరంగా నడిచాను.
''బాబూ!''
మరో బాలల సంవత్సరం
శరీర నిర్మాణానికి ఎన్ని ఎముకలు అవసరమో
లెక్కగట్టవచ్చు.
పొట్లం యిచ్చాను
ఎన్ని పున్నమి చందమామ లామొగంలో.
చిలకా గోరింకల్ని, సీతాకోకచిలకల్నీ
కళ్ళ పరదాల వెనక్కు నెట్టేసి
నియోన్ బల్బుల్లో మెరుస్తున్న క్యాంటిన్ కుర్చీలో
కూల బడ్డాను
గోడమీద కిట్ కిట్ మంటూ వెడుతున్న బల్లి
ఏదో వాసన.
టేబిల్ క్లీన్ చేస్తున్న కుర్రవాడు
మురికిని తుడుస్తున్న మురికివాడు
బాలల సంవత్సరంలో లేబరువాడు.
కాఫీ తాగలేదు
రోడ్డును వూడ్చుకొంటూ నేను
''సార్ అగ్గిపెట్టుందా?''
లారీ కందెనలో బాలలవత్సరం
కళ్ళల్లో ప్రశ్నలు, కాళ్ళకు సంకెళ్ళు
బాలల సంవత్సరానికి అగ్గిపెట్టె కావాలి
ఉన్నా, ఇచ్చే సాహసంలేని నేను
శూన్యంగా, శూన్యంవేపు
నాగరికతనుండి తప్పుకొంటూ,
దురుసుగావచ్చి నా మొహాన్ని మొత్తిన
బాలల సంవత్సరం కళ్ళు మోసుకొంటూ
సాగిపోతున్న నేను ...
ఆరేసుకోబోయి పారేసుకున్న
జనాలమధ్య
''బాలల సంవత్సరం'' గొణుక్కుంటూ నేను.



# కోరిక

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణమూర్తి

నీ కోవెల ముందరి
  ధ్వజస్తంభంమీది ...
చిఱుగంటగా నన్ను పుట్టించు.
గాలికి అల్లలాడుతూ ...
నిత్యం నీ నామస్మరణ చేస్తాను
నీచేత సృష్టింపబడిన నన్ను
నీకై వినియోగించుకో ...
అజాండమైన నీ దేవళంలో
పిచ్చిపువ్వుగానైనా నన్ను సృజించు
ఎప్పటికీ నీ పాదాలచెంతకు
చేరగలననే ఆశతో ...
వాడిపోకుండా జీవించగలను.
నన్ను వర్ష బిందువుగా ...
నీ దయామేఘాలలో దాచుకో.
నీలాకాశపు సహస్రఘటాభిషేకంలో
నేనొక కణంగా కలిసి నీ కర్పణం ఐపోతాను
నన్నొక చిన్ని తారగా వెలిగించు ...
నీ గుడిలో దీపంగా ఒక్క వెలుగు వెలిగి
తృప్తిగా రాలిపోతా.

---

# "శిశిరంతో పోరాడే హరిత పతాకాలు"

## శ్రీ ఆసు రాజేంద్ర

పక్షులకు బుజాల్ని అప్పగించే వృక్షాలు
  చైతన్యాన్ని గుండె నిండా పీల్చుకుని
శిశిరంతో పోరాడి గెల్చాయి
ఆ విజయానికి చిహ్నంగా
కొమ్మల్ని వేణువులుగా చేసుకుని
అమృతరాగాల్ని ఆలపిస్తున్నాయి కోయిలమ్మలు —
దిక్కులు తీయ్యని అనుభూతులకు లోనయ్యేలా ...
హృదయపు వాకిళ్ళు తెరచి
పుప్పొడి హారతుల్ని అందిస్తున్నాయి
చిగుళ్ల సిగలోంచి తొంగిచూసే పూబోణులు —
వేకువ సూర్యుళ్ళ నేలనీనినట్లుగా ...
చెట్లుతో సాగి సహజీవనం సాగించే లావణ్యలతలు
పుష్పమాలికలనల్లి
పరిమళ సందేశాల్నందిస్తున్నాయి వాయుస్వరాలకు -
పుడమితల్లి సుగంధాల నోమునోచినట్లు ...
పచ్చని చైతన్యాన్ని పండించే
సశ్య విప్లవానికి మరణం లేదంటూ
హరిత పతాకాల్ని ఎగురవేస్తున్నాయి కొమ్మలు —
ఆకాశం అంచులు తాకేటట్లుగా ... !

# మా ఇంటి ముందరనుండి పోయే త్రోవ

శ్రీ మెతుకు మనోహర్ రెడ్డి

పట్టణం అదే
  అక్కడ ఏకాంత మనేదేలేదు
ఒక వేళ దొరికినా ఖరీదయినది
కోలాహలం మధ్య ధ్వని నిరోధక గోడలమధ్య ఇరుక్కు పోయినట్లుంటుంది.

గ్రామము ఇదే
ఇక్కడ ఏకాంతము, ప్రశాంత పరిసరాలు
సరళ జీవన సరళి, కృత్రిమానికి దూరంగా
ప్రకృతిలో లీనమవాలనిపిస్తుంది.

మా గ్రామంలో
మా ఇంటి గడపలో నిల్చుని
దృష్టిసారిస్తే, పచ్చని వృక్షాలు
జలాశయాలు, పశువులు
ఒకరిపై ఒకరు ఆధారపడి జీవించే
నిరంతరంగా శ్రమించే కష్టజీవులు
ఇదంతా ఈ దేశ పరిస్థితిని ఆలోచించేట్లు చేస్తున్నది.

పట్టణంలో
లోహపు చట్రాలపై నిల్చిన యంత్రాల పొగలు
సిమెంట్, టార్ రోడ్లపై నడిచే వాహనాల రుసరసలు
యంత్ర చాలిత శ్వాసలు, వాటి వలన జనించిన వేడితగ్గడానికి
వాతాను కూలిత శీతల తమకాలు
కృత్రిమ జీవన సరళి
రోజు జీవితంలో ఆటల పోటీలు
సినిమాలలో బారులు బారులు
బస్సుల్లో తేనేటీగల్లా వేలాటలు
రైళ్లకోసం స్టేషన్లలోనే సగం జీవితాలు
కిరోసిన్‌నుండి కిళ్లీలవరకు అన్నిటికి ''క్యూ''లు
శ్మశానాలలో చివరికి ఖననానికి శవాల ''క్యూ''లు
అన్నిటికి చీమల్లా బారుల్లాంటి ''క్యూ''లు.

నాకు పట్టణంలో
జీవనం పగిలిన అద్దంలాగా అనిపిస్తుంది

విద్యుత్తు, ధూమశకటాలు
వాయుయానాలు అన్నీ పట్టణాలవైపే తరలివస్తున్నవి
గ్రామ సంపద అంతా పట్టణాలకే తరలివస్తున్నది.

గ్రామంలో
చివరికి
కనీస జీవితావసరాలయినా లేవు
వాటికోసం
విధిలేక
కాపీనాలయినా లేకుండా
అహోరాత్రాలు పనిచేసి
నిర్భర దరిద్ర జీవితాలు
పట్టణవాసులకు అభిముఖంగా సాగిస్తున్నారు.

ఈ దేశపు ప్రగతి మార్గం ఇన్నేళ్ళు
పట్టణాల ఆకాశ సౌధాలముందునుండి
ఫైవ్‌స్టార్స్ హోటల్స్ ప్రక్కనుండి
ప్రభుత్వ కార్యాలయాల భవనాల వెనుకనుండి తిరుగుతూ పోయింది ...

పట్టణాల్లో తారురోడ్లమీద ఇంపాలాకార్లలో ప్రగతి చెందింది నాగరికత
అయినా పట్టణ పేదప్రజలకుకాని, మధ్యతరగతి ప్రజలకుకాని
ప్రతిఫలం అందలేదు, గ్రామాలకసలే లాభంలేదు.

వేల సంవత్సరాల క్రిందటి రాజులపాలనకి
అప్పటి మహానగరాలలో, రాజసౌధాలనుండి
మణిమయ రత్నఖచిత సింహాసనాలనుండి
జలతారు దుస్తులనుండి వచ్చిన ఆజ్ఞలపై నడిచిన పాలనకి

ఇప్పటి పట్టణాలలోని
వాతానుకూలిత గదులలోనుండి
టెలిఫోన్లలో జరిగే నలగని ''రానిఫాల్'' దుస్తుల పాలనకి
సారూప్యమున్నది, ఒకే మూసలో జరుగుతున్నది.

ఆ కాలాలలో గ్రామీణుల పన్నులతోనే
ఫతేపూర్ సిక్రీలు, తాజ్‌మహల్ ఎర్రకోటలు వెలిశాయి
ఛిత్తోర్‌ఘర్‌లో విజయ స్తంభం
జైపూర్‌లో రాజసౌధం
హైదరాబాద్‌లో ప్రేమకు చిహ్నమయిన చార్‌మినారు
అన్నీ గ్రామీణుల స్వేదమును ఘనీభవింపజేసి నిర్మించినవే

ఆనాడు గ్రామీణులు పట్టణ ప్రజల జీవన సరళికి పావులు
ఈనాడు అదే కొనసాగుతున్నది.
పాలకులు ఎంతో గ్రామ సంపదను ఎన్నో పట్టణాలలోనికి తరలించినా
''రెంటికిచెడ్డ రేవన్నలా'' పట్టణ పేదలకు సుఖంలేదు
గ్రామీణులకసలు బ్రతుకే దుర్భరం.

పట్టణ వ్యామోహాన్ని తగ్గించాలనుకొనేవారే లేరు
పరిపాలకులకే వ్యామోహమాయె
అందుకే అనిపిస్తున్నది
అత్యధికులు నివసించే గ్రామీణ ప్రాంతాలనుండి
మా నిరుపేదల గడపలముందునుండి
గతుకుల బాటకు ప్రగతిమార్గాన్ని మరలిస్తారని ఆశిస్తున్నా
ఇప్పుడు మాగడపముందునుండిపోయే
మట్టిత్రోవయే ప్రగతికి సరియైన మార్గమనిపిస్తున్నది.

# సమాధానం

## శ్రీ ఎల్లూరి శివారెడ్డి

ఎవరు వీళ్ళు ?
మెదళ్ళు బీళ్ళుగా
కళ్ళు ముళ్ళుగా
చేసుకొన్న పేదమనసుల వాళ్ళు
ఎవరు వీళ్ళు ?

గుండె చప్పుళ్ల వెనుక
వేదాంతం ఉంటని
వేద నాదంలోనే
ప్రమోదవాదం ఉందని
తెలియని వ్యర్థామూర్తులు
ఎవరు వీళ్ళు ?

ఎదిగే చెట్టుకు
ఎగిరే పిట్టకు
పరిణామం తెలుసునని
పరిణయం ఎరుక అనీ
తెలియని నా సాటివాళ్ళు
ఎవరు వీళ్ళు ?

ఉరిమే మేఘం
కరుణాజలం కురుస్తుందని
తరిమే కాలాగ్ని
పవిత్రం చేస్తుందని
తెలిస్తే తరిస్తారు !
ఎవరు వీళ్ళు ?

నా అంతరాత్మ ప్రతిధ్వనులా ?
ఫరవాలేదు.
శ్రుతి ధ్వనులా ?
చూడగలను.
కసి ధ్వనులా? అయితే
కన్నీరే నా సమాధానం.

డా. శివలంక శ్రీరామచంద్రమూర్తి

# సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలు

పరిపాలనా సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని రాజ్యాన్ని కొన్ని విభాగాలుగా విభజించటం సహజమైనది. ప్రాచీనాంధ్ర శాసనాలలో హారం, రఠ (లేక రాష్ట్రం), విషయం, పథం, భోగం వంటి విభాగాలు మనకు కన్పిస్తాయి. ఇటువంటి విభాగాలలో కొన్నిటికి విభాగ సూచకమైన అనుబంధపదాలు లేకుండా సంఖ్యలు మాత్రమే కన్పిస్తాయి. ఆదవాని–500, ఆనెమార్గ–70, అన్మకొండ–7000 వంటివి ఇందుకు కొన్ని ఉదాహరణలు. అయితే విభాగసూచకమైన ఉపపదంతో బాటుగా సంఖ్యలు ఉన్నవీ ఉన్నాయి. కలువచేడు–40 కంపణము, ముటికినాడు–300, నలువాడి–500, పాకనాటి విషయము–21000 వంటివి ఇందుకు ఉదాహరణలు. ఇటువంటి విభాగాలలోని సంఖ్యలు దేనిని సూచిస్తాయి అనే విషయం పండితులని చాలాకాలం క్రిందటే ఆకర్షించింది. ఈ విషయాన్ని గురించి చర్చించిన వారిలో ఫ్లీట్,[1] రైస్,[2] టి. వి. మహాలింగం,[3] కుందూరి ఈశ్వరదత్తు,[4] జి. ఎస్. దీక్షిత్,[5] డి. సి. సర్కార్[6] మున్నగు పండితులు ముఖ్యులు. ఎన్ని చర్చలు జరిగినా ఇంతవరకూ ఈ సంఖ్యల అర్థం ఇదీ అని మాత్రం నిర్ణయం కాలేదు; కావటం కష్టం కూడా. ఫ్లీట్ మహాశయుడు ఈసంఖ్యలు ఆయా విభాగాలలోని గ్రామాల సంఖ్యలని తెలుపుతాయని అభిప్రాయపడ్డాడు. మనుస్మృతిలో కొన్ని గ్రామాలను కలిపి ఒక విభాగంగా పేర్కొనటానికి సంబంధించిన ప్రసంగం ఉన్నది.[7] పశ్చిమ చాళుక్య చక్రవర్తి మూడవ సోమేశ్వరుడు తన మానసోల్లాసంలో ఈ విధమైన విభాగాన్నే పేర్కొన్నాడు.[8] అయితే చిన్న సంఖ్యలు (దాదాపు 1000 వరకూ) ఆయా విభాగాలలోని గ్రామాల సంఖ్యలను సూచిస్తాయని ఒప్పుకోవచ్చు కాని ఏడున్నర లక్షలు, 50 లక్షలు వంటి అనుబంధాలని ఈ అర్థంలో అంగీకరించటం అసాధ్యం. అందుకని ఈ అనుబంధ సంఖ్యలు ఆయా విభాగాల ఆదాయాన్ని సూచిస్తాయనీ, జనసంఖ్యను తెలియబరుస్తాయనీ, విస్తీర్ణాన్ని తెలియబరుస్తాయనీ వివిధములైన అభిప్రాయాలు వ్యక్తమైనాయి.[9] కొందరు పండితులు[10] పెద్ద సంఖ్యలు అతిశయోక్తులనే అభిప్రాయపడ్డారు. ఇటీవలి భారతులలో ఈ సంఖ్యల అర్థాన్ని గురించి చర్చలు ప్రచురితములైనాయి. శ్రీమతి ఆర్. జగదీశ్వరిగారు (భారతి, డిసెంబరు 1978) ఈ సంఖ్యలు కుటుంబ సంఖ్యను తెలిపేవని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను సమర్థిస్తూ కొందరు, వ్యతిరేకిస్తూ మరికొందరు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు (ఫిబ్రవరి, మే 1979). వ్యతిరేకించిన పండితులు ఈ సంఖ్యలు ఆయా విభాగాల విస్తీర్ణాన్ని తెలియబరిచేవి కావచ్చని సూచించారు.[11] కాని ఇట్టి ప్రతిపాదనలకు వ్యతిరేకంగా ఇంతకుముందే తలెత్తిన ప్రశ్నలకి సమాధానాలుమాత్రం లభించలేదు. అయితే సంఖ్య అనుబంధంగా గల ప్రాంతీయ విభాగంలోని ఇతర గ్రామాల పేర్లని పేర్కొనే శాసనాలు ఉన్నాయన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు సందులరహాళు, రాచెలువు, పాకుగుంటె గ్రామాలు కోడద–12కు చెందినవని కొలనుపాక శాసనాలు పేర్కొంటున్నాయి.[12] ఈ సందర్భంలో 12 అన్న సంఖ్య ఆ విభాగంలో గల గ్రామాల సంఖ్యను తప్ప మరిదేనిని సూచిస్తుందనటానికి వీలులేదు. ఇటువంటి సందర్భాలలో సంఖ్యకు ముందుగా సూచించబడిన గ్రామాన్ని సాధారణంగా ఆ గ్రామ సముదాయానికి ముఖ్య గ్రామం (head quarters) గా గ్రహించవచ్చు. అంటే కోడద ప్రముఖమైన 12 గ్రామాలకీ కోడద ముఖ్యగ్రామం అన్నమాట. మూడవ వజ్రహస్తుని (క్రీ. శ. 1057) నడగాం తామ్రశాసనం[13] ఏరద విషయం నుండి విడదీయబడిన 12 గ్రామాలతో వేల్పూరు విషయాన్ని ఏర్పాటు చేసినట్లు తెలుపుతున్నది. ఇక్కడ ఆసక్తికరమైన విషయం ఏమంటే ఆ పన్నెండు గ్రామాల పట్టికనీ కూడా ఆ శాసనం మనకందించింది. ఈ వేల్పూరు విషయం సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగం కాకపోయినా ఆ విభాగంలో ఉన్నవి పన్నెండూ గ్రామాలే నన్నది గమనించదగింది. ఈ పన్నెండు గ్రామాల సముదాయానికీ వేల్పూరు ప్రధాన గ్రామం అన్నది ఈ విభాగాన్ని వేల్పూరు విషయమని వ్యవహరించటంలోనే తెలుస్తున్నది. అలాగే సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలలోని సంఖ్యలు కూడా, మరీ పెద్దవి కానంతవరకూ, ఆయా విభాగాలలోని గ్రామాల సంఖ్యను సూచిస్తాయనటమే ఒప్పుగా కనబడుతుంది. పెద్దసంఖ్యల అర్థం నిర్ణయించటానికి ఇప్పుడు లభించిన ఆధారాలు చాలవు.

ఆంధ్రదేశ శాసనాలలో సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలు 70కి పైగా లభ్యమయినాయి. ఈవిభాగాలను గురించిన సంక్షిప్త పరిచయం కొన్ని ప్రత్యేక విషయాలను అవగాహన చేసుకోవటానికి తోడ్పడుతుంది. అటువంటి కొన్ని విభాగాలను గురించి దిగువన ఇస్తున్నాను.[14]

1. అన్మన్ బళ్ళి–11 :– ఈ విభాగం యత్తపి–90కి చేరినది. ఇది ఈనాటి మహబూబ్ నగర మండలంలో ఉండి ఉండవచ్చును. (తెలంగాణా శాసనములు, II, కళ్యాణి. 41. క్రీ. శ. 991).

2. మంగళం–12 :– ఈ విభాగపు ముఖ్య గ్రామం మంగళం నేటి పుంగనూరు తాలూకాలోని మంగళం గ్రామం. (AR Ep., 1932, No. 183. 8వ శతాబ్ది)

3. ప్రాందొలు–12 :– ఈవిభాగం పాగుణవార విషయం లోనిది. ఈ విభాగపు ముఖ్యగ్రామం ప్రాందొలు ఇప్పటి భీమవరం తాలూకాలోని పాందువ గ్రామం. (Ep. Ind., Vol. IX, pp. 131 ff. క్రీ. శ. 947–70).

4. చిఱుపి–12 :– చిరుపి, చింతకుంటె, చిరియవొళలు, పుళువట్టు గ్రామాలు ఈ విభాగంలోనివి. దీని ముఖ్య గ్రామం చిఱుపి నేటి మడకశిర తాలూకాలోని శిర్పి. SII., Vol. IX, No.26. క్రీ. శ. 950–51).

5. రేపాక–12 :– సబ్బి–1000 లో ఈ రేపాక – 12 ఉండినదనీ, వనికదుపులు గ్రామం ఇందులోనిదనీ సర్పణి తామ్ర శాసనం (క్రీ. శ. 966) వల్ల తెలుస్తున్నది. (AR Ep., 1961–62, No. A 33).

6. కడప–12 :– ఈ విభాగం పాకనాటి లోనిది. ఈ విభాగం లోనిదిగా పేర్కొనబడిన అత్తి రేవుల గ్రామం నేటి కడప జిల్లాలోని అత్తిరాల, (Ep. Ind., Vol. XXVIII, pp. 67 ff. క్రీ. శ. 967).

7. నటినురె–12 :– ఇది ఎత్తపి 90 లోనిది. వ్రేపి కట్టు గ్రామం ఈ విభాగంలోనిది. ఈ విభాగం నేటి కొల్హాపూర్ తాలూకాలో ఉండిఉండవచ్చును. A R Ep., 1960-61, Nos. B 83, 86; క్రీ. శ. 1042, 1110).

8. కూడల–12 :– ఈ విభాగం ఈనాటి ఆలంపూర్ తాలూకాలోని సంగమేశ్వరం ప్రాంతం. కూడల నేటిసంగమేశ్వరమే. (అదే–1962–63, No. B 209. క్రీ. శ. 1045).

9. కవుతాళు–12 :– ఇది ఆదవాని – 500 లోనిది. ముఖ్య గ్రామం కవుతాళు ఇప్పటి ఆదోని తాలూకాలోని కవుతాళం. నేరిల, బదలపాళు, తోహి గ్రామాలీ విభాగంలోనివిగా పేర్కొనబడినాయి. ఇందులో చివరి రెండు గ్రామాలూ నేటి ఆదోని తాలూకాలోని బదనేహాళు, తొవి గ్రామాలు. ఈ విభాగాన్ని ఇప్పటి కవుతాళం ప్రాంతంగా గుర్తించవచ్చు. (SII., Vol. IX, Nos. 116, 250. క్రీ. శ. 1055, 1148).

10. కోడర–12 :– సముంరహాళు, రాచెరువు, పాకుగుంటె గ్రామాలు ఈ విభాగంలోనివి. ఇది ఈనాటి భువనగిరి తాలూకాలో ఉండి ఉండవచ్చును. (AR Ep., 1961–62, Nos. B 94, 70, 63; క్రీ. శ. 1038, 1091, 1098).

11. తాలాణ్డ–12 :– ఏరద పంపులోని ఈ విభాగాన్ని రెండు శాసనాలు పేర్కొంటున్నాయి (SII., Vol. X, Nos. 702, 707. క్రీ. శ. 1149, 1153). అయితే క్రీ. శ. 1297నాటి శాసనం ఒకటి దీనిని తాలాడునాడు అని పేర్కొంటున్నది (అదే – Vol. VI, No. 957). అందువలన ఆ కాలానికి ఈ విభాగంలోని సంఖ్య మరుగున పడిపోయి 'నాడు' అన్న అనుబంధ పదం చేరిందని భావించవచ్చు. ధర్మవొరము (నేటి విజయనగరం తాలూకాలోని ధర్మపురి), తటరం గ్రామాలు ఈ విభాగంలోనివి. దీని ముఖ్య గ్రామం తాలాణ్డిని నేటి తాలాడగా గుర్తించవచ్చు.

12. బాగి–12 :– ఇది సిందవాడి–1000లోనిది ఈ విభాగంలోనిదిగా చెప్పబడిన కాంతరికె గ్రామం నేటి ఆదోనితాలూకాలోని కాతరికి. ఈ విభాగం నేటి ఆదోని తాలూకాలో చేరి ఉండవచ్చును. (SII., Vol. IX, No. 277. క్రీ. శ. 1184).

13. చెఱకు–12 :– కాకతీయుల సామంతులైన చెఱకు వంశీయుల పాలనలో నుండిన విభాగమిది. "చెఱకు ద్వాదశ గ్రామాన్" అని జలాలుపురం శాసనం పేర్కొనుచున్నది. (తెలం. శాస. II, కాకతీయ. 5).

14. కూడుకులి–13 :– మల్లేశ్వర శాసనం ఈ విభాగం ఎత్తపి–90 లోనిదని, ఉవున్పల్లి గ్రామం ఇందులోనిదనీ తెలియజేస్తున్నది. ఈ విభాగం ఇప్పటి కొల్హాపూర్ తాలూకాలో ఉండి ఉండవచ్చును. (A R Ep., 1960–61, No. B 17. క్రీ. శ. 1048).

15. వేల్పుగొండ–24 :– ఈ విభాగం గూడూరు శాసనంలో పేర్కొనబడింది. దీని ముఖ్యగ్రామము వేల్పుగొండ ఈనాటి నల్గొండ జిల్లాలోని జఫర్‌గఢ్. (ప్రా. చా. భూ., పు. 311). ఈ విభాగములోనిదిగా చెప్పబడిన బమ్మెరిగ గ్రామము అదే జిల్లాలోని ప్రస్తుతపు బమ్మెర. (ఆం. సా. ప. ప., సం. 50 పుటలు 1 నుండి; AR Ep., 1960–61, No. B 107. క్రీ. శ. 1124).

16. కందుకూరు–24 :– ఈ విభాగపు ముఖ్య గ్రామమైన కందుకూరు, ఇందులోనిదిగా చెప్పబడిన కొనగెయహాళు గ్రామమూ ఇప్పటి ఆదోని తాలూకాలోని కందుకూరు, కొసిగి గ్రామాలే. అందువలన ఈ విభాగం ఇప్పటి ఆదోని తాలూకాలో ఉండి ఉండవచ్చును. (SII., Vol. IX, No. 294. క్రీ. శ. 1164).

17. గుడికల్లు–24 :– నందవరం శాసనం నందవుర గ్రామం ఈ విభాగంలోనిదని తెలియజేస్తున్నది. ఈ విభాగపు ముఖ్యగ్రామమైన గుడికల్లు, ఇందలి నందవురగ్రామమూ నేటి ఆదోని తాలూకాలోని గుడికల్లు, నందవరం గ్రామాలే. అందువలన ఈ విభాగం కూడా పైన పేర్కొన్న కందుకూరు–24 వలెనే ఆదోని తాలూకాలో ఉండి ఉండేదని భావించవచ్చు. (అదే– నెం. 279. క్రీ. శ. 1186)

18. తుంబుళ–30:– ఆదవాని–500కు చేరినది చెప్పబడిన ఈ విభాగంలో బదిగకుంటె, బాడం బెయ్యంగేరి, తుంబళబీడు (ఇప్పటి ఆలూరు తాలూకాలోని తుంబలబీడు) గ్రామాలు ఉండేవని రెండు శాసనాలవలన తెలుస్తున్నది. ఈ విభాగపు ముఖ్యగ్రామం

తుంబుళ నేటి ఆదోని తాలూకాలోని పెద్ద తుంబళం గ్రామమే. ఈ విభాగం ప్రస్తుతపు ఆదోని–ఆలూరు తాలూకాలలో ఉండి ఉండేదని భావించవచ్చు. (అదే – No. 172 క్రీ. శ 1106; AREp; 1956 57, No. B. 46. క్రీ. శ. 1136)

19. హొంబుళిగె–30 :– క్రీ. శ. 1122 నాటి రెండు శాసనాలలో ఒకటి (AREp; 1920, No. 356) హొంబుళిగె–30నీ, మరొకటి (SII.,Vol. IX, No.202) పొంబుళిగె–70 నీ పేర్కొంటున్నాయి. హొంబుళిగె–30 అంతకంటె పెద్దదైన పొంబుళిగె–70లో భాగమేమో. మొదటి శాసనం పిడమిఱుతూరు గ్రామం (ఇప్పటి గుత్తి తాలూకాలోని మిడుతూరు) ఈ విభాగానికి చెందినదని తెలియజేస్తున్నది. ఈ విభాగపు ముఖ్యగ్రామం హొంబుళిగె (పొంబుళిగె) నేటి గుత్తి తాలూకాలోని హొవంగి గ్రామమే. అందువలన ఈ విభాగం ఇప్పటి గుత్తి తాలూకాలో ఉండి ఉండేదనవచ్చు.

20. మంచాలు–36:– ఆదవాని–500కు చెందిన విభాగాలలో ఇదొకటి. ఈ విభాగపు ముఖ్యగ్రామం మంచాలు, ఇందులోనిదిగా చెప్పబడిన గురిందాల గ్రామం ఇప్పటి ఆదోని తాలూకాలోని మంచాల, గురజాల గ్రామాలే. కనుక ఈ విభాగం ఇప్పటి ఆదోని తాలూకాలో ఉండి ఉండేదని భావించవచ్చు. (అదే–No. 240. క్రీ. శ. 1142).

21. ఆలేరు–40 :– జగదేకమల్లుని సైదాపురం శాసనంలో ఈ విభాగం కొల్లిపాకె–7000 లోనిదిగా పేర్కొనబడింది. ఈ ఆలేరు ఇప్పటి జనగాం తాలూకాలోని ఆలేర్. ఈ విభాగం ఇప్పటి జనగాం తాలూకాలో విస్తరించి ఉండవచ్చు. (భారతి, జూన్ 1979, పుటలు 39–42)

22. కుడియపె–40 :–పశ్చిమ చాళుక్య త్రిభువనమల్లుని తొగరకుంటె శాసనం ఈ విభాగాన్ని కుడియపె–40 అనీ, తొగరికుంటె (నేటి ధర్మవరం తాలూకాలోని తొగరకుంట) ఇందులోని గ్రామమనీ పేర్కొంటున్నది. (SII., Vol.IX, No.221) రాచాన పల్లె శాసనం ఇదేవిభాగాన్ని కుడియణ–40 అనీ, తెడియపల్లి గ్రామం (ఇప్పటి అనంతపురం తాలూకాలోని రెడ్డిపల్లె) ఇందులోనిదనీ పేర్కొంటున్నది. (AREp; 1942, No. B. 69. క్రీ. శ. 1120). అయితే అదే గ్రామంనుండి వచ్చిన మరొక శాసనం ఈ విభాగాన్ని కుడియలిస్థల, కుడియపెయస్థల అని మాత్రమే పేర్కొంటున్నది. (అదే – No. B. 70. క్రీ. శ. 1122) ఈ విభాగం ఇప్పటి అనంతపురం–ధర్మవరం ప్రాంతంలో ఉండి ఉండేదనవచ్చు.

23. కలువచేడు–40–కంపణం :– కొలనుపాక శాసనాలు ఈ విభాగం కొల్లిపాక దేశానికి చెందినదనీ, లాండిపాములంక, నెల్లూటి, వడ్డగి చెరువు గ్రామాలు ఇందులోనివనీ తెలియజేస్తున్నాయి. ఈ విభాగం ఇప్పటి భువనగిరి తాలూకాలో ఉండేదేమో. (AREp., 1961-62 Nos. B. 65, 87. క్రీ.శ.1109, 1112.)

24. పులినాడు–60 :– 8వ శతాబ్దికి చెందిన శాసన మొకటి (అదే–1932, No. 174), 10వ శతాబ్దికి చెందిన శాసనం మరొకటీ (SII., Vol. IX, No.299. క్రీ. శ. 907–55) ఈ విభాగాన్ని పేర్కొంటున్నాయి. తర్వాతి కాలపు చాలా శాసనాలలో ఇది కేవలం పులినాడుగా మాత్రమే వ్యవహృతమైంది. అయితే క్రీ. శ. 1056 నాటి శాసన మొకటి (Mys.Arch.Rep., 1928, No. 31) పులినాడు – 70 విభాగాన్ని పేర్కొంటున్నది. మొత్తంమీద సంఖ్యాంకిత విభాగంగా కంటె కేవలం పులినాడుగానే ఈ విభాగం ఎక్కువ ప్రాచుర్యంలో ఉన్నట్లు కన్పడుతుంది.

25. కానపుక్–70 :– కొలుపోల గ్రామము ఈ విభాగంలోనిదని క్రీ. శ. 973నాటి శాసనం వలన తెలుస్తున్నది. (A.P. Arch. Series, 3, No. Md. 5). ఈ గ్రామం నేటి మెదక్ జిల్లాలోని కొరపోలుగా గుర్తించవచ్చును. అందువలన ఈ విభాగం ఈనాటి మెదక్ జిల్లాలో ఉండి ఉండేదనుకోవచ్చును.

26. రేనాడు–70 :– చూ. రేనాడు–7000.

27. ఆరెమార్గ – 70 :– ఈ విభాగం కొల్లిపాకె–7000కు పక్కనె ఉండేదనీ, గాడిచెరువు గ్రామం ఈ విభాగంలోనిదనీ 11వ శతాబ్ది శాసనాలవలన తెలుస్తున్నది. ఈ విభాగం ఇప్పటి నల్గొండ జిల్లాలో ఉండి ఉండేదనవచ్చు. AREp., 1961–62, Nos. B 71, 60, 68. క్రీ. శ. 1032, 1067,1088.)

28 పుల్లనూరు–70:– కొలనుపాక శాసనం మద్దిగట్ల గ్రామం ఈ విభాగంలోనిదని పేర్కొంటున్నది. ఈ విభాగం కూడా నేటి నల్గొండ జిల్లాలో ఉండి ఉండేదేమో. (అదే–No. B. 90. క్రీ. శ 11 4).

29. కందూరు–70 :–చూ. కందూరు–1000.

30. పొంబుళిగె 70 :–చూ. హొంబుళిగె–30.

31. కోణావని – 70 :– ద్రాక్షారామశాసనము పలవియు, ముక్రోమల, నడుపుంబూడి (నేటి తూర్పు గోదావరి జిల్లాలోని పలివెల, ముక్కామల, నడుపూడి) గ్రామాలు ఈ విభాగంలోనివని పేర్కొంటున్నది. దీనికి శాసనాలలో కోనమండలమనీ, కోనదేశమనీ కూడా వ్యవహారం ఉంది. (SII; Vol. IV, No. 1150. క్రీ. శ. 1128).

32. సౌటు–70:–కుంకనూరు శాసనం ఈ విభాగం నఱనాడి–500 లోనిదనీ, కుకునూరు (నేటి సత్తికొండ తాలూకాలోని కుంకనూరు) గ్రామం ఈ విభాగంలోనిదనీ తెలుపుతున్నది. ఈ విభాగం ఇప్పటి సత్తికొండ తాలూకాలో ఉండేదని భావించవచ్చు. (AREp; 1936, నెం 1. క్రీ. శ 1129).

33. గరుజె–70 :– ఈ విభాగం ఆదవాని – 500కు చెందినదనీ, ఇందులో ఇట్టిగె గ్రామం ఉండినదనీ పెద్దతుంబళం శాసనంవలన తెలుస్తున్నది. ఈ విభాగం ప్రస్తుతపు ఆదోని తాలూకాలో ఉండి ఉండేదనుకోవచ్చు. (SII; Vol.IX, No. 226 క్రీ. శ. 1132).

34. సులియనూరు–70–:– ఈ విభాగం సిరెనాడుకు చేరినదనీ, ఎరడు కెరెగ్రామం (నేటి కళ్యాణదుర్గం తాలూకాలోని ఎరడుకెరె) ఇందులోనిదనీ క్రీ. శ. 1130నాటి ఒక శాసనంవలన తెలుస్తున్నది. ఈ విభాగం ప్రస్తుతపు కళ్యాణదుర్గం తాలూకాలో ఉండి ఉండేదని భావించవచ్చు. (అదే-No. 223.)

35. వేణిసాలె–70 :–ఇది సబ్బి-1000 లోనిదని వేముల వాడ శాసనం వలన తెలుస్తున్నది. (A. P. Arch. Series, 3, Kn. 6. క్రీ. శ. 1106).

36. గిరిప్రతీచి 73 :– వేంగి చాళుక్యరాజైన కుబ్జవిష్ణు వర్ధనుడు త్రిసప్తతి గ్రామపతియైన గిరిప్రతీచిని బుద్ధవర్మకు ప్రసాదించినట్లు మనకు శాసనాలవలన తెలుస్తున్నది. ఈ విభాగాన్నే కొండపడుమర అనీ, కొండపడుమట అనీ చాలా శాసనాలు పేర్కొన్నాయి. (SII; Vol. IV, Nos. 662, 683, 690 మున్నగునవి.)

37. చిందవాడి–86 :– చూ. సిందవాడి–1000.

38. ఎత్తపి–90:– అన్మన్‌బళ్ళి–11, సజిమలె–12, కూళుకుళి-13 ఈ విభాగంలోనివి ఇది వడ్డవణ 500లోనిదనీ, ఇందులో పిన్మనం (లేక బన్మనం), పెట్టుగం (లేక బట్టుగం) గ్రామాలు ఉండేవనీ శాసనాల వలన తెలుస్తున్నది. ఈ విభాగం క్రీ. శ. 988 నుండి 1110 వరకూ గల శాసనాలలో పేర్కొన బడింది. ఈ విభాగాన్ని ఎత్తపి–90–కంపణం అని కూడా వ్యవహరించేవారని మల్లేశ్వర శాసనం తెలుపుతున్నది. (Ep. Ind; Vol. XXXV, pp. 253 ff. క్రీ. శ. 1051). ఈ విభాగపు ప్రధాన గ్రామం ఎత్తపి నేటి కొల్లాపూర్ తాలూకాలోని యేతం గ్రామం.

39. ఏఱువ–మూండు డెబ్బదులు :– ఒక్క క్రీ. శ. 1242 నాటి తురిమెళ్ళ శాసనం మాత్రమే ఈ విభాగాన్ని ఇలా పేర్కొంటున్నది. (అదే–Vol. XXIX, p. 163; AREp; 1950, No. B. 267). మిగిలిన శాసనాలలో ఇది ఏఱువ విషయమనీ, ఏరువ అనీ, యేఱువనాడనీ వ్యవహరింపబడింది. (Ep. Ind; Vol. XXIX, pp. 160 ff. క్రీ. శ. 656; SII; Vol. IX,No. 204 క్రీ. శ. 1122; AREp;1911, నెం.406. క్రీ. శ. 1287). 'మూండు డెబ్బదులు' అంటే ఒక్కొక్క దానిలోనూ 70 గ్రామాలు గల మూడు విభాగాల సముదాయమని అనుకోవచ్చు. కర్ణాటకలోని ఎరడరునూరు విభాగాన్ని (ఒక్కొక్కటి 300 గ్రామాలుగల రెండు విభాగాలు కలిసినది. ఈ రెండు విభాగాలు పులిగెరె-300, బెళ్వొలె-300) దీనితో పోల్చవచ్చు. (SII; Vol. IX, No. 223). ఈ విభాగం ప్రస్తుతపు నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలలో ఉండి ఉండేదని భావించవచ్చు.

40. పొత్తపినాండు విషయం–300 :– క్రీ. శ. 970 నాటి కాండ్యం తామ్రశాసనంలో ఈ విభాగపు ప్రసక్తి ఉంది. (JAHRS; Vol. XI, pp. 80 ff.; AREp; 1938, No. A 26) క్రీ. శ. 1102, 1178 నాటి శాసనాలలో ఈ విభాగం పొత్తపి నాడుగా మాత్రమే పేర్కొనబడింది. (Ep. Ind; Vol. V, pp. 70 ff.; SII; Vol. VI, No. 1187). ఇది ఈనాటి పిఠాపురం తాలూకాలో ఉండి ఉండేదని ఊహించవచ్చు.

41. కన్నె-300 :– ఈ విభాగాన్ని కన్నెనాడని కూడా కొన్ని శాసనాలు పేర్కొన్నాయి. (SII; Vol. IX, No. 121 క్రీ.శ. 1057; Ep. Ind; Vol. XXXVI, pp. 69 ff. క్రీ. శ. 1074). దీనినే సంఖ్యతో కూడా ఉదహరించిన కొన్ని శాసనాలివి:– SII; Vol. IX, No. 119. క్రీ. శ. 1057. AREp; 1943, No. B 38. క్రీ. శ. 1061; తెలం. శాస., II, కళ్యాణి నెం.12. క్రీ. శ. 1073; SII., Vol. IX, No. 147. క్రీ. శ. 1095. AREp; 1959–60, No. B. 122. క్రీ. శ. 1095; అదే–No.B 123. 1097; అదే–No. 124. క్రీ. శ. 1103; తెలం. శాస., II, కళ్యాణి. No. 19. క్రీ. శ. 1107.

ఈ క్రింది గ్రామాలు ఈ విభాగంలోనివిగా పేర్కొనబడి నాయి: దుధియాల (నేటి నందికొట్కూరు తాలూకాలోని దుద్యాల), ఆతుకూరు (అదే తాలూకాలోని ఆత్మకూరు), శివపురము (అదే తాలూకాలోని శివపురం), సురలూరు, జువుటూరు (అదే తాలూకాలోని జూటూరు), కల్గొటు (కర్నూలు జిల్లాలోని కల్గొట్ల), మొసలెయమడువు (నందికొట్కూరు తాలూకాలోని మొసలి మడుగు), పూవినూరు, చిల్లఅ, వడ్డమాని (అదే తాలూకాలోని వడ్డమాని). ఈ విభాగం ఇప్పటి నందికొట్కూరు, అలంపూర్ తాలూకాలలో విస్తరించి ఉండవచ్చు.

ఈ విభాగం తరచుగా అయిజె–300, నఱవాడి-500 పెడెకల్–800తో బాటుగా శాసనాలలో పేర్కొనబడింది. మొస లెయ మడువు రాజధానిగా ఈ నాలుగు విభాగాలనీ ఇరుగణచోళ మహారాజు పాలించేవాడని క్రీ. శ. 1061 నాటి సిద్దేశ్వరం శాసనం వలన తెలుస్తున్నది. AREp; 1943, No. B. 8) అయితే క్రీ. శ. 1079నాటి సంగమేశ్వరం శాసనం వలన కన్నె–300, నరవాడి–500, పెడెకల్-800లను బిజ్జణ చోళమహారాజు ఏతగిరి రాజ ధానిగా పాలించేవాడని తెలుస్తున్నది. (SII., Vol. IX, No.147). ఇలా ఈ విభాగాల సముదాయపు రాజధానులు కాలక్రమేణ మారుతూ వచ్చాయి.

42. అయిజె-300: ఈ విభాగం 11, 12 శతాబ్దుల నాటి శాసనాలలో కన్పిస్తున్నది. (AREp; 1943, No. B. 38 క్రీ. శ. 1061; అదే 1959-60, No, B. 115. క్రీ. శ.

1067; అదే- No. B. 116. క్రీ. శ. 1073; Ep. Ind; Vol. XXXVI, pp. 69 ff. క్రీ. శ. 1074; AREp; 1959-60, Nos. B 119, 125. క్రీ. శ. 1078; అదే 1962-63, No. B. 192. క్రీ. శ. 1091). రాజోలి శాసనం ఈ విభాగాన్ని అయిజెనాడుగా పేర్కొన్నది. (అదే-No. B. 63 క్రీ. శ. 1126-38). పరియళతీర్థ, ఉండవేలి (నేటి అలంపూర్ తాలూకాలోని ఉండవెల్లి), బొరువేలి (అదే తాలూకాలోని బోరువెల్లి), గుడియూరు, కడంబూరు, మద్దూరు (అదే తాలూకాలోని మద్దూరు), పొళసనూరు గ్రామాలు ఈ విభాగంలోనివని శాసనాల వలన తెలుస్తున్నది. ఈ విభాగపు ముఖ్యగ్రామం అయిజె ప్రస్తుతపు గద్వాల తాలూకాలోని అయిజ గ్రామం. ఈ విభాగం ఇప్పటి అలంపూర్, గద్వాల తాలూకాలలో విస్తరించి ఉండేదనుకోవచ్చును. (చూ. కన్నె-300).

43. కణియకల్-300 :- 11, 12 శతాబ్దులలో అస్తిత్వంలో ఉన్న ఈ విభాగానికి ఒకప్పుడు గొందవాడి (నేటి రాయదుర్గ తాలూకాలోని గోవిందవాడి) ముఖ్య గ్రామంగా ఉన్నట్లు క్రీ. శ. 1125 నాటి నరసపురం శాసనం మనకు తెలుపుతున్నది. (SII; Vol. IX, No. 209). క్రీ. శ. 1064 నాటి జటింగ రామేశ్వరం (చిత్రదుర్గ జిల్లా, కర్ణాటక) శాసనం డాకివడు లంకె-70 ఈ విభాగానికి చెందినదిగా తెలియజేస్తున్నది.[15] (Ep. Ind; Vol. IV, pp; 212 ff.) కణియకల్-300 ఇప్పటి అనంతపురం, కర్ణాటకలోని బళ్ళారి, చిత్రదుర్గ జిల్లాలలో ఉండి ఉండేదనుకోవచ్చు. కణియకల్ గ్రామం నేటి రాయదుర్గ తాలూకాలోని కణేకల్లు గ్రామమే.

44. రొద్ద-300 :-హావలిగి, అమరాపురం శాసనాలలో ఈ విభాగపు ప్రసక్తి కనవస్తున్నది. SII; Vol. IX, No. 146. క్రీ.శ. 1079; AREp; 1917, No. 40. క్రీ.శ. 1278). ఈ విభాగపు ముఖ్యగ్రామం రొద్ద ఈనాటి పెనుగొండ తాలూకాలోని రొద్దం గ్రామమే. ఈ విభాగం ప్రస్తుతపు పెనుగొండ తాలూకాలో ఉండి ఉండేదనుకోవచ్చు.

45. కొండపల్లి-300: క్రీ. శ. 1126 నాటి త్రిపురాంతకం శాసనం ఈ విభాగాన్ని పేర్కొంటున్నది. (SII; Vol. IX, No. 213). అయితే క్రీ. శ. 1185 నాటి మరొక శాసనం (అదే Vol. X, No. 241) దీనినే కొండపల్లినాండుగా పేర్కొన్నది. శ్రీ రామేశ్వరదత్తు నేటి విజయవాడ దగ్గరి కొండపల్లి ప్రాంతమే ఈ కొండపల్లి-300 కావచ్చని అభిప్రాయపడ్డారు.[16]

46. పల్లినాండు-300 :- పళ్ళి రాష్ట్రమనీ, పళ్ళినాండనీ, పల్లినాండు విషయమనీ, పల్లి దేశమనీ శాసనాలలో పేర్కొనబడిన ఈనాటి పల్నాడే ఈ పల్లినాండు-300. క్రీ. శ. 1134, 1288ల నాటి రెండు మాచెర్ల శాసనాలలో ఈ విభాగపు ప్రసక్తి ఉన్నది. (AR Ep., 1939, No. 93; అదే-1942, No. B 13). క్రీ. శ. 7వ శతాబ్దినుండే పళ్ళి రాష్ట్రపు ప్రసక్తి ఉన్నా సంఖ్యాంకిత విభాగంగా 12, 13 శతాబ్దులలో మాత్రమే (అదీ రెండుసార్లు మాత్రమే) కానరావటం గమనించదగ్గది.

47. ముళ్కి-500 :- క్రీ. శ. 926నాటి కమలాపురం శాసనం ఈ విభాగాన్ని పేర్కొన్నది. (AR Ep., 1938, No. B 235). అయితే ఆ తర్వాతి కాలపు శాసనాలలో ఇది అనుబంధ సంఖ్య లేకుండా ముళికినాడు, మురికినాంటి దేశంగా వ్యవహృతమైంది. ఇది ఇప్పటి కమలాపురం, సిద్ధవటం ప్రాంతం కావచ్చును.

48. వడ్డవణ-500 :- కందూరునాడుకు చెందిన ఈ విభాగపు ప్రసక్తి అగస్త్యేశ్వరం, మల్లేశ్వరం శాసనాలలో ఉంది. (తెలం.శాస., II, కళ్యాణి. Nos. 39, 41. క్రీ.శ. 988, 991; Ep. Ind., Vol. XXXV, pp. 253 ff. క్రీ. శ. 1051). ఎత్తపి-90 ఈ విభాగంలోనిది. దీని ముఖ్య గ్రామం వడ్డవణ ఈనాటి వనపర్తి తాలూకాలోని వడ్డెమాను.

49. నలువాడి-500 :- ఏడవ శతాబ్ది శాసనాలలో ఈ విభాగం నలువాడి విషయమని పేర్కొనబడింది. (J B B R A S, Vol. XVI, pp. 225 ff. క్రీ.శ. 657; Ep. Ind., Vol. XXII, pp. 24 ff. క్రీ. శ. 692). తర్వాతికాలపు శాసనాలలో నలువాడి -500 అని ఈ విభాగం సంఖ్యా సహితంగా వ్యవహృతమైంది. (AR Ep., 1953, No. B 290. క్రీ. శ. 967; అదే-1943, No. B 38. క్రీ. శ. 1061; SII., Vol. IX, No. 147. క్రీ. శ. 1079). అయితే 11,13 శతాబ్దాల శాసనాలలో దీనినే నలువాడి నాడనీ (Ep. Ind., Vol. XXXVI, pp. 139 ff. క్రీ. శ. 1068), నలువాడి అనీ (AR Ep., 1954, No. B 65. క్రీ. శ. 1071), నలువాడి విషయమనీ (అదే - 1938, No. 315. క్రీ. శ. 1215) పేర్కొనటం జరిగింది పొటు-70 ఇందులో చేరినది. ఈ విభాగం నేటి కడప, కర్నూలు జిల్లాలలో విస్తరించి ఉంటుంది. (చూ. కన్నె-300).

50. పానుంగల్-500 :- క్రీ. శ. 1092 నాటి చిన్న తుంబలం శాసనం ఈ విభాగాన్ని పేర్కొంటున్నది. (SII., Vol. IX, No. 161). దీనినే క్రీ. శ. 1265నాటి పానుగల్లు శాసనం పానుగంటి స్థలమని పేర్కొన్నది. (తెలం. శాస. I, కాకతీయ. No. 4). నేటి నల్గొండ జిల్లాలోని పానుగల్లే ఈ విభాగపు ముఖ్య గ్రామం. ఇదే కాలంలో కర్ణాటకలో కూడ ఒక విభాగం పానుంగల్ (హానుంగల్)-500 అనే పేరుతో ధార్వాడ ప్రాంతంలో ఉండటం గమనించదగింది. (Ep. Ind., Vol. XVI, pp. 44 ff; SII., Vol. XX, No. 142 మొదలైనవి). ఈ విభాగపు ముఖ్యగ్రామం ధార్వాడ జిల్లా, హాన్గల్ తాలూకాలోని హాన్గల్ గ్రామం.

51. ఆదవాని-500 :- 12వ శతాబ్ది శాసనాలలో ఈ విభాగం ప్రసక్తమైనది. (SII., Vol. IX, Nos. 172, 226, 240. క్రీ. శ. 1106, 1132, 1142). ఈ విభాగం సిందవాడి

1000లోనివి. తుంబుళ-30, మంచాలు-36, గరుజె-70లు ఆదవాని-500కు చెందినవి. దీని ముఖ్య గ్రామం నేటి ఆదోని. ఆసక్తికరమైన ఒక అంశం ఏమంటే ఆదవాని ప్రాంతంలోనివే అయిన కందుకూరు-24, గుడికల్లు-24లు ఆదవాని 500లో భాగాలుగా శాసనాలలో పేర్కొనబడలేదు. ఈ రెండు విభాగాల్ని పేర్కొన్న శాసనాల తేదీలు క్రమంగా క్రీ.శ. 1164, 1186లు. అందువలన క్రీ. శ. 1142 తర్వాత ఆదవాని – 500 విభాగంలో మార్పులు జరిగి ఉండవచ్చుననే ఊహకు తావు కలుగుతున్నది.

52. పెడెకల్–800 :— బాదామి చాళుక్యుల శాసనాలలో ఈ విభాగం సంఖ్యారహితంగా కేవలం పెడెకల్ విషయమని వ్యవహరింప బడింది. (JBBRAS, Vol. XVI, pp. 231 ff. క్రీ. శ. 689. ఈ శాసన పరిష్కర్త దీనిని పెడెకుల్ విషయమని పొరపాటుగా చదవటం జరిగింది. JOR., Vol.X, pp. 27 ff. క్రీ. శ. 692,Ep. Ind., Vol. XXXIII, pp. 31 ff. క్రీ.శ. 700).; కళ్యాణి చాళుక్యుల శాసనాలలో ఇది సంఖ్యాయుతంగా కన్పిస్తున్నది. (AR Ep., 1943, No. 38. క్రీ. శ. 1061; Ep. Ind., Vol. XXXVI, pp. 70 ff. క్రీ. శ. 1073-74; AR Ep., 1962-63, No. B 153. క్రీ. శ. 1076-1126; SII., Vol. IX, No. 147. క్రీ. శ. 1079). ఈ విభాగపు ప్రధాన గ్రామం పెడెకల్ బహుశః ఈనాటి ద్రోణాచలం తాలూకాలోని పెండేకల్లు కావచ్చును. ఈ విభాగం కర్నూలు జిల్లాలో కొంత భాగంలోనూ, అలంపూర్ తాలూకాలోనూ విస్తరించి ఉండవచ్చును. (చూ. కన్నె-300).

53. సిద్ది–1000 :— క్రీ. శ. 800 నాటి మాలెపాడు శాసనంలో ఉదాహృతమైన ఈ విభాగపు ప్రధాన గ్రామం ఈనాటి సిద్ధవటం కావచ్చు. (Ep. Ind., Vol. XI, pp. 337 ff .

54. సిందవాడి–1000 :— 9వ శతాబ్ది నుండి 13వ శతాబ్ది వరకూ గల శాసనాలలో ఈ విభాగం సంఖ్యాసహితంగానూ సంఖ్యారహితంగానూ కూడా పేర్కొనబడింది.

సంఖ్యాసహితంగా పేర్కొన్న శాసనాలు :— SII., Vol. IX, No. 55. క్రీ. శ. 893-94; అదే – No. 114, క్రీ. శ. 1054; అదే–Vol. VIII, No. 364. క్రీ.శ 1076-1126; అదే–Vol. IX, No. 190. క్రీ. శ. 1113; అదే – No. 202, క్రీ. శ. 1122; అదే – No. 226. క్రీ. శ. 1132; అదే – No. 277. క్రీ. శ. 1184; అదే – No. 364. క్రీ. శ. 1210.

సంఖ్యారహితంగా పేర్కొన్న శాసనాలు:—Ind. Ant., Vol. XXX, pp. 257 ff. క్రీ శ. 1079; SII., Vol. IX, No. 172. క్రీ. శ. 1106; అదే – No. 294. క్రీ. శ. 1164; అదే – No. 367. క్రీ. శ. 1229; అదే – No. 377. క్రీ. శ. 1278; అదే – No. 384. క్రీ. శ. 1287.

పెద్ద హోతూరు శాసనం (SII., Vol. IX, No. 190. క్రీ. శ. 1113) చిందవాడి–86నీ, సిందవాడి–1000నీ కూడా పేర్కొంటున్నది. మొదటిది బహుశః రెండవ దానిలో భాగం కావచ్చును. ఈసిందవాడి 1000లో ఆదవాని–500, బాగి–12 చేరి ఉన్నాయి. ఈ విభాగానికిచెందిన గ్రామాలలో తుంబుళ (నేటి ఆదోని తాలూకాలోని పెద్ద తుంబళం), కంచగార బెళగల్లు (ఆలూరు తాలూకా), గడియ పోతూరు (నేటి గుత్తితాలూకాలోని గడేహోతూరు), కీర్తి నారాయణ నగర (పైన చూపిన పెద్ద తుంబళమే), మొలదకల్లు, హిరియ తుంబుళ (పెద్ద తుంబళం), నెరళికె (ఆలూరు తాలూకాలోని నెరణికి), అరకెరె (అదే తాలూకాలోని అరికెరె), హొళలుగుంద (అదేతాలూకాలోని హొళలుగుంది), బెంబుగుడి ఉన్నాయి. ఈ విభాగానికి కీర్తి నారాయణనగరం రాజధానిగా శాసనాలలో పేర్కొనబడింది. ఈ విభాగం కర్నూలు, అనంతపురం జిల్లాలలోనూ కర్ణాటకలోని బళ్ళారి జిల్లాలోనూ వ్యాపించి ఉండవచ్చు.

55. సబ్బి–1000 :— సబ్బి సహస్రమనీ, సబ్బి సాయిర మనీ, సబ్బినాండని శాసనాలలో దీనిప్రస్తావన ఉన్నది. (AR Ep., 1961-62, No. A 33. క్రీ. శ. 966; Ep. Ind. Vol. IX, pp. 256 ff. క్రీ.శ.1117; Hyd. Arch. Series, 13, No. 56. క్రీ. శ. 1170). రేపాక–12, వేణిపలె–70 దీనిలో భాగాలు. ఇది ఈనాటి కరీంనగర్, వరంగల్ జిల్లాలలోనూ, మహారాష్ట్రలోని పర్భణి జిల్లాలోనూ విస్తరించి ఉండవచ్చును.

56. వేనాడు :— ఇది వేయినాడు[17] కావచ్చుననీ, రేనాడుకు బదులు పొరపాటుగా వేనాడని శాసనంలో చెక్కబడిఉండవచ్చుననీ,[18] రాజాధిరాజు తమిళ శాసనమందలి వేనాడు, ప్రస్తుతను ప్రసంగములో నున్న వేనాడు ఒకటేననీ[19] విభిన్నాభిప్రాయాలు వ్యక్తమైనాయి. ఇది వేయినాడనుటయే సరియైనది కావచ్చును.

57. వేంగి–1000 విషయము:—చూ. వేంగి–16000.

58. కందూరు–1000 :— చూ. కందూరు–1100.

59. కందూరు–1100 :— చాళుక్య త్రిభువనమల్లుని శాసనాలలో ఈ విభాగపు ప్రసక్తి ఉన్నది. (Ep. Ind., Vol. XXXV, pp. 76 ff. క్రీ. శ. 1110; A. P. Arch. Series, 3, No. Mn. 41. క్రీ. శ. 1121). ఎత్తిపి–90, కందూరు–70 ఈ విభాగంలోనివి. కందూరు – 70 రాజధానిగా పేర్కొనబడిన బూదపూరు గ్రామం నేటి మహబూబ్‌నగర్ జిల్లాలోని బూదపూరు గ్రామమే. ఆలవానిపల్లె శాసనంలో ప్రస్తావించబడిన కందూరు – 1000 అంతకంటె పెద్దదైన కందూరు–1100లోని భాగమై ఉండవచ్చును. (తెలం. శాస., II, కళ్యాణి. No. 29. క్రీ. శ. 1109). ఈ విభాగం సంఖ్యారహితంగా కేవలం కందూరునాడు అనికూడా 11,12,13 శతాబ్దులలోని శాసనాలలో రావస్తున్నది. (Ep. Ind., Vol. XXXV, pp. 253 ff. క్రీ. శ. 1051; A.P.

Arch. Series, 3, No. GB 2. క్రీ. శ. 1058; Ep. Ind., Vol. XXXVI, pp. 139 ff. క్రీ. శ. 1068; A. P. Arch. Series, 3, No. Mn. 49. క్రీ.శ. 1134; Hyd. Arch. Series, 19, Mn. 46. క్రీ.శ 1224). చాళుక్య త్రిభువనమల్ల నికాలంలో కోళ్ళూరు దీనికి రాజధానిగా నుండెడిది. కాకతీయ గణపతికాలంలో వర్ధమానపురం దీని రాజధానిగా నుండినట్లు శాసనాలవలన తెలుస్తున్నది. ఈ విభాగపు ముఖ్యగ్రామమైన కందూరు నేటి వనపర్తి తాలూకాలోని కందూరు.

60 కొళ్ళిపాకె–2000 :— చూ. కొళ్ళిపాకె–7000.

61. వెలనాడు–6000 :— సుప్రసిద్ధమైన ఈవిభాగము వెలనాటి, కోట రాజుల శాసనాలలో కృష్ణవేణ్ణానదీ దక్షిణ తీర షట్సహస్రావనిగా అభివర్ణితమైనది. ద్రాక్షారామ శాసన మొకటి త్రిశతోత్తర షట్సహస్రావనిని పేర్కొన్నది. (SII., Vol. IV, No. 1138. క్రీ. శ. 1133). దాదాపు 10వ శతాబ్దివరకూ గల శాసనాలలో ఇది వెలనాడు విషయమని గాని, వెలనాడు అని గాని ఎక్కువగా వ్యవహృతమైంది. ఆ తర్వాతి కాలపు చాల శాసనాలలో సంఖ్యా సహితంగానూ, సంఖ్యా రహితంగానూ, కేవలం సంఖ్యతో మాత్రమేనూ (షట్సహస్రమహీ, షట్సహస్రావనీ ఇత్యాది) ఈ విభాగం కానవస్తున్నది. ఆంధ్రదేశంలోని సంఖ్యాంకిత విభాగాలలో కేవలం సంఖ్యతో మాత్రమే వ్యవహరింపబడిన విభాగం ఇదొక్కటే

62. ఎమ్మెదలె–6000 :— క్రీ. శ. 1126నాటి త్రిపురాంతకం శాసనం ఈ విభాగాన్ని పేర్కొంటున్నది. (SII; Vol. IX, No. 213). క్రీ. శ. 1269 నాటి యనమదల శాసనంలో ఈ విభాగం ఎనమదల స్థలమని పేర్కొనబడింది. (అదే – Vol. IV, No. 935) 'ఎనమదల' అన్న తెలుగు పదానికి 'ఎమ్మెదలె' అనేది కన్నడ రూపం. (తె ఎనుము. క. ఎమ్మె). ఈ విభాగపు ముఖ్య గ్రామం నేటి గుంటూరు తాలూకాలోని యనమదల.

63 రేనాడు 7000:—ఈ విభాగం కూడ చాల ప్రాచీనమైనదీ, ప్రచురమైనదీని. 6వ శతాబ్దినాటి కలమళ్ళ శాసనమూ, 7వ శతాబ్దినాటి తిప్పలూరు శాసనమూ దీనిని కేవలం రేనాణ్డుగానే పేర్కొంటున్నాయి. (Ep. Ind; Vol. XXVII, pp 220 ff.; అదే pp. 231 ff.) అయితే 7వ శతాబ్దినుండీ గల శాసనాలలో ఈ విభాగం సంఖ్యాంకితంగా మనకు కన్పిస్తుంది. (అదే- Vol. XI, pp. 337 ff. 7వ శతాబ్ది! అదే– Vol. XXIV, pp. 183 ff. 10వ శతాబ్ది). 12వ శతాబ్దినాటి పెద్ద ముడియం శాసనంలో రేనాండు–70 పేర్కొనబడింది. (AREp; 1905, No 350) ఇది రేనాడు–7000లో ఒక భాగమేమో తెలియదు. పైన ఉదహరించిన తిప్పలూరు శాసనం ఎరికల్ముత్తురాజు "చిప్పిలియు పటువాను రేనాణ్డేకుము"న్నట్లు తెలియజేస్తున్నది. అందువలన ఈ విభాగానికి చిప్పిలియు (నేటి మదనపల్లె తాలూకాలోని చిప్పిలి) రాజధానిగా ఉండినట్లు భావించవచ్చు. ఇప్పటి కడప, అనంతపురం, చిత్తూరు, కర్ణాటకలోని కోలారు జిల్లాలలో ఈ విభాగం విస్తరించి ఉండవచ్చు.

64. కొళ్ళిపాకె–7000:– 11వ శతాబ్దినుండి 13వ శతాబ్దివరకు గల శాసనాలలో ఈ విభాగపు ప్రసక్తి ఉన్నది క్రీ. శ. 1112నాటి కొలనుపాక శాసన మొకటి కలువచేడు-40-కంపణాన్ని కొళ్ళిపాకె దేశములోనిదిగా పేర్కొన్నది. గూడూరు, కొలనుపాకలలోని రెండు శాసనాలు కొళ్ళిపాక–2000ను పేర్కొంటున్నాయి. (A. P. Arch Series, 3, No. Ng. 42. క్రీ.శ. 1124; అదే–Ng. 43. క్రీ. శ. 1125). ఈ విభాగము కొళ్ళిపాకె–7000కు చేరినది కావచ్చును. ఈ విభాగపు ప్రధాన పట్టణము కొళ్ళిపాకె నెటి భువనగిరి తాలూకాలోని కొలనుపాక.

65. మహారాజవాడి 7000:- మహారాజవాడి, మార్జవాడ, మార్జవాడి అని శాసనాలలో పేర్కొనబడిన ఈ విభాగం 11, 12 శతాబ్దాలలోని శాసనాలలో మహారాజవాడి–7000గా కనవస్తున్నది. ఇది ఈనాటి కడప, చిత్తూరు, కర్ణాటకలోని కోలారు జిల్లాలలో వ్యాపించి ఉండినది. 12వ శతాబ్దిలో వల్లూరి పట్టణము దీనికి రాజధానిగా నుండేది. AREp; 1912, pt. 2, para 48).

66. అన్మకొండ–7000 :- అన్మకొండ విషయమనీ, అన్మకొండ పట్టణ స్థలమనీ, అనుమకొండనాడనీ శాసనాల వలన పరిచితమైన ఈ విభాగాన్ని క్రీ. శ. 1118 నాటి ఐనవోలు శాసనం అన్మకొండ–7000గా పేర్కొంటున్నది. (తెలం. శాస. II, కాకతీయ No. 1 క్రీ. శ. 1096; SII; Vol. IV, No 935 క్రీ శ. 1269; అదే – Vol. X, No. 442. క్రీ. శ. 1277; AREp; 1957-58, No. B. 13). అయ్యనవోళలు గ్రామం (నేటి వరంగల్ తాలూకాలోని ఐనవోలు) ఈ విభాగంలోనిదని ఆ శాసనంవలన తెలుస్తున్నది. ఈ విభాగపు ముఖ్యపట్టణం నేటి హనుమకొండ.

67. వడుగవటి - 12000:– 9వ శతాబ్ది శాసనాలలో ఈ విభాగపు ప్రసక్తి ఉన్నది. (SII; Vol. IX, No. 5. క్రీ.శ.895–910; AREp; 1932, No. 196; pt. 2, para 5. 9వశతాబ్ది). 11-13 శతాబ్దాల శాసనాలలో ఈ విభాగమే పెరుంబాణప్పాడిగా పేర్కొనబడింది. 'వడుగ' అంటే ఉత్తరమనీ, 'వటి' అంటే పథమనీ తమిళంలో అర్థం. గుడిమల్లం శాసనాలు వడుగవటి మేఱ్కు అన్న విభాగాన్ని పేర్కొంటున్నాయి. (Ep. Ind; Vol, XI, pp. 226 ff. క్రీ. శ. 883; అదే pp. 124 ff. 9వ శతాబ్ది). ఇది ఉదయేంద్రం తామ్రశాసనంలో పేర్కొనబడిన "ఆంధ్రపథాత్ పశ్చిమతః క్షితిః" అన్నదానికి సమానార్థకం. (త. మేఱ్కు. తె. పడమర)· (అదే– Vol. III, pp. 76 ff. క్రీ. శ. 910–16). వడుగవటి - 12000 నేటి చిత్తూరు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాటు, కర్ణాటకలోని కోలారు జిల్లాలలో వ్యాపించి ఉండవచ్చును.

68, 69. వేంగి–12000, 14000:- చూ. వేంగి–16000.

70. వేంగి–16000:–7, 8 శతాబ్దులనాటి శాసనాలలో వేంగి విషయము, వెంగినాండు విషయములు ప్రస్తావన ఉన్నది. (AREp; 1938, No.A 6; JAHRS; Vol. XII, pt. 1, pp.49. ff. భారతి, Vol, XVI, pt. 1, pp. 613 ff. క్రీ. శ. 692; AREp; 1915, No. A 3. క్రీ. శ. 719–55). తర్వాతి కాలపు శాసనాలలో వేంగి-1000 విషయము (అదే–1939, No, A3, భారతి, Vol. XXIII pp. 367 ff. క్రీ. శ. 849-92), వేంగి–1000 (SII; Vol. V, No. 195. క్రీ. శ. 1204), వేంగి-12000 (భారతి, Vol. I, pp. 90 ff. క్రీ. శ. 849–92; A. P. Arch Series, 3, Ng. 41. క్రీ. శ. 1076 – 1126), వేంగి–14000 (SII; Vol. IX, No. 196. క్రీ. శ. 1118), వేంగి మండలం–16000 (Ep. Ind; Vol. IV, pp. 32 ff. క్రీ. శ. 1186–87), వేంగి–16000 (SII; Vol. IV, No. 935. క్రీ. శ 1269) అన్న విభాగాల ప్రసక్తి ఉన్నది. సంఖ్యలో ఇన్ని మార్పులతో కూడిన విభాగం ఇదొక్కటే. ఈ మార్పులకు కారణం పరిశీలించవలసి ఉంది.

71. పాకనాటి విషయం–21000:– సుప్రసిద్ధములైన విభాగాలలో ఇదొకటి. 12వ శతాబ్దికి పూర్వపు శాసనాలలో పాకనాడుగా వ్యవహృతమైన ఈ విభాగం తర్వాతి కాలపు శాసనాలలో సంఖ్యాసహితంగా పాకనాంటి విషయం– 21000 (SII; Vol. VI, No. 206. క్రీ. శ. 1119–1262), పాకనాండు- 21000 (అదే– Vol. IV, No. 935. క్రీ. శ. 1269) అనిన్నీ, సంఖ్యారహితంగా కూడానూ ప్రస్తావించబడింది.

72. నొళంబవాడి–32000:- తెలుగు శాసనాల్లోనూ, చాలా కన్నడ, తమిళ శాసనాల్లోనూ దీని ప్రసక్తి ఉంది. అనంతపురం, కర్ణాటకలోని తుముకూరు, కోలారు, బళ్ళారి జిల్లాలలోనూ ఇది విస్తరించి ఉండేది. ఈ ప్రాంతాన్ని జయించిన మొదటి చోళ రాజరాజు ఈ విభాగానికి 'నిగరిలిశోళ' అనే తన బిరుదుమీద నిగరిలిశోళ మండలమని నామకరణం చేశాడు.

73. ఆంధ్రదేశము–50,000,00:– పులివర్రు శాసనంలో ఈ విభాగపు ప్రసక్తి ఉన్నది. (భారతి, Vol. XXIII, pt. 2, pp. 192-94; AREp; 1937, No.322). ఈ శాసనం వెలనాటి మొదటి రాజేంద్రచోడుడు "పంచాశత్ లక్ష సంయుక్త మంధ్రదేశ"ము పాలించినట్లు తెలియజేస్తున్నది. అయితే ఈ సంఖ్య అతిశయోక్తి అని భావించవచ్చు.

పైన ఉదహరించిన సంఖ్యాంకిత విభాగాల పరిశీలనవల్ల మనకీ క్రింది అంశాలు స్పష్టమవుతాయి. ఆంధ్రదేశంలో ఈ విధమైన విభజన 7వ శతాబ్దినుండి 13వ శతాబ్దివరకూ మాత్రమే కానవస్తున్నది. ఈ విభాగాలలో మిక్కిలి చిన్న విభాగపు సంఖ్య 11, మిక్కిలి పెద్దది 32000. (50 లక్షలను అతిశయోక్తిగా పరిగణించి లెక్కలోకి తీసుకోలేదు.) ముఖ్యంగా ఈ విభజన రెండు విధాలుగా జరిగింది–దశాంశ విధానం (decimal system), ద్వాదశాంశ విధానం (duodecimal system) (12, 24, 36 వంటివి). అయితే ఈ రెండు విభాగాలలోకీ చేరనివి–11, 13, 73, 86వంటివి–అక్కడక్కడా ఉన్నాయి. సంఖ్యలు సార్వకాలికాలు కావు. కొన్ని విభాగాలు మొదట సంఖ్యారహితంగా ఉండి తర్వాత కాలంలో సంఖ్యాసహితాలైనాయి. మరికొన్ని ఇందుకు భిన్నంగా మొదట సంఖ్యాసహితాలుగా ఉండి తర్వాత సంఖ్యలు లేకుండా వ్యవహరింపబడినాయి. కొన్ని విభాగాల సంఖ్యలలో మార్పులు సంభవిస్తూ వచ్చాయి. ఇందుకు మంచి ఉదాహరణ వేంగి. ఈ విభాగం సంఖ్యలు 1000 నుండి 16000 వరకూ మారుతూ వచ్చాయి. పరిపాలనా సౌకర్యం దృష్ట్యా మాత్రమే ఈ మార్పులు జరిగాయనటానికి వీలులేదు. ఇందుకుగల రాజకీయ కారణాలను కూడ పరిశీలించవలసి ఉంది. ఇంతవరకూ మనకు లభించిన సామగ్రి ఆధారంగా ఏ ఒక్క సంఖ్యాంకిత విభాగంలోని అన్ని గ్రామాలనీ నిస్సందేహంగా గుర్తించటానికి వీలుపడలేదు. సంఖ్యాంకిత విభాగాలుగా విభజించటం అనేది నేటి రాయలసీమ ప్రాంతంలో చాలా ప్రచురంగా ఉన్నట్లు పై పరిశీలన వలన స్పష్టమవుతుంది. మొత్తంమీద చిన్న సంఖ్యలు (అంటే 1000 వరకూ) ఆయా విభాగాలలోని గ్రామాల సంఖ్యనే సూచిస్తాయని నిర్ణయించవచ్చు. కాగా పెద్ద సంఖ్యల అర్థం భావి పరిశోధనలవల్ల తేలవలసిందే.

## అధోజ్ఞాపికలు

1 JRAS., 1912, p. 708.

2 R. G. Bhandarkar Commemoration Volume (Poona : 1917), pp. 238-39.

3 South Indian Polity (Madras : 1955), pp. 308 – 12.

4 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము (హైదరాబాద్ : 1963), పుటలు 43–48.

5 Local Self Government in redieval Karnataka (Dharwar : 1964), pp. 24-28.

6 Indian Epigraphy (Delhi : 1965), pp. 383-88.

7 గ్రామస్యాధిపతిః కుర్యాద్దశ గ్రామపతిం తథా
వింశతీశం శతేశంచ సహస్రపతి మేవ చ॥

గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామటికః శనకైః స్వయమ్
శంసే ద్గ్రామ దశేశాయ దశేశో వింశ తీశినే॥

వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్
శంసేద్గ్రామ శతేశస్తు సహస్రపతయే స్వయమ్॥

యాని రాజప్రదేయాని ప్రత్యహం గ్రామ వాసిభిః
అన్న పానేంధ నాదీని గ్రామిక స్తాన్య వాప్నుయాత్॥

దశీ కులం తు భుంజీత వింశీ పంచ కులాని చ
గ్రామం గ్రామ శతాధ్యక్షః సహస్రాధిపతిః పురమ్॥

— మనుస్మృతి (బొంబాయి: 1925), VII, శ్లో. 115–19.

8 Gaikwad Oriental Series, Baroda, 3, శ్లో. 159–61.

9 ప్రా. చా. భూ., పుటలు 47-48.

10 ఫ్లీట్, ఈశ్వరదత్తు.

11 ఈ సందర్భంలో ఒకరు ("బ. వి.") "కడపజిల్లా ప్రొద్దుటూరులో క్రీ. శ. 925–5 మధ్యకాలంనాటి శాసనంలో 'రేనాణ్డు ఏఱువేలు నేల' (ద. హిం. శా. సం. 10, నెం. 598). ఇక్కడ 'నేల' అనగా పాలం అని సమకాలీన శాసన ప్రయోగాలవల్ల స్పష్టం అవుతుంది" అని అభిప్రాయపడ్డారు. (భారతి, ఫిబ్రవరి, 1979, పుట 64). కాని ఈ వాక్యానికి అర్థం "రేనాణ్డు ఏడువేలను ఏలుచుండగా" అని మాత్రమే. అదే శాసన సంపుటంలోని 594, 595వ శాసనాలని కూడా చూడవచ్చును.

12 AR Ep., 1961-62, Nos. B 94, 70, 63.

13 Ep. Ind., Vol. IV, pp. 183-93.

14 ఇందులో కొన్ని విభాగాల్ని గురించి మాత్రమే శ్రీ కుందూరి ఈశ్వరదత్తు తమ ప్రా. చా. భూ. లో చర్చించారు.

15 డాకి వడులుంకె–70**లో** కిరియడాకి వడు వంగి గ్రామం చేరి ఉన్నట్లు అదే శాసనం తెలియజేస్తున్నది. ఈ విభాగం ఈనాటి చిత్ర దుర్గ జిల్లాలో ఉండినదేమో.

16 ప్రా. చా. భూ., పుట 106.

17 Ep. Ind., Vol. XXX, pp. 282-83.

18 అదే.

19 ప్రా. చా. భూ , పుట 309.

# సందె చినుకులు

## ప్రత్యూష

**చీ**కటిలో
పగటిగా విరిసే దీపం
పగటిలో చీకటిరెప్పల పరదాలు కప్పుకున్న కన్నుల్లో
ఆశాతైలం పోస్తుంది!
నల్లని **మ**బ్బుల గుండె గుహల్లో
లీలగా వెలిగే తటిల్లేఖాజ్వాల
తృటికాలమే బతికినా
మోడువారిన జీవన నందన వాటిలో
కోటి వెలుగుపూలు విరియిస్తుంది!
ఇదుమల జడిలో నాని**వా**ని
కడకంటరాలే కన్నీటి బొట్లలో
కడకు వాడని ఇంద్రచాపం వెలిగి
వైతల వైతరణిపై
రాచ**బా**ట పరుస్తుంది
యుగయుగాల ఈ ధనబుణధృవాల ఒరిపిడిలో
ఉరుములు ఉరిమి ఉరిమి
మెరుపులు మెరిసి మెరిసి
జగాల ముంగిట చివరకు హర్షాలే వర్షాలై కురుస్తాయి
కొసకు నవనవోన్మేష
అనురాగ సస్యాలే ఆహ్లాదిస్తాయి
ఈమధ్యందిన చండభానుడు
గుడ్లురిమి ఉరిమి
చివరకు కుడిఎడమల లక్షల చేతులతో
విసురుతాడు పడివడిగా
జడిగా కురిసేలా తేనెల సోనలు
వ్రాయలేని
గీయలేని సందెచినుకులు!

[నా అముద్రిత ఖండకావ్యం "సందె చినుకులు" లో నుండి]

# ధవళ తురంగాలు

నురగలు గక్కుతూ
ఉరకలు వేసే
శత సహస్ర ధవళ తురంగాలు
ఈ సముద్ర తరంగాలు.

అంతూ దరీ లేని ఈ పందేల్లో
జయాపజయాలూ, జాక్‌పాట్లూ లేవు.

గమ్యం చేరగానే
సాగరంతా నీరు కారి
నేలకూలి తిరోగమించే
తురగాలు తీరాన కక్కిన
దివ్య రజతాభరణాలు మాత్రం
అవి వూరికే రాలేదని
ఒక్కక్షణం నిక్వాణం చేసి
అదృశ్యమౌతున్నాయి.

# సాగరిక సోయగాలు

ఈ సాగరిక సోయగాలు
ఏమని వర్ణించగలను ?

ఉదయ భానుడు తాకగానే
సిగ్గు దొంతరల లే నవ్వుమొగ్గ;
మధ్యాహ్న సూర్యుని తీక్ష రోచుల
మిరుమిట్లు గొల్పే సౌందర్య గర్విత;
సాంధ్యరాగపు అరుణ కాంతుల
దరహసించే కుంగరదన;
వెన్నెల్లో స్మేరవదన;
మబ్బుల్లో మ్లానవదన;
తటాలున పెకిసే మెరుపులో
ఫకాలున నవ్వే ప్రౌఢ.

# కర్కాటక పురి

సహస్రకోటి హస్తాలతో అనవరతం
కాలుడిలా వరుణుడు తలుపు తడుతున్నా
నిర్భీతిగా కాపురంచేసే ఈ కర్కాటకులు
నింగివైపు నేలవైపు ఎందుకలా
బిక్కు బిక్కుమంటూ చూస్తారు ?

తెల్లటి ఉడుపుల్లో ముచ్చటగా పరుగులెత్తి
ఆడుకునే బాలబాలికలు –
దగ్గరకెళ్లి చూద్దామంటే -
ఎందుకలా ఇళ్లల్లో దూరి
తలుపులేసుకుంటారు ?
ఎర్ర చీరల్లో ముత్తైదువలు
ఘోషా స్త్రీలలా తలుపువార నుంచుని
ఓరగా చూస్తారేగాని,
బయటికి రావడానికి భయపడతారేం ?

*　　*　　*

వరుణుడి చేతుల్లో లేని మృత్యువు
నింగిలో నల్లగా గిరికీలు కొడుతూంది.
నగరంనుంచి రెండు కాళ్లమీద నడిచే చీకటిలా
పదే పదే దాడిచేసి
ఈ అమాయక కర్కాటకుల్ని
కర్కోటక హింసలపాలుచేసి
నాశం చేస్తుంది.
అందుకే వీరికింత భయం.

డా॥ పి. జి. రామారావు

మహేంద్ర

పెద్ద కథ ప్రారంభం

# కనిపించని కోయిల

పరుగెత్తే రైలు నిలిచే ఒక క్షణం ఆ స్టేషన్. దినమంతా సోమరిగా వుండే స్టేషన్ పరుగెత్తే ఒక క్షణమే ఆ రైలు. -

ఆ స్టేషన్ పట్టణానికి చాలా దూరంగా వుంది. స్టేషన్లో నుంచీ వూర్లోకొక పుంత దారి, దారి కిరుప్రక్కలా దట్టంగా పెరిగిన కంచె చెట్లు, ఊరి చుట్టూ వరి పొలాలు, చెరకు మళ్ళు, ఆకు దోటలు, మామిడి తోపులు – అంతటా అక్కడక్కడా తొంగిచూచే కొబ్బరి చెట్లు. ఊరిప్రక్క నొక వాగు. వాగు మీదొక వంతెనా, వంతెన మీద వెళ్ళే రైలూ -

స్టేషన్లో రైలు ఆగిన చప్పుడు. రైలు ఆగమనంలో దుమ్మురేగి పైకెగిరిన ఎండుటాకులు రైలు ఆగడంతోనే నేల మీద పడ్డాయి. పోర్టరు సూరన్న రేణి పండ్ల బుట్ట లుంచిన ట్రాలీని తోసుకుని బ్రేక్ వేన్ కేసి నడిచాడు. పోస్ట్మేన్ 'ఆరెమ్మెస్' నుంచి తపాలా సంచీ దించుకుంటున్నాడు ఇడ్లీ లమ్మే పిల్లవాడు రైలు కిటికీల గుండా పాసింజర్లతో బేరం సాగిస్తున్నాడు. అక్కడొకడూ ఇక్కడొకడూ ఒకరిద్దరు బిచ్చగాళ్ళు దిగారు.

నిశ్శబ్దం భరింపలేనట్టుగా రైలు ఒక చిన్న కూతవేసింది. బుడుంగున చెరువులోనికి మునిగిపోతున్న గులకరాయిచేసే శబ్దంలా స్టేషన్ గంట మ్రోగింది.

సరి సరి. ఇప్పటికే అరగంట లేటు, తెములమన్నట్టుగా విజిల్ వేస్తాడు గార్డు.

''వెళ్తానహో!...కూక్''

తనకు తానే బహుపరాకుగా సాగిబారుతుంది రైలు.

''వెళ్ళెహో...'' ప్రొద్దు బారడెక్కినా లెక్కసేయకుండా సీటు కింది బిచ్చగాడు అటు దిరిగి పడుకున్నాడు.

రైలు వెళ్ళిపోయినా అలవాటుగా జెండా వూపుతూనే ఉండిపోయాడు ఎస్సెమ్ శ్రీరాములు.

ఇది రోజూ జరిగే తతంగమే. ఐతే ఆరోజు –

''ఏంసార్! బాగున్నారా'' అన్న రవి పలకరింపుతో స్టేషను మాష్టరు ఇహలోకం లోకి పడ్డాడు. ఐతే ఆ పలకరిస్తున్న యువకుడెవడో ఆయన కింకా గుర్తు రావడం లేదు. గుర్తించడానికి ఆయన పడుతున్న అంతర్మథన మంతా ముఖంలో స్ఫుటంగా కన్పిస్తోంది.

''నేనండీ, రవిని. రామనాథంగారి అబ్బాయిని'' అంటూ రవి తనను తాను పరిచయం చేసుకున్నాకగానీ శ్రీరాములు పడుతున్న విచికిత్స ఒక కొలిక్కి రాలేదు.

''నువ్వా నాయనా, బాగా మారిపోయినట్టున్నావు! అందుకే గుర్తుపట్టలేకపోయాను. చదువు పూర్తయినట్టేనా?'' కుశల ప్రశ్నలువేస్తూ ఆఫీసువైపు నడిచాడు శ్రీరాములు.

''ఈ ఏటితో బి. ఏ. పూర్తవుతుందిసార్. ఆఖరి పరీక్ష నిన్ననే జరిగింది. హాస్టల్ రూంను నిన్ననే వెకేట్‌చేసి, సిరిపురం జంక్షను వరకు మెయిల్లోవచ్చి, రాత్రి అక్కడనుంచి రెండు గంటల పాసింజర్లో వస్తున్నాను.'' అంతకు ముందొక నెల రోజులుగా పరీక్షలకై విపరీతంగా శ్రమించడంవల్ల, రాత్రంతా ప్రయాణం చేసిన బడలిక చేతా అలసిపోయిన రవి హోల్డాలు, సూట్‌కేసులను ఇరుచేతుల్తో మోస్తూ స్టేషన్‌మాష్టర్ని అనుసరించాడు.

దుమ్ముకొట్టుకపోయిన తలా, నలిగి మాసిపోయినబట్టలూ, నిద్ర జాలక ఎర్రబడ్డ కళ్ళు, చేతుల్ని లాగేస్తున్న లగేజీ – తన వాలకం జూసి తానే జాలిపడిపోతూ రవి చివరికెలాగో ఆఫీసువరండాలోని బెంచీ మీదికి జారిపోయాడు. సినిమా చివర్లో అనేక కష్టనష్టాలకోర్చి కలుసుకున్న హీరో హీరోయిన్లు ఒకరిపై కొకరు వాలిపోయినట్టుగా సూట్‌కేసు, హోల్డాలు ఒకదాన్నొకటి ఆనుకుని చేరగిల పడిపోయాయి.

''సరీ ఒక రాత్రి ప్రయాణానికే ఇంత డీలా పడిపోతే ఎలాగయ్యా! లే, లేచి కొళాయి దగ్గరికెళ్ళి ముఖం కడుక్కుని రా. ఎండ అప్పుడే కరకరలాడిపోతోంది.'' అంటూ శ్రీరాములు రవితో ఉపశమన వచనాలు పలికి, సూరన్నతో ఫ్లాస్కుతో కాఫీ తెమ్మని తన క్వార్టర్సుకు పంపించాడు.

ప్లాట్‌ఫారం అంతటా ఒక విచిత్రమయిన ప్రశాంతత పరచుకుని వుంది. స్టేషన్లో దిగి మళ్ళీ వెళ్ళిపోయే దేశద్రిమ్మరి బిచ్చగాళ్ళ లాంటి గాలులు మాత్రం ఆకుల గుబుర్లలో వుండి వుండీ సవ్వడి చేస్తున్నాయి.

చల్లటి కొళాయి నీళ్ళతో ముఖం కడుక్కుని స్టేషనునంతా పరికించి చూస్తూ తిరిగి ఆఫీసులో కడుగుబెట్టేసరికి రవికి టేబిల్ మీది ఫ్లాస్కు మూతలో కాఫీ సెగలు గ్రక్కుతూ కన్పించింది. స్టేషను మాష్టరు రిజిష్టర్లోకి ముఖంబెట్టి సన్నగ కూనిరాగం తీస్తూ కూడికలు వేసుకుంటున్నాడు.

రవి కాఫీ త్రాగడం ముగించి లేచి, పాంటు జేబులోంచి దువ్వెనతీసి తల దువ్వుకుంటూ ''ఇంటికి వెళ్తాను సార్. ఎండెక్కిపోతోంది'' అంటూ సెలవుపుచ్చుకున్నాడు. శ్రీరాములు సూరన్నతో హోల్డాల్ను రామనాథం గారింటి దగ్గర దింపి రమ్మని పురమాయించి, మళ్ళీ రిజిష్టర్లోకి తల దూర్చేశాడు.

స్టేషన్లో నుంచి ఊర్లోకి వెళ్ళేదారి ఒక మైలుకు పైగా వుంటుంది. సూరన్న మారిపోతున్న వూరిని గురించి, మనుషుల్ని గురించి ఏకరువు పెడుతున్న మాటల కన్నింటికీ ఊ కొడుతూ ఆ దారి వెంబడి నడువసాగాడు రవి. గత ఇరవై ఏళ్ళ జీవితంలో తనకు పదిహేనేళ్ళకు పైగా గాఢ పరిచయంగల ప్రాంతమంతా పెద్ద మార్పులు లేకపోయినా కొత్తగా కనబడుతూండడం మరి చోద్యంగా వుంది రవికి. నిర్జనంగావున్న రోడ్డులో ఊరు దగ్గరబడేసరికి ఒక రిద్దరుగా మనుషులు ప్రత్యక్షం కాసాగారు. వారిలో చాలా ముఖాలు క్రొత్తవిగా వుండడం, పాత ముఖాలు గూడ క్రొత్తగా కన్పడడం చేత ఏదో కొత్త ప్రపంచంలోకి వచ్చినట్లుంది అతని పరిస్థితి. ''ఏం నాయనా బాగున్నావా!'', ''చదువు పూర్తయిందా'' అంటూ కన్పించిన వారందరూ వేసిన ప్రశ్నలే మళ్ళీ మళ్ళీ వేస్తుండడం చిరాకు కల్గిస్తోంది అతనికి. ఇంటి గడప ఎక్కేసరికి ట్వైవ్ పది దాటిందని గడియారం చెబుతోంది.

తడి చేతితో కొంగును తుడుచుకుంటూ వంటింటిలోనుంచి వచ్చి రవి ప్రక్కగా నిలుచుంది అతని తల్లి జానకమ్మ. పొగలో నుంచి రావడం వల్లనో, ఏడెనిమిది నెలల తర్వాత కొడుకును చూడడం వల్లనో ఆమె కళ్ళ చివర్లు కొద్దిగా తడిసి వున్నాయి.

అపురూపంగా కొడుకుకేసి చూస్తూ ''నీళ్ళు త్రాగుతావా రవీ'' అంటూ లోనికెళ్ళి నీళ్ళు దెచ్చింది జానకమ్మ. నీళ్ళు త్రాగి చెంబు నామెచేతికిస్తూ రవి ఇల్లంతా కలయజూసాడు. పెరటివైపు వరండా గుమ్మం పుచ్చుకు వూగుతున్న చెల్లెలు అమల నవ్వుతూ అంది

''అన్న బాగా పొడుగయినాడు గదమ్మా!''

''హాస్టల్లో ఏం దింటున్నావురా నాయనా, మరీ చిక్కి పోయావు! ఎండల్లో తెగదిరిగావు కాబోలు, ఛాయకూడ తగ్గింది'' వాపోయింది జానకమ్మ.

''అదేం లేదమ్మా. అక్కడ ఎండలు మరీ ఎక్కువ. సాయంత్రం అయిదింటికి గాని హాస్టల్ వదిలేవాళ్ళం గాదు. ఇరవై నాలుగ్గంటలూ ఫేన్ దిరిగినా చెమటతో, ఉక్కలో వొళ్ళంతా హూనం అయిపోయేదనుకో! పగలంతా నిద్రబోయి రాత్రే చదివే వాళ్ళం'' సంజాయిషీ చెప్పుకున్నాడు రవి.

''సంక్రాంతి కొస్తావని రాలేదేమన్నా? నేను, రాజా, అమ్మ, నాన్న అందరూ చూసి చూసీ విసిగిపోయాం అనుకో. పశువుల పండుగ మరుదినం అమ్మకు జ్వరంచేసి రాత్రిళ్ళు నిన్నే కలవరిం చింది'' అమల నిష్టూరం జేసింది.

''వద్దామనే అనుకున్నామమ్మా! కానీ పోర్షన్సు జరగలేదని లెక్చరర్లందరూ స్పెషలు క్లాసులు దీసుకున్నారు. ఐనా అమ్మకు జ్వరం చేసిందని మీరు ఉత్తరంలో వ్రాయలేదే'' తల్లికేసి ఆపేక్షగా జూస్తూ అన్నాడు రవి.

''సర్లేరా బాబూ, ప్రయాణంలో బాగా అలసిపోయినట్టు న్నావు. లేచి బట్టలు విప్పి పంచెకట్టుకో. నూనంటుతాను స్నానం చేద్దువుగాని, బడలిక తీరుతుంది.'' అంటూ దండెం మీది నుంచి పంచె నొకదాన్ని తెచ్చి ఇచ్చింది జానకమ్మ.

షర్టు విప్పబోతూ అందాకా వీధివైపు వరండాలో నిల్చుని వున్న సూరన్నను చూశాడు రవి.

''వెళ్ళొస్తాను బాబూ! సాయంత్రం టేషను కాడికొస్తారు గదా'' అంటూ కదలబోయాడు సూరన్న.

''సూరన్నా, రేణిపండ్లు తేలేదా'' అమల గట్టిగా కేకవేసింది, పెరటివైపు వరండాలో నుంచే.

''లేదమ్మా. సాయంత్రం అన్న దగ్గర యిచ్చి పంపిస్తాలే'' అన్నాడు సూరన్న. పర్సులో నుంచి ఓ యాభై పైసల నాణెందీసి వెళ్ళబోతున్న సూరన్న చేతిలో వుంచాడు రవి.

చిన్న తువ్వాలు చుట్టుకుని పీటపై కూర్చున్నాడు రవి. జానకమ్మ తల అంటుతూ అడిగింది :

''హాస్టల్లో రోజూ చన్నీళ్ళేనారా? అక్కడి పిల్లలు తలంటు కోవడం లాంటిదేమైనా వుంటుందా?''

''చన్నీళ్ళయినా అలవాటయినాక ఏం జేస్తాయిలే అమ్మా! అవయినా రెండు నెలల క్రితం వరకు రోజంతావచ్చేవి కొళాయిల్లో. ఒకటి ఒకటిన్నర నెలలుగా రోజుకు ఒకటి రెండు గంటలుమాత్రమే వచ్చేవి. మార్చి నెలలో ఒకసారి కొళాయిల్లో నీళ్ళురాక వరుసగా మూడు రోజులు స్నానం చేయలే దెవరూ.''

''ఏం చదువులో లేరా రవీ — హాయిగా ఇంటి పట్టునుండి పొలం పుట్ర చూసుకునే దాంతో సమానమా ఏమన్నానా'' అని నూనెగిన్నె పెట్టిరావడానికి వంటింట్లోకెళ్ళింది జానకమ్మ.

''రాజా ఎక్కడే అమలా? నాన్నా, వాడూ వచ్చినప్పట్నుంచి అసలు కన్పించనేలేదు'' చెల్లెల్ని అడిగాడు రవి.

''ఫరవాలేదే! ఇప్పటికయినా గుర్తొచ్చారు'' నవ్వుతూఅంది అమల ''నాన్న ఉదయంఅనగా వెళ్ళారు రామాపురానికి స్ప్రేటేట్ తీసుకురావడం కోసం. రాజా సంగతిమాత్రం నన్నడక్కు. వస్తోంది అమ్మనే అడుగు సుపుత్రుడి లీలలు'' అంటూ తల్లి దెస చూపించింది.

''వాడు నా మాటలు మాత్రం ఏం వింటాడులేరా రవీ! పరీక్షల వరకయినా ఉదయం సాయంకాలం ఇంటి పట్టున వుండే వాడు. సెలవులు మొదలయినప్పట్నుంచి యింటి దగ్గరొక క్షణం ఉండడం లేదు. ఊరంతా బలాదూరుదిరగడంలో వాడికదేం ఓపికో గానీ నాయనా — వాడికి అరికాల్లో చక్రం పుట్టినట్టుంది. దానికి తోడు వాడికి సరయిన సైన్యం దొరికింది. వూర్లో ఏమూల ఏం జరిగినా ఈ కోతిమూక అక్కడ హాజరు ...... మీ నాయనకా ఒక క్షణం తీరికలేదు. ఒంటిమనిషి సేద్యమా, ఎక్కడికని దిరగతారు. మడి చెరువుకింద. తోపావంక వార, చేనేమో గుట్టకింద. ఇప్పుడు కూలీలు మరీ బరితెగించిపోయారు. నిక్కి, నీలిగి పదకొండుగంటల బండొచ్చే వేళకి వొస్తార్రా, సందేళ పొద్దొక పక్క గూట్లో పడక ముందే కయ్యవెలికి కాలుబెడ్తారు. మనిషుంటే ఒకపనీ, మరుగైతే

ఒక పని. మళ్ళీ రూకలు ఒకణా తగ్గితే గొంతుగోసిన కోడిలా గిలగిల కొట్టుకుంటారు. నిరుడు సాల్లో చెరువులో నిరెండి నాలుగెకరలూ బీడేగదా — పోయిన్నెల్లో అదేం మాయ తుపానో వారం పది రోజులు ఒకటే జడిపట్టుకొని మామిడిచెట్లు పూతా, పిందే అంతా రాలిపోయి ఈసారి యింటికి గూడ పండ్లు కరువే ......''

కాశ్మీరులోనో, ఊటీలోనో తీసిన పూర్తి అవుట్‌డోర్ ఈస్ట్‌మన్ కలర్ సినిమాను చూసి వెలుపలికొచ్చి, సైడు కాలువ ప్రక్కటీ కొట్లో పదిపైసల పైసలిచ్చి మంచినీళ్ళకంటే ఏ విధంగాగానీ నయంగా లేని టీ నీళ్ళు త్రాగినట్టుంది రవి పరిస్థితి, తాను కాలేజీ నుంచి స్వగ్రామం రావడం.

అమల రెండు చెవులను చిటికెన వేళ్ళతో మూసుకుంటూ ''అబ్బబ్బా, అయిపోయిందా అమ్మా నీ సోద! జరుగుతున్నదంతా జరుగుతూనే వుందిగదా! నీకు మాత్రం ఎందుకీ లేనిపోని ఆరాటం '' అంటూ విసుక్కుంది.

రవి లేచి నిలబడి సబ్బు అందుకోబోతున్నవాడు ఆగి ''నీకేం తల్లీ అందరిదీ ఆరాటమే! రేపు మీ అత్తగారికి మాటపడకొండా ఇచ్చుకోవలసింది మేమేగదా'' నవ్వుతూ చెల్లెలి పైకి ఒక విసురు విసిరాడు.

''నువ్వు గూడ అమ్మకు వంతపాడడం మొదలెట్టావా తండ్రీ! ఇక ఇంతే సంగతులు'' పరుగ్గా వరండాలోకి నడిచిపోయింది అమల.

ఎండ కొబ్బరాకులనుండి తొట్టిలోని నీళ్ళపై తళతళ మెరుస్తోంది. వాన వెలిశాక బైటికొచ్చిన సూర్యునిలా సబ్బు బిళ్ళ నీలంరంగు సబ్బుపెట్లో నిగనిగలాడుతోంది. తలారా స్నానం చేయడంతో రవికి కొత్త జన్మ ఎత్తినంత తేలికగా వుంది. దొడ్లో పూల చెట్లు ఏపుగా పెరిగి ఇంటిచుట్టూ ఆహ్లాదకరమయిన వాసనల్ని వెదజల్లుతున్నాయి.

''ఈ ఏడు తుపానువల్ల వాటిల్లిన నష్టం మాటకేమిగాని కొండా కోనా బాగా పచ్చబడినట్టుంది గదమ్మా!'' టవలుతో తడి తలను తుడుచుకుంటూ ఇంట్లోకి దారితీసాడు రవి.

''అవును వడ్లకుప్ప వర్తపోయినా వాన కరువు పడకూడదుగదా. ఈ వానల్లో చెరువునిండి మొరవబోతోందిగదా. ఇంక రెండు మూడు ఫలితాలకు నీళ్ళభయంలేదు'' పీట వేసి పళ్ళెం ముందు బెడుతూ అంది జానకమ్మ.

''అదేమిటమ్మా, అమల పెరటివైపు వరండా వదలి రావడం లేదు! రాజా ఎప్పటి కొచ్చేటట్టు? అమల్నైనా పిలువు అన్నం తినడానికి'' అన్నంలోకి పచ్చడి కలుపుకుంటూ అన్నాడు రవి.

''దానికేం తొందరలేరా? తెల్లారక ముందొకసారి, తొమ్మిదికొకసారి అప్పుడే రెండుసార్లు చద్దన్నం ఉప్మా వరసబెట్టి మెక్కింది'' అంది జానకమ్మ.

గోంగూర, ఆవకాయ, గడ్డపెరుగు, వడియాలు మొదలైన వాటితో రుచికరమయిన పల్లెటూరి భోజనం సంతుష్టిగా తిన్న రవికి లోకమంతా సుఖసంతోషాలతో మునిగి తేలుతున్నంత సంతృప్తిగా వుంది. త్రేవ్‌మని త్రేన్చుతూ నడవకు ఉత్తరంవైపు గదిలో కెళ్ళి మంచంమీద పడుకున్నాడు, ఆ రోజుటి పేపరు తిరగేస్తూ.

హెడ్‌లైన్సు చూసేసరికి లీలగా ఆవులింతగా ప్రారంభమయిన మత్తు-పది నిముషాలయ్యేసరికి అవలీలగా గాఢనిద్రగా మారిపోయింది.

★ ★ ★

దాదాపు నాలుగు గంటల సమయంలో నిద్రాభంగం కల్గింది రవికి. అలవాటుగా చేయి ఎడమవైపు కెళ్ళింది టేబిల్ పైని రిస్ట్ వాచ్ అందుకోడానికి. కానీ అంతలోనే యిది ఇల్లనీ హాస్టల్ రూం కాదనీ తెలిసొచ్చింది. కొంచెం తుంపర కూడా పడివుండడంతో పరిసరాలు మట్టివాసన వేస్తున్నాయి. వంటింటిలోనుంచి ఏవో ఫలహారాల వాసనలు, కిటికీగుండా పందిరి అంతా అల్లుకుని ఇంటిపైకి ననలు సాచుతున్న మల్లెతీగలనుంచీ పూలవాసనలు—అన్నీ కలిసి ఏదో విచిత్ర వాతావరణం తలపిస్తున్నాయి.

ఐతే నిజానికి రవికి నిద్రాభంగం కల్గడానికి ఇవేవీ కారణం కావు. కొండపైనుంచి లోయల్లోకి దూకుతున్న సెలయేరు చేసే ధ్వని పోలిన శబ్దప్రవాహం ఏదో నేరుగా తన నెత్తిమీదనే దూకుతున్నట్టు, పాయలుగా చీలి శరీరమంతా ప్రవహించి నిశ్శబ్దంలోకి కలసిపోతున్నట్టు అతనికి తోచింది.

పెరట్లోవున్న అమలతో తన గదిలోనుంచే ఎవరో పెద్దగా సంభాషణ సాగిస్తున్నారు. చాలని దానికి అలమారుల తలుపులు తీసి

విసురుగా వేస్తున్న చప్పుళ్ళు, టేబిల్ సొరుగులు లాగి ముందుకు నెడుతున్న ధ్వనులు నిరాటంకంగా జరిగిపోతున్నాయి.

''అబ్బబ్బ, పెరట్లోనుంచి అలా గొంతు చించుకోకబోతే ఇలా వచ్చి వెతికివ్వరాదూ?'' నిష్ఠూరాలు గూడా మొదలయ్యాయి. పట్టుదప్పిన లుంగీని వొడుపుగా పట్టి గబుక్కున లేచికూచున్నాడు రవి. ఒక గెంతులో ద్వారం దగ్గరికెళ్ళి అన్యమనస్కంగా నిలుచుందా అమ్మాయి. ఆ గెంతడంలో చివర కుచ్చులు కట్టిన ఆమె జడ రవి ముఖంమీదుగా జరజర ప్రాకిపోయింది. తత్తరపడ్డ రవిని జూచి ఆమె కాలి అందెలు ఘల్లుమని నవ్వాయి.

''పేపర్! దినపత్రిక కావాలి'' అంటూ కళ్ళు టపటప లాడించి, అంతలో గుర్తొచ్చిన దానిలా ''ఇప్పుడే వచ్చావా?'' అంటూ ఓ అప్రస్తుతమయిన ప్రశ్నవేసి, ఉలుకూ పలుకూ లేకుండా నిర్ఘాంతపడి జూస్తున్న రవిని విచిత్రంగా జూస్తూ ఆమె చెంగున అవతలికి దూకి వంటిట్లోకి పారిపోయింది.

''శ్యామలగదూ! అవును, శ్యామలే!!'' ఏదో నమ్మలేనట్టుగా అనుకున్నాడు రవి. ఇంతలో వసారాలోనుంచి తండ్రిగొంతు వినరావడంతో చెదిరిన జుట్టును వెనిక్కి త్రోసుకుంటూ గది వెలుపలికొచ్చాడు.

రామనాథం గోగునారతో పగ్గం వేస్తున్నాడు. చిన్నయ్య దూరంగా దారం పురి పడడానికి ఒక కర్రపుల్ల సాయంతో మెలి దిప్పుతున్నాడు.

''అదేం మొద్దు నిద్దరా? మొత్తంమీద బాగా అలసిపోయినట్టున్నావు! తెల్లవారి బండి లేటుగా వచ్చిందా ఏమిటి? ప్రయాణం సవ్యంగా జరిగిందా?'' నవ్వుతూ పల్కరించాడు రామనాథం.

తండ్రి రాకను గూడ గమనించకుండా మొద్దు నిద్రబోవడం చిన్నతనంగా తోచింది రవికి. ''అదేం లేదు నాన్నా! పాసింజర్లో బాగా ఖాళీ వున్నట్టే వుంది. కానీ మెయిల్లో కూచోడానికి కూడా స్థలం దొరికింది కాదు. రిజర్వు చేసిన నా బెర్తులో కూచున్న సింధీ వాళ్ళు నా బెర్తు నాకివ్వకపోగా, కనీసం సీటుగూడ యివ్వలేదు. అయినా పిల్లా, జెల్లా—వాళ్ళుమాత్రం ఏం జేస్తారని? వాళ్ళగోలతో రాత్రి మెయిల్లో అంతా నాకు ముళ్ళపయిన కూర్చున్నట్లే వుంది. పాసింజర్లో ఎక్కి కూర్చొనేసరికి గంట రెండు దాటింది. వేళదప్పడంతో నాల్గింటికిగాని నిద్ర పట్టలేదు. నాల్గింటికెప్పుడో కొంచెం కునుకు పట్టినట్టుంది. ఐదింటికే అనుమల స్టేషన్లో ఒకడు భుజం తట్టి లేపి బలవంతంగా టీ త్రాగించి పదిహేను పైసలతో బాటూ నా నిద్ర కూడ పట్టుకపోయాడు'' అంటూ నవ్వసాగాడు రవి

సన్నగా మందహాసం జేస్తూ ''సర్లే. మాట్లాడ్డం మాత్రం బాగా నేర్చినట్టున్నావు'' అంటూ ఆగి వంటింటివైపు తిరిగి ''మీ అమ్మ పిలుస్తున్నట్టుంది చూడు'' అంటూ సంభాషణ మూలంగా కుంటువడిన పగ్గం పేనడాన్ని ఉధృతం చేయసాగాడు రామనాథం తొందర తొందరగా.

వంటిట్లోకొస్తూ అడిగాడు రవి—''ఏమమ్మా, రాజా ఇంకా రాలేదా?''

''ఏదీ నువ్వలా నిద్రిస్తూనే వచ్చాడు. ఇంత దాకా నువ్వు లేస్తావని చూస్తూనే వున్నాడు. ఇప్పుడే కన్పించడంలేదు.'' పొయ్యి మీదకు పాలగిన్నె మారుస్తూ ''వెళ్ళి ముఖం కడుక్కునిరా—కాఫీ తాగుదువు గానీ'' అంది జానకమ్మ.

ముఖం కడుక్కుని టవలుకోసం అమల్ని కేకేశాడు రవి.

అమల అన్న దగ్గరికొస్తూ చిరుకోపంగా ''పెరట్లో కెళ్ళేటప్పుడు తువ్వాలు తెచ్చుకోవాలని తెలీదా అన్నా, హాస్టల్లో అయితే ఏం జేస్తావు. బాత్రూమ్‌నుంచి బట్టలు లేకుండా పరుగెత్తుతావా ఏం'' అంటూ నవ్వసాగింది.

వస్తున్న నవ్వును ఆపుకుంటూ దబాయింపుగా అన్నాడు రవి ''అయితే ఏం, టవల్ తెచ్చిస్తావా లేదా.''

ఏం, నాకేం పట్టింది. అంతగా అయితే శ్యామల్ని పిలువు. పందిరి దగ్గర పూలు కోస్తూ వుంది.''

''శ్యామల ఎందుకు జేయాలి'' బింకంగా అన్నాడు రవి, ఆమె ఆంతర్యం అర్థం అయినా.

''ఏమో, నాకేం తెలుసు. కావలిస్తే దాన్నే అడుగు.'' వసారాలోనికి నడిచింది అమల.

''అసలు నీకు చేయాలి ముందు పెళ్ళి. మరీ అల్లరెక్కువయిపోతోంది'' తలమీద మొట్టికాయ వేయడానికి ఉంకించాడు రవి.

''అయ్యొయ్యో. నన్ను ముట్టుకోవద్దు'' పరుగెత్తుకెళ్ళి ఓ మూల నిల్చుంది అమల. ఆమె కాలు దగిలి ఒక వారగా పెట్టిన చెంబు దొర్లి నీళ్ళన్నీ ఒలికిపోయాయి. అవి ప్రక్కనేవున్న వారపత్రికలను తడిపేస్తూ చాప క్రిందికి జారిపోయాయి.

ఏదో కొంచెం అర్థమయినట్టుగా రవి పెదవి చివర ఒక చిరునవ్వు మెరిసి మాయమైంది.

కాఫీ తాగుతున్న రవికి గోడగడియారం 'అయిదు గంటలు' కొట్టడం విన్పించింది. అతనికి కాలం మనుషులకు తెలియకుండానే చాపక్రింద నీరులా జారిపోతున్నట్టు అన్పించింది.

''శ్యామలా, అమలకు కాఫీ ఇచ్చి వద్దువు రావే'' అని జానకమ్మ పిలవడంలోనే మళ్ళీ నిశ్శబ్దంలోనుంచి మెల్లమెల్లగా అందెల చప్పుడు విన్పించింది. రవి హృదయం కొన్ని మార్లెక్కువగా స్పందించింది. అమృతం తీసుకుబోతున్న భువన మోహినిలా శ్యామల కాఫీ గ్లాసందుకుని పెరటివైపు నడిచింది.

చెప్పులు వేసుకుని వీధిలోకి అడుగిడుతున్న కొడుకుతో ''పొద్దుండగానే వచ్చేయి. మబ్బెక్కినట్టుంది. వర్షం రావచ్చు'' అంటూ హెచ్చరించాడు రామనాథం.

వీధిలో సైకిల్ త్రోసుకుంటూ పోస్ట్‌మేన్ వడివేలు ఎదురయ్యాడు. సైకిల్ వెనుకసీట్లో ఆ సాయంత్రం పాసింజర్లో వెళ్ళవలసిన తపాలు ఉంది.

''స్టేషను కొస్తావా'' అన్నట్టుగా తన కలవాటయిన శబ్దాలు చేశాడు వడివేలు.

ఆకాశాన్ని చూపిస్తూ ''ఈ రోజు కుదరదేమో, రేపొస్తాను'' అన్నాడు రవి. వడివేలు రవిచేయి పట్టుకుని రిస్ట్‌వాచ్‌ను పరీక్షగా చూసి, బావుందంటూ నవ్వాడు. రేటెంత అన్నట్టుగా చేయి కిందికి పైకి ఆడించాడు.

రవి మూడువేళ్ళు చూపిస్తూ 'మూడొందల చిల్లర' అన్నాడు. 'అమ్మో' అన్నట్టుగా కళ్ళు తేలేసి, బుంగమూతి బెట్టి అంతలో ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా తలపంకించుతూ ముందుకు కదిలాడు వడివేలు.

'వాచీ ఎవరికోసమో' అడగాలనుకుని మళ్ళీ మానుకున్నాడు రవి, వడివేలు చెప్పే సమాధానం అర్థం చేసుకోవడం మరీ అంత సులభం కాదని స్ఫురించడంతో. ఐతే తాను చిన్నతనంలో వడివేలుతో గంటల తరబడి మాటాడుతూ స్టేషను దారిలో నడచిన రోజులెన్నో అతనికి జ్ఞాపకం వచ్చాయి. తనకు బాల్యంలో వడివేలుతో మాట్లాడడానికి అడ్డగించని అతని మూగతనం—ఇంత చదువుకున్నాక ఎందుకు అవరోధంగా పరిణమించిందో అంతుచిక్కలేదతనికి.

మోచేతులు దాటిన అరచొక్కా, కాకీ నిక్కరు, తెలుపు నలుపు కలిసిన వెంట్రుకలు, చొక్కా జేబులో కొన్ని చిల్లర మల్లర కాగితాలు, ఒక పెన్సిలూ, చేతికొక కాశీదారమూ...తనకు తెలిసినప్పట్నుంచి వడివేలు ఇలానే వున్నాడు. ఆ వూరికి ఉత్తరంగా ప్రవహించే వాగులా, వాగుప్రక్కనున్న శ్రీరాముని గుడిలా, గుడిముందున్న రావిచెట్టు కింది రచ్చలా, ఆ వూరికి సహజ లక్షణంగా కన్పిస్తాడు వడివేలు రవి దృష్టికి. రవి ఆలోచిస్తూ నడవసాగాడు.

ఇంటిముంగిట నీళ్ళుజల్లి, ముగ్గుకర్రగీసి ఇంట్లోకి పోబోతున్న శారద, పరధ్యానంగా నడుస్తున్న రవిని చూచి ''ఏం రవీ, ఎప్పుడొచ్చావు. కాలేజీ కెళ్ళినంత మాత్రాన మమ్మల్నంతా మరిచిపోవాలనుందా?'' అంటూ నిష్ఠూరం జేసింది.

రవికేం జెప్పాలో అర్థంకాలేదు. ఏదో మాట్లాడాలని ప్రయత్నించి, ఏం తోచక నవ్వేస్తూ ''వచ్చింది ఈ రోజు ఉదయమే. సెలవులేమో ఇంకా రెండు నెలలకు పైగా వుంటాయి గదా. ఊర్లోనే వుంటానులే అక్కా'' అంటూ ఆగాడు.

అంతదాకా శారదలో కన్పిస్తున్నమార్పు రవి కప్పుడే అర్థమయింది. ఆమె కడుపుతో వున్నట్టుంది. అసలు ఆమెకు పెళ్ళెప్పుడయినట్టు? ఈదర గాలికి ఇంటిముందర వేసిన పెళ్ళి పందిరి తాలూకు మామిడాకుల తోరణాలు ఎండిపోయి వుండడంతో ''చాలా కాలమే అయిందిలే'' అన్నట్టుగ గలగలమన్నాయి:

శారద కొంచెం ఇబ్బందిగా కదిలి ''నీకు పెండ్లి పత్రిక పంపమని, ఉత్తరం రాయమని మా చిన్నాయనతో ఒకటికి నూరుసార్లు జెప్పాను. ముహూర్తం వరకూ వస్తావనే అనుకున్నాము. నువ్వేమో పెళ్ళయ్యాక ఆరు నెలలకు గాని వచ్చావుగాదు.'' శారద ముఖంలో విచారం రవికి బాధ కల్గించింది.

''ఉత్తరం అందింది గాని కుదరలేదక్కా. అవును గాని మా బావెక్కడున్నారు'' అన్నాడు రవి పరిశీలనగా ఇంట్లోకి జూస్తూ.

''నిన్నటిదాకా ఇక్కడే వున్నారు. రామాపురంలో చక్కెర మిల్లు పెట్టబోతున్నారటగదా. అక్కడే ఏదో రోడ్డు కాంట్రాక్టుట. ఎప్పుడొస్తారో తెలియదు. ఇదో ఈ గంటలో రావచ్చు. వచ్చిన అరగంటలోనే తిరుగుముఖం అనుకో. వేళకు తిండినీళ్ళు ఉండాలన్న ధ్యాస ఆ మనిషికి బొత్తిగా ఏ కోశానా లేదు...మామగారేమో మంచం దిగలేరు. అత్తగారికా కాలు ఒకచోట నిలవదు. ఈ యిలాఖాలో ఆమెకు బంధువులు లేని వూరులేదంటే నమ్ము. ఈ మూడునెల్లూ ఆ వూర్లో నాకొక రోజు యుగంగా గడచిందనుకో. పోయిన అమావాశ్యకు ముందునాడే అమ్మ, రమేష్ వచ్చి నాలుగు రోజులుండి నన్ను తీసుకొచ్చారు. ఇంతకూ ఆయనేమో నేను ఇక్కడికి రావడానికి ససేమిరా ఒప్పుకోలేదనుకో. మొదటి కాన్పు పుట్టింటిలోనే జరగాలని పట్టుబట్టి అమ్మ బలవంతంగా తీసుకొచ్చింది...'' ఇంటిలోనుంచి పిలుపు రావడంతో ''ఇంట్లోకి రా రవీ. అప్పట్నుంచి వీధిలోనుంచోపెట్టే మాటాడేస్తున్నాను'' అంటూ పిలిచింది శారద.

''తొందరేముందిలే అక్కా! అలా వీధి చివరి కెళ్ళొస్తాను'' అంటూ రవి ముందుకు నడిచాడు.

రవి ఆ సాయంకాలం ఇల్లు వదిలి రావడంలో ముఖ్యోద్దేశం తన పాత స్నేహితులను కలుద్దామనే. కానీ ఎవరో ఒకరిద్దరుతప్ప మిగిలిన వాళ్లందరూ ఇంట్లో లేనట్టు తెలిసింది. ఎక్కడికి బోయారంటే శనివారం గదా. సంతగేటుకు పోయారని సమాధానం. చివరకు వాగు దగ్గరికైనా వెళ్ళి రావాలనుకున్నాడు రవి. ఇంతలో ఒకటి రెండు చినుకులు రాలడంతో ఇంటిముఖం పట్టాడు. ఇళ్ళలో ఎలక్ట్రిక్ దీపాలు ఒక్కటొక్కటిగా వెలుగుతున్నాయి.

''ఏమయ్యో! ఇలా ఒకసారి వచ్చిపో'' అంటూ టీ హోటల్లోనుంచి చెంగల్రాయుల కేక విన్పించింది. తన యీడు వాడే అయిన చెంగల్రాయులు అప్పుడే కుటుంబాన్నంతా ఒక్కడే పోషిస్తున్న సంగతి తెలిసి రవి ఆశ్చర్యపోయాడు. వద్దంటున్నా వినకుండా ''డబుల్‌స్ట్రాంగ్ టీ'' నొకదాన్ని రవిచే తాగించి, ''మళ్ళీ రేపురా. తెల్లవారి ఏడుగంటలకే నా స్టాల్ రెడీ''అంటూ సాగనంపాడు చెంగల్రాయులు. ఇల్లు చేరేసరికి ఆరున్నర. ప్రాంతీయ వార్తలు ముగిసి సేద్యసమాచారం వస్తోంది. వీధివైపు గదిలో రామనాథం రేడియో వింటూ పేపరు తిరగేస్తున్నాడు.

(ఇంకా వుంది)

# కైవారము

## అనంతశ్రీ

ఉభయ కవి మిత్రమా !
భవ భావ రూపమా ! !
దివ్య లోకము నీదు
కావ్యలోకము మాకు॥

నిశితమౌ నీ మేధ
విశదమౌ నీ యెడద
శారదా నిలయమై
శాంతి శిఖరంబెక్కె॥ ఉభయ ...

తిక్కయజ్వవు నీవు
యజ్ఞపురుషుడు నీకు నిత్యనివాసుడౌ
ఇలలోన నిటువంటి
కలయికే కనరాదు॥ ఉభయ ...

ఇతిహాసములతోడ
హితము గూర్చిన యతులె
కావ్యామృతము పంచ
కవి బ్రహ్మలైనారు॥ ఉభయ ...

నవరసా లన్నియును
తలయొగ్గె నీ కైత
వివిధమౌ శాస్త్రాలు
సవిధేయమై మెలగె॥ ఉభయ ...

నీ హస్త తలమందె
సాహిత్యమొక కళగ
శక్తి సంఫుల్లమై
రక్తి గాంచిన దయ్యె॥ ఉభయ ...

నీ కావ్యరస గోపనము
మాకు విదితముసేయ
నవీన పరాశర సూనుడవుగా
మరల భువి నవతరించితివి॥ ఉభయ ...

ఉగ్రశవో వైశం పాయనాది
మౌఖిక వ్యాఖ్యాతల
జిహ్వాదోహద ప్రవర్ధమానమైన
యొక మహా గహనమ్ములో
సరస మనస్సంక్రందన
స్యందన ఘంటాపథమ్మగు
సుందర నందనోద్యానమ్ము
సృష్టించు పటిమమ్ము
సకలమ్ము నీదెగా॥ ఉభయ ...

ప్రతి పద్యమేకాదు
ప్రతి పదమ్మనుగూడ
అపవర్గ సౌఖ్యమ్ము
నపకృష్ట మొనరించు॥ ఉభయ ...

ఏది జన్మస్థలమొ ?
ఏది నిర్యాణభూమియో ?
మా కెందుకీ గోల
ఆంధ్ర కావ్యరసమ్మును గ్రోల॥ ఉభయ...

రస సిద్ధుడవు నీవు
రసముగ్ధులము మేము
నీయశః కాయమ్మె
జయపతాకముమాకు॥ ఉభయ ...

భీకర గంభీరమౌ
లోకాంబునిధి త్రచ్చి
హాలా హలము మ్రింగి
అమృత మందించితివి॥ ఉభయ ...

ఉభయ కవితా మహా
సామ్రాజ్య మేలగజాలు
సమ్రాట్టు వీవొక్కడవె
నమ్మ మౌనతులివే॥ ఉభయ ...



శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ

# కావ్యాత్మానుశీలనము

తృప్తిని పొందనప్పుడు మనస్సు వివాదానికి సిద్ధమవుతుంది. అది తన భావానుగుణంగా విప్లవించాలనుకొంటుంది. ఈ దృష్టి వ్యక్తిగతమైతే ఎదురు తిరగడమనవచ్చు. ఈదృష్టే ఒక సంఘానికి, ఒక జాతికి, ఒక తత్త్వ ప్రచారానికి సంబంధిస్తే విప్లవం అనవలసి వస్తుంది. సామాజికంగానైనా, సాహిత్యపరంగనైనా యీదృష్టి సమానమే. ఆనాడు సంస్కర్తలో, ఆ లక్షణమున్న కవులో ఉద్భవించి తమ సిద్ధాంతాన్ని తరువాత తరాల వారిపై సందేశరూపంగా ప్రసరింపచేస్తారు. అంతటితో ఆ విప్లవ మణగి ఆజనత ఆదారిలో ప్రయాణిస్తుంది. ఆ విప్లవవాదుల మనస్తత్త్వమును గ్రహించి, ఆ సిద్ధాంతి చేసిన ప్రయోగమనికూడ దీన్ని అనవచ్చు. ఈ ప్రయోగం సంస్కారయుతం సంప్రదాయబద్ధమైతే పది కాలాల బాటు నిలుస్తుంది.

ఈ దృష్టితోనే సాహిత్యం యుగయుగాలుగా మారుతూ క్రొత్త వింతలను సృష్టించుకొంటూనే ఉంది. అంతమాత్రంచేత పాత రోత కాదు. అంతకుముందున్న దానిని సమూల నాశనంచేసి యే క్రొత్త ప్రయోగం పుట్టదు. పుడితే నిలవదు. సాహిత్య విషయంలో ఇది మరీ ముఖ్య విషయం. ఈ దృష్టితో పరిశీలిస్తే ''పురాణ మిత్యేవ న సాధు సర్వం'' అను సమ్యగ్దర్శనంలోను, ''న చాపి కావ్యం నవమిత్య వద్యమ్'' అను సముచితోప దేశంలోను మనకు కనిపించేది 'ఆనందమే'. ఈ ఆనందం సాహిత్య పాఠకుల కందరకు సమానమే అయినా, కేవల సహృదయుడు, ఆ ఆనంద విలీనతలో పరవశించి వివశుడవుతాడు. జిజ్ఞాసువు ఆ ఆనందపు టంచులను చూడటానికి ప్రయత్నిస్తాడు. అందువల్ల సాహిత్యంలో ఇటువంటి జిజ్ఞాసువులే ఆలంకారికు లనవచ్చు అనుకొంటాను. వీరు కావ్య పఠనావసరమున కనిపించు ఈ ఆనంద కారణమును అన్వేషించటానికి ప్రయత్నించారు. అలా అన్వేషించి దర్శించిన ఆనందవర్ధనమగు గుణమునే ఆత్మ అని ప్రవచించారు. ఈ ఆనందమునే కావ్యాత్మగా కూడా అంగీకరింపవచ్చు. ఆత్మ ఆనంద స్వరూపమే కనుకను, రసమంటే ఆనందమే కనుకను, రస స్థితిలో ఉన్న పాఠకు డానంద సాక్షాత్కారాన్ని పొందకలుగుతున్నాడు కనుకను, రసపర్యాయమైన ఆనందము ఆత్మకాగలందుల కభ్యంతరముండదు. ''రసమే వాస్తవముగా, కావ్యాత్మ అనియు, వస్త్వలంకార ధ్వను లన్నచో నివి గూడ నెల్లవేళల రసమున కభ్యుదయమును గూర్చు ననియు,......అను అభినవగుప్తుని వాక్యమువలన కాబోలు విశ్వనాథ కవిరాజు రసాత్మకమైన వాక్యమే కావ్యమని లక్షణమును విధింప సాహసించెను.'' అను వాక్యాలు కూడ నా ఊహకు ప్రోద్బలకాలు.

మరి కావ్య ప్రయోజనమేమిటి ? అనే ప్రశ్న రావచ్చు. కావ్య పఠనానంతరము లభించిన ఆనంద సాక్షాత్కార కారణ సంక్రాంతమైన పారవశ్యమనియే సమాధానం. కావ్యానికి ఇదేపారలౌకిక ప్రయోజనం. ఈ పరిశీలనా విషయంలో ఒకరి నుండి యింకొకరు తృప్తిని పొందలేక విప్లవిస్తూనేయున్నారు. అందుకే ఆలంకారికు లెందరో పుట్టవలసి వచ్చింది.

ఎంతమంది ఆలంకారికులు పుట్టినా సహృదయుడి ఆనందానికి కారణమైన కావ్య గుణ మిదియని, ఇంతమందిలోను మనకు దగ్గరగా వచ్చి వివరించినవాళ్ళు ముగ్గురే. ఆ, ఆలంకారికత్రయమే భరతుడు, ఆనందవర్ధనుడు, క్షేమేంద్రుడు. ఇందులో భరతుడు ''నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే''(నాట్యశాస్త్రము రసవ్యాఖ్య) అని రసాత్మకమైన వస్తు సందర్శనం చేయగా, ఆనందవర్ధనుడు— ''కావ్యస్యాత్మా ధ్వనిరితిబు ధైర్యత్సమామ్నాత పూర్వః'' (ధ్వన్యాలోకము)అని పలుకగా క్షేమేంద్రుడు ''ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్'' అని పై సిద్ధాంతములను ఔచిత్యంతో ముడివేసి చూపించినాడు. కొంచె మాలోచిస్తే ఈ ముగ్గురూ ఉత్తరోత్తర ఒకరిలో ఒకరు లీనమవుతారు.

క్షేమేంద్రుని సిద్ధాంతం సర్వ సిద్ధాంతాల సమాహారంగా కన్పించినా, కావ్య జీవిత విషయంలో మనకు సామీప్య స్థితిని కలిగించిన సిద్ధాంతమిదే అనిపిస్తుంది. ఒక కావ్యాన్నో, ఒక పద్యాన్నో, ఒక వాక్యాన్నో బుద్ధితో కొట్టినప్పుడు, ఆ చప్పుడు మనసుకు వినబడి సంతోషపెట్టినపుడు అది ధ్వని అవుతుంది. ఈధ్వని శ్రేయోమార్గాన్ని ప్రేయోమార్గాన్ని కూడ సూచిస్తున్నది. ఇటువంటి ద్వైవిధ్య స్థితి కల ధ్వని ఆత్మ యెలాఅవుతుంది. కనుక కావ్యాత్మ అనదగు ఆనంద స్వరూప సందర్శనమునకు కారణములయిన పలు గుణాలలో ధ్వని ఒకటి. అంటే ధ్వని కూడ గుణమే అవుతున్నది. గుణ మనగానే దానికి అల్పత్వ ఆధిక్యతలుంటాయి. రసము చేత వ్యక్తీకరింపబడు ధ్వనికి ఈ రెండు గుణాలున్నాయి అందుకే—

శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివస ప్రలోకయ
మా పథిక రాత్ర్యన్ధ శయ్యా యామావ యోర్మాఙ్క్షీ

అనుచోట వ్యంగ్యం ప్రేయోపదేశమే కాని, శ్రేయోమార్గ దర్శకం కాదు. కాముక వ్యాపార ప్రకటనా రూపమైన ఈ వ్యంగ్యం కేవల రస దృష్టిచేత ఆత్మ స్థితిని పొందదు. ఇంతకంటె —

నాకు నీలోన గలిసియుండని శరీర
మొకడు కలిపించి నన్ను నెంతకు విధించె

ప్రకృతి దౌర్బల్య మకట! యీపాడు దేహ
మడ్డు నిలచెను మనదు ప్రేమైక్యమునకు. (శృం. వీ)

అన్న పద్యంలో ఉన్న వ్యంగ్యం శ్రేయోమార్గ సూచకం కనుక ఇట ధ్వనికి ఉపదేశ స్థితి లభించింది. అందుకే క్షేమేంద్రుడు ఏ భావం యొక్క గుణదోషాల్నిబట్టి ధ్వని గుర్తింపబడుతుందో దాన్ని రసౌచిత్య మన్నాడు. ఔచిత్య దృష్టిలేకుండగా ధ్వని శ్రేయోదాయకం కాదు. అందుకే 'శృశ్రూంత' అన్నచోట వ్యంగ్యం విశ్వశ్రేయోదాయక మయిన వ్రతోపదేశాన్ని చేయలేకపోతున్నది. అందువల్ల ధ్వని వినా ఆనంద సందర్శనం జరుగదని కాని, ధ్వనియుక్తఆనంద మన్నది శ్రేయమే అవుతుందని కాని అనకూడదు. కనుక కావ్యాత్మ స్వరూపమైన ఆనంద దర్శనాన్ని ఔచిత్యయుక్త ధ్వనిచేత సాధింప గలమని తోస్తుంది. రసంయొక్క వ్యంగ్య స్థితి ధ్వని అవుతుందని, దానికి ఔచిత్య పరిమళ ముండవలెనని, అప్పుడే కావ్యాత్మ వాసనాయుత మవుతుందని, ప్రాచీనాలంకారికుల సర్వ సిద్ధాంతాలు ఈ రెంటిలో అంతర్భూతా లవుతాయని సహృదయ హృదయ నైవేద్యం కావాలి.

ఈ పద్ధతిలో ఆలంకారికులు తమకు ముందున్న కావ్యానుశీలన పరిజ్ఞానంవల్ల సిద్ధాంతాలు చేయగా, తరువాత కవులకా మార్గాలే అనుసరణీయా లయ్యాయి. అయితే తెలుగు కవుల మాటల్లో ఒక వైచిత్ర్యం మనకు గోచరిస్తుంది. ఆనందవర్ధనుల తరువాత ధ్వని మతం స్థాపింపబడి గీర్వాణ కావ్య ప్రపంచానికి ఉత్తేజాన్ని యిచ్చినా, ఏ తెలుగు కవి నోటా, ఇది ప్రస్తావింప బడ లేదు. ''ఇంత మాత్రమున నీ ధ్వని మతము సర్వజన సమ్మతమని మనము తలంపరాదు'' అన్నమాట ధ్వనివ్యతిరేకవాదుల విషయంలో ఎలా ఉన్నా, తెలుగు కవుల విషయంలో వాస్తవమే అనిపిస్తుంది. నన్నయ కూడ —

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కవితార్థ యుక్తిలో
నారసి మేలునా —

అనుటలో రసమతులు రసవత్కథనే కావ్య జీవితంగా గ్రహిస్తారనే అభిప్రాయమే వ్యక్తమవుతున్నది. విన్నకోట పెద్దన అనే లాక్షణికుడు కావ్య వృత్తులు గురించి పలికే సందర్భంలో ధ్వనికి లక్షణాన్ని చెబుతూ

పాకాది కృత వ్యంగ్య
వ్యాకార్ణంబైన కావ్యమది యుత్తమమై
చేకొనఁబడు మధురార్థ
శ్రీకము ధ్వనియనెడు నెపముచే జెలువారున్

— అంటూకావ్యరీతులకు లక్షణం చెప్పటంలో—

అఖిల కావ్యంబులకు రీతులాత్మయంద్రు
ప్రాణదశకంబు వానికి బ్రాణమరయ— అనటంలో కావ్యాత్మ విషయంలో నీతని అభిప్రాయం సువ్యక్తమవుతోంది. అందులోనూ, ధ్వనిగురించి పలుకుతూ 'ధ్వనియనెడు నెపముచే' ధ్వనివ్యాజమే కాని సత్యం కాదనే తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసాడు. ఆనంద వర్ధనుడి సిద్ధాంతం సత్యమని సాహిత్య ప్రపంచాన ప్రతిష్ఠింపబడిన కాలంలో కూడ ఒక లాక్షణికుడు ఈవిధంగా లక్షణం చెప్పడంటే ధ్వని సిద్ధాంతం సార్వకాలికం, సార్వజనీనం కాదనే చెప్పాలి. శ్రీనాథుడు కూడ తన పరిణతదశలో ''ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబును బరిహరించియు'' అని పలికి ఔచిత్యానికి కట్టుబడ్డాడు. ఇందువల్ల కావ్యజీవిత నిర్ణయ విషయంలో తెలుగుకవులు స్వతంత్రులుగానే వ్యవహరించారనాలి. ఈ దృష్టి ఆధునికులలో అంటే, సంప్రదాయవాదులే కాదు, అభ్యుదయ వర్గీయులలో కూడ కన్పిస్తుంది. ప్రాచీనాలంకారికమార్గాల్ని తెలిసో, తెలియకో కలంపట్టిన ప్రతివాడు అనుసరించాడు. అయితే యీ అనుసరణలో ఆనందచేతనమైన వాక్యాలే నిలిచాయి. అలా చూస్తే—

'ఔనౌనుష్ణరుచీ గతాంబువులె యౌనా యేమి చిల్కించకే
స్నానంబేటికి?' బూవులా యివి చెలీ! చాల్చాలు తాకించకే
పో! నాకేలనె స్వామిమంగళపదాంభోజాత సంతాన మా
లా నిష్యంద మరంద బిందువులు బేలా! నాకు భోగ్యంబులా!
(శృం. వీ)

అనే పద్యంలో రాధ విరహిణియై. విరహులకు బాధాకర వస్తువుల్ని ద్వేషిస్తుంది. ఇది సామాన్యం. కాని ఇక్కడ రాధ ''నాకేలనె స్వామి మంగళ పదాంభోజాత సంతానమాలా నిష్యంద మరంద బిందువులు బేలా! నాకు భోగ్యంబులా!'' అని పల్కటంలో అసామాన్యమైన ప్రేమతత్త్వం ఔచితీమంతంగా ధ్వనించి ఆనంద సందర్శనం చేయిస్తుంది. ఆ మరంద బిందువులు నాకు భోగ్యాలు కావనురాధలో అభిధావృత్త్యాత్మకంగా కేవల బాధ మాత్రమే స్ఫురింపగా, 'నా—కేలనె' ఆ మరందబిందువులుండ తగినవి. అందువలన నాకు భోగ్యాలుకావు. నిత్యదర్శనీయాలు మాత్రమే, అని ధ్వనించెడి రాధ యొక్క పరిపూర్ణ ప్రేమతత్త్వంలో ఔచితీవాసనల గుబాళింపు లున్నాయి. అంతేకాని—

వృద్ధవీరుడు నీ వయస్సెంత చెపుమ
తండ్రి మరణించియే మూడు తరములయ్యె
నౌర! భారత యుద్ధమధ్యమ్మునందు
పడుచు పార్థుని తల్లడ పరచినావు—అనేది సామాన్యవాక్కు.

ఈ పద్యమేకాదు. ఈ ఖండికంతా చరిత్రను పద్యాల్లో చెబుతూన్నట్లుంటుంది. ఇవి చదువుతున్నంతసేపు మహాపురుషుని మృత కళేబరాన్ని చూస్తున్నట్లుంటుంది. ఎందుకంటే, ఆ ముఖంలో చిరునవ్వు, శరీరంలో పరిమళం ఉన్నప్పటికి వాని దర్శనంవల్ల ఆనందం కలగదు. మనసును కదిలిస్తే కవిత్వంకాదు. ఆ కదలికలో ఆనంద దర్శనం జరగాలి. అప్పుడు కవిత్వ మవుతుంది. ఈ ఖండిక సంతోషాన్నిస్తే ఆ సంతోషం కేవలం ఛందస్సువల్ల మాత్రమే కలుగుతుంది. ఛందస్సు కావ్యాత్మకాదు.

అయితే ధ్వని వీణానాదం లాంటిది. వీణ మొత్తమ్మీద అన్ని తీగలతో కలిపి ధ్వనిస్తుంది. ఏ తీగకా తీగగానూ ధ్వనిస్తుంది. తీగ

తీగగా ధ్వనిస్తే ముక్తమవుతుంది. వేదులవారి "కాంక్ష" వంటివి మొత్తమ్మీద ధ్వనిస్తే మహాకావ్యమవుతుంది. రామాయణ మహా కావ్యం ధ్వనిస్తే రావణుడిలాకాదు, రామునిలా బ్రతుకు అని విన్పిస్తుంది. అందువల్ల ఆనంద దర్శనం జరుగుతుంది.

శరీరం లేకుండగా ఆత్మచరిస్తే దెయ్యమంటూరు. అది ధ్వనిస్తే భయంవేస్తుంది. అందుకే కావ్యానందతత్వాన్ని ఆలంకారికంగా ఛందోమయంగా దర్శించాలి. ఆ ధ్వని ఔచిత్యవంతంగా ఉంటుంది. అలా కాకుండగా మనం ఛందోబంధాల్ని త్రెంపివేసినా, అలంకారాల నముదుముల్ని విరుగదన్నినా పై ప్రమాదం తప్పదు. అందుకే తెలివైనవాళ్ళు "ఛందస్సుల సర్పపరిష్వంగాల్ని వదలి" బ్రతకాలని సందేశాల్నిస్తూనే వాళ్ళుమాత్రం దాన్ని కందర్ప పరిష్వంగంలా భావించి ఆనందిస్తూనే—

జడలు విచ్చిన సుదులు రెచ్చిన
కడలి నృత్యం శమిస్తుందా
నడుము తడబడి సడలి మునుగక
పడవతీరం క్రమిస్తుందా – అని ఛందోమయంగా రచన చేస్తారు. పై గేయంలో 1, 3 పాదాలకు, 2,4 పాదాలకు ఒక కట్టుబాటు కనబడుతుంది. అంతేకాదు తేటగీతిలో 2,3 గణాలక్కడ 2,4 గణాలై క్రొత్త ఛందం పుట్టింది. ప్రాసయతి, ప్రాసతో కట్టుబడి పద్యంకన్నా కష్టసాధ్యమవుతున్నది. మహాకవుల లక్షణాలిలా ఉంటాయి. ఏమైనా ఛందోబద్ధం, ఆలంకారికము కనుకనే పై గేయంలో కడలి నృత్యపు ధ్వనులు కవితాత్మను సశరీరంగా చూపెడుతున్నాయి. అంతేకాక కొన్నిచోట్ల ఆత్మలేక శరీరం కనబడుతుంది. దాన్ని శవమనాలి. ఈ శరీరం శల్యావశిష్టమైనపుడు—

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా—వంటి ప్రబోధ వాక్యాలు పుట్టి కవిత్వంలా మెరుస్తాయి. ప్రవక్తలు కవులు కానట్లే, ప్రబోధ వాక్యాలు కవిత్వంకాదు.

ఆనందరూపకమైన కవితాత్మను రసమయంచేసి ఔచిత్యవంతంగా ధ్వనింపచేసినవాళ్ళే కవులవుతారు.

# "కవితానందం"

## శ్రీ నందిగాం వీరవెంకటరమణ జోగారావు

ఎక్కడున్నావని వెతికేది ?
నీ వెక్కడుంటావని తలచేది ! ?
ఆశల రెక్కలు కట్టుకొని,
ఊహా విహాయసంలో నిన్ను వెతకనా ? !
వేదనాభారంతో పగిలిన,
గుండెల ముక్కలను విసిరి నిన్నాకర్షించనా ? !
మనస్సుకూ, గాలికీ,
వ్యాపక సమాసంచేసి నీ స్వరూపాన్ని దర్శించనా ? !
ఉషస్సుకూ, సంధ్యకూ మధ్యన వ్రేలాడే
చిక్కటిరాత్రి తెరను తొలగించి నిన్ను చూడనా ! ?
రాత్రి వెదజల్లిన చుక్కల మల్లెపూలను ఏరి,
మాలగా కూర్చి నీకోసం నిరీక్షించనా ? !
అనంతమైన కాలం గాలానికి ఎరనై,
చీకటి తెర లావరించిన ధ్రువప్రాంతాన్నై,
పాంటియస్ పైలట్ శిలువ వేసిన క్రీస్తునై,
అన్నీ నేనే అయి,
నేనే అన్నీ అయి,
ఏ సుప్రభాతాల కిరణాల దారుల్లోనుండో
నువ్వొస్తావని ఎదురుచూడనా ! ?
నీకోసం నా మనస్సును కవితానందంతో నింపనా!??

# నది విశ్వానికి పెన్నిధి

## డా॥ గంధం జోయెల్

నది !
 విశ్వ మానవాళి పెన్నిధి !
అది
నలుగురూ నచ్చేది, మెచ్చేది
అందరూ పూజించేది !
నది తరంగాలతో
పొంగి నాట్యమాడునది;
లోన నిగూఢ విక్షేప
భయము గలది !

సమస్త మానవ
హృదయాంతరాల
కదిలించేది
మందలించేది – నది
విమాతృ సమస్యల
పరంపరల సృష్టించేది !
అందుకే
నదిని చూడకుండ
మదిని పాడకుండ
బ్రతకలేను, బ్రదర్ !

అదిగంగా; గోదావరి;
బ్రహ్మపుత్ర; తుంగభద్ర కానీ
కావేరీ; నైలునది
మిసిస్సిపీ నామము
ఏదైనా ఫరవాలేదు
నదులన్నీ నాకు మాతృసమానము !

నది పెంచుతుంది
నవ నాగరికతను !
అంతమొందిస్తుంది
పెరిగే అమానుశత్వాన్ని !

అందుకే నది
నాకు ప్రాణనిధి !

సృష్టిలోని రమణీయతను
చూపరులకు పంచుతుంది
అలసట నావలికి నెట్టి,
అహర్నిశలు ప్రవహిస్తుంది !

ఇది చూచి
మదిలోన -
నది వట్టి చేతకాని
దద్దమ్మంటే శుద్ధ పొరపాటు !

కోపం పెల్లుబికితే
ఉన్నట్లుండి ఒక్కసారి
ముందుకు, మున్ముందుకు
విజృంభించి,
ఉరకలు వేస్తుంది !
పరుగులు తీస్తుంది ! !
అడ్డంగా నిలిచి
ఆకాశాన్నంటే
కొండల్ని సహితం
కూల్చేస్తుంది !
ఎత్తులేని రాతిబండల
నిముషంలో
దొర్లించేస్తుంది
తలవంచని వృక్షాల శిరాలు
వంచి, పెరికి పారేస్తుంది !

నానా బీభత్సంచేసి,
పాతబాట మరుస్తుంది
కొత్త పంథ తొక్కుతుంది !

అందువలన
అలనాటినుండి
నది చైతన్యానికి,
నవ విప్లవశంఖారావానికి
సజీవ చిహ్నం ! !

నది, అది
అవసరమైనప్పుడు
తుది ప్రయాణ గమ్యంలో
శాఖోప శాఖలై వ్యాపిస్తుంది !
నెమ్మదిగా ప్రవహిస్తూ
సాగర గర్భంలో లీన మౌతుంది !
నది మానవ విధి పరిధిలో
శాంతికి సంకేతం !
నది విశ్వానికి పెన్నిధి !

# స్వేచ్ఛాపథం

## శ్రీ బి. మురళీధర్

వైరాగ్యం, విషాదం నాకింకా అలవడలేదు !
ఎందుకంటే —
శాంతి, సుఖాలు నాకింకా కొరవడలేదు !
ఈ నిశ్శబ్దపు పిడుగుల మధ్య —
ఈ ప్రత్యక్ష పిశాచాల మధ్య —
ఈ కనిపించని కన్నీటి పొరల తెరల మధ్య
కంటికి ఆనని ఆదికీ, అంతానికీ మధ్య
అనంత ప్రయాణం తలపెట్టినవాణ్ణి !
యుగ యుగాలనుంచీ
కరడుగట్టిన గుండెలతో
పోరాటం సాగిస్తున్నవాణ్ణి !
నన్ను సమాధి చేసిన శక్తుల నొక్కొక్కటిగా
విరుస్తూ ...
నా రెక్కలు తెంచబోయిన కత్తుల నొక్కొక్కటినే—
— ఒరలోకి — ముడుస్తూ ...
నేను బంధించబడిన చదరంగపు గళ్ళనుండి,
నన్ను నేను విడిపించుకొని
నాకోసం స్వేచ్ఛాపథం నిర్మించుకొని
ఎగిరిపోవాలనుకున్న వాణ్ణి !

# వియోగి

## శ్రీ పి. ఆర్. భానుమూర్తి

ఏ స్తబ్దత లోంచో
నిశ్శబ్దత లోంచో
దిగులుగాలి పరచుకున్న
ఏకాకితనం లోంచో
అప్పుడు అలలు అలలుగా జారిన నీ నవ్వు
యిప్పుడు బొట్లు బొట్లుగా రాలుతోంది —
కానీ చిత్రం !
కన్నీటి బొట్టుకూడా
ఏడురంగుల యింద్రధనుస్సై మెరుస్తోంది !

శ్రీ ఇ. సాయిబాబా

# అమితగతి - సుభాషిత సన్దోహం

ఒక జైన కవి అమరవాణికి కైచేసిన ఒక అలంకారము ''సుభాషిత సన్దోహము''. తొలిసారిగ అమితగతి కృత ''సుభాషిత సన్దోహము''ను కావ్యమాలాపరమ్పరలో ౧౯౦౩లో వెలువడింది. సంపాదకుడు శ్రీభవదత్త శాస్త్రి. ఈ రసనమంచిత నీత్యుపదేశక గ్రన్థముపై సర్వశ్రీ ఆల్‌బ్రెక్ట్ వీబరు, గోల్డ్‌స్మిట్, పీటర్సన్, రామకృష్ణ భండార్కర్, ల్యూమన్ — మున్నగు వారు వెలయించిన ఆలోచనాత్మక విపుల సమీక్షలు—సుభాషిత సన్దోహము గొప్పతనమునకు నిదర్శనములు.

ఆచార్య అమితగతి సమర్థుడగు చక్కని కవి. సంస్కృత—ప్రాకృత—అపభ్రంశములలో కడుంగడు దిట్ట. సంస్కృత భాష పయి తిరుగులేని అధికారము కలదనుటకు సు. సం. గ్రన్థమే సాక్షి.

ధారా నగరమును ముంజుడు (క్రీ.శ. ౯౭౪—౯౯౩) పాలించే కాలంలోనే అమితగతి రచనా వ్యాసంగము చేయుట గమనించనైనది. మొదటి వాక్పతి రాజు, ఉత్పలరాజు, పృథ్వీవల్లభుడ, అమోఘ వర్షుడు ఇత్యాది నామములతో ప్రసిద్ధి చెందిన ముంజుడు సంస్కృతములో పెక్కు రచనలు చేసెను. కాని ఒక్క రచన గూడ మనకు దక్కకపోవుట విచార్యము. కాని సంకలన గ్రన్థములలో ముంజుని పద్యములుగా ఇరువది తొమ్మిది లభ్యమగుచున్నవి.

అమితగతి తొలి రచన ''సుభాషిత సన్దోహం''. విక్రమ సంవత్ ౧౦౫౦లో ఈ కృతిని పూర్తి కావించెను. పదునైదు పరిచ్ఛేదములు గల 'శ్రావకాచారము' రెండవ గ్రన్థము. మూడవ విశిష్ట రచన 'ధర్మపరిక్షా'. ప్రాకృతసాహిత్యంలో ''ధర్మపరీక్షలు'' పెక్కు లున్నవి. మొట్ట మొదటి ధర్మపరీక్ష 'జయరామ' రచితమైనది. నేడలభ్యము. అమితగతి హరిషేణ ప్రణీత 'ధర్మపరీక్ష'ను ఆదర్శముగా గొని అనుష్టుప్పులతో తన రచనను సాగించెను. పంచ సంగ్రహం, ఆరాధనా భగవతి, భావనా ద్వాత్రింశతికా, సామాయిక పాఠః—అమితగతి ఇతర రచనలు.

సంస్కృత సాహిత్యప్రపంచంలో భర్తృహరి ప్రణీత 'సుభాషిత సంగ్రహ'మునకు గల విశిష్టత కడు దొడ్డది. విక్రమశక ఆరంభ కాలంలో వ్రాయబడిన భర్తృహరి కృతి అనంతర కాలము లందు ఎందరో కవులకు ఒరవడియే గాక, అనుకరణీయమైనది కూడ. అట్టి భర్తృహరి ప్రభావమునకు లోగిన వారిలో అమితగతి ఒకడు.

పృథివ్యాం త్రీణి రత్నాని
జలం అన్నం సుభాషితం।
మూఢైః పాషాణ ఖణ్డేషు
రత్న సంజ్ఞాభి ధీయతే॥

అన్న చిరన్తన భాణకము చొప్పున అమితగతి సూక్తిరత్న హారమును సహృదయ కణ్ఠ భూషణంగా సమర్పించాడు. ఇది తొలి రచన కావచ్చు. ముప్పది రెండు ప్రకరణములున్న చిక్కని — చొక్కపు రచన. ప్రథమ ప్రకరణము ''విషయ విచారము''. ఇతరములు ఇవి. కోపనిషేధ - మానమాయా నిషేధ - లోభనివారణ—ఇన్ద్రియరాగ—స్త్రీ గుణదోష విచార — మిథ్యా, సమ్యక్ తత్త్వనిరూపణ—జ్ఞాన నిరూపణ—చారిత్ర నిరూపణ—జన్మ నిరూపణ — జరానిరూపణ—మరణ నిరూపణ—అనిత్యతా నిరూపణ—దైవ నిరూపణ - జఠర నిరూపణ — జీవసమ్బోధన — దుర్జన నిరూపణ—సుజన నిరూపణ—దాన నిరూపణ—మద్య నిషేధ—మాంసనిషేధ—మధునిషేధ—కామ నిషేధ—వేశ్యాసంగమ నిషేధ — ద్యూతనిషేధ—ఆప్తవిచార — గురుస్వరూప నిరూపణ—ధర్మ నిరూపణ—శోక నిరూపణ—శౌచనిరూపణ—శ్రావక ధర్మ కథన—తపశ్చరణ నిరూపణ—ప్రకరణములు.

అంతస్స్యూతంగా జైన ధార్మికత గోచరిస్తుంది. జైన తర్కంలో మంచి చొరవ ఉన్నను హిందూధర్మశాస్త్రములతో అమితగతికి సంబంధమున్నట్లు స్పష్టమవుతుంది.

సుభాషిత సన్దోహ మంగళ శ్లోకమిది:

జనయతి ముద మన్తర్భవ్య పాథోరుహాణాం
హరతి తిమిరరాశిం యా ప్రభా భానవీవ।
కృతనిఖిల పదార్థ ద్యోతనా భారతీద్ధా
వితరతు ధుతదోషా సార్హతీం భారతీం వః

[అన్వయం — ధుతదోషా వినాశితాదోషాః రాగాదయో యయాసా, పక్షే ధుతా వినాశితా దోషా రాత్రిః యయాసా, తథోక్తా। కృత నిఖిల పదార్థద్యోతనా భానవీ (భానోః సూర్యస్య ఇయం భానవీ) ప్రభ ఇవ యా భవ్య పాథోరుహాణాం అన్తః ముదం జనయతి, యా తిమిర రాశిం హరతి। సా ఇద్ధా దీప్తా భారతీ వః అర్హతీం భారతీం వాగ్దేవీం వితరతు।]

దైవ నిరూపణలోని దిగువ పద్యం గమనించండి.

పురుషస్య భాగ్యసమయే పతితో
వజ్రోఽపి జాయతే కుసుమం।

కుసుమం అపి భాగ్య విరహే
వ్రజా నిష్ఠురం భవతి॥

అందుచేతనే మహాకవి భర్తృహరి "భాగ్యాని పూర్వ తపసా కిం సంచితాని" అని అంటాడు.

దాన నిరూపణ ప్రకరణంలోని ఈ పద్యం ఆలోచనామృతం. గమ్భీర విషయ బంధురం.

సర్వాభీష్టా బుధజనమతా ధర్మకామార్థ మోక్షాః
సత్ సౌఖ్యానాం వితరణ పరా దుఃఖ విధ్వంసదక్షాః।
లబ్ధుం శక్యా జగతి న యతో జీవితవ్యం వినైవ
తద్దానేన ధ్రువం అసుభృతాం కిం న దత్తం తతోఽత్ర॥

శోక నిరూపణ ప్రకరణంలోని ఈ పద్యం గమనించండి.

క్వ జపః క్వ తపః క్వ సుఖం క్వ శమః
క్వ యమః క్వ దమః క్వ సమాధి విధిః।
క్వ ధనః క్వ బలం క్వ గృహం క్వ గుణో
బత శోకవశస్య నరస్య భవేత్।

'ప్రపంచ దర్పణం' అనబడు సంకలన గ్రన్థంలో అల్లసాని పెద్దన కృతముగా ఉద్ధరించబడిన దిగువ శ్లోకమునందు పై శ్లోకపు ఛాయ స్పష్టంగా కనబడుట సహృదయులు గమనించగలరు.

ఉడు రాజముఖీ మృగరాజ కటిః
గజరాజగతిః స్తనభా రనతా।
యది సా రమణీ హృదయే రమతే
క్వ జపః క్వ తపః క్వ సమాధి విధిః॥

ఇది పెద్దనార్యుని "సత్యా వధూ ప్రీణనము" లోనిదట.

దైవ నిరూపణ ప్రకరణంలోని దిగువ పద్యం హైందవ విశ్వాసమునకు చక్కని ఉదాహరణ.

భవితవ్యతా విధాతా కాలో
నియతిః పురాకృతం కర్మం।
వేధా విధిః స్వభావో భాగ్యం
దైవస్య వివిధ నామాని॥

జఠర నిరూపణలోని రెండు పద్యములు సహృదయులకు నివేదించు చున్నాను· చిత్తగించగలరు.

శక్యేతాపి సముద్రః పూరయితుం
నిమ్నగా శత సహస్రైః।
నో శక్యతే కదాచిత్
జఠర సముద్రోఽన్న సలిలేన॥

వైశ్వానరో న తృప్యతి
నానావిధ కాష్ఠ నిచయతో యద్వత్।
త ద్వత్ జఠర హుతాశో
నో తృప్యతి సర్వథా ప్యశనైః॥

అమితగతి సుభాషిత తటిల్లతలు కొన్ని దిగువ ఉదహరించబడును.

౧ కిం కిం కరోతి న నరః ఖలు కోపయుక్తః
౨ రోష సదృశో నహి శత్రుః అస్తి
౩ జ్ఞానేన హీనః పశురేవ శుద్ధః
౪ ప్రాయః పుంసాం కరోతి జరా హితం.
౫ రక్షతి మర్త్యం సుకృతం పూర్వకృతం భృత్యవత్ సతతం.
౬ అధర్మ పన్థానో నరకం ప్రయాతి।

## ఉపయుక్త గ్రన్థ వివరణ

౧ సుభాషిత సన్దోహమ్
అమితగతి ప్రణీతం
సం॥ శ్రీ బాలచన్ద్ర సిద్ధాన్త శాస్త్రి.
షోలాపూరు ౧౯౭౭.

౨ సుభాషిత సంగ్రహః
భర్తృహరి విరచితం.
సం॥ దామోదర ద. కోసాంబి, ఎం. ఏ.
బొంబాయి ౧౯౪౮

౩ ధూర్తాఖ్యానమ్ (ప్రాకృతం)
హరిభద్రసూరి కృతం.
సం॥ ఆచార్య జిన విజయముని.
ఆంగ్ల భూమికా కర్త :
ఆచార్య ఆదినాథ ఉపాధ్యే, ఎం. ఏ.
బొంబాయి ౧౯౪౪

౪ సుభాషిత సన్దోహమ్
అమితగతి రచన
సం॥ డాక్టర్ గోల్డ్ స్మిట్ + జాన్ హెర్టల్
లీప్ జిగ్ ౧౯౦౫·
(మిక్కిలి ప్రామాణిక ముద్రణ) —

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# ముదిగొండ చాళుక్యులు-1 ప్రాచీనులు

[ భారతి గత సంచికలో 'చాళుక్య కుసుమాదిత్యుని క్రివ్వక తామ్రశాసనము' అను శీర్షికతో ప్రకటించిన వ్యాసమున కనుబంధము ]

క్రీ. శ. 616 నుండి 624 లోగా బాదామి చాళుక్య చక్రవర్తి సత్యాశ్రయ యిమ్మడి పులకేశి తీరాంధ్రమును జయించి తన తమ్ముడగు కుబ్జ విష్ణువర్ధనుని కాప్రాంతము వంశ పారంపర్యముగ జెల్లునట్లొసగెను. అతని సంతతివారు వేంగి చాళుక్యులు లేక తూర్పు చాళుక్యులను పేరుతో నచట సుమారు నాలు వందలేండ్లు పరిపాలించిరి. అట్లే నేటి తెలంగాణా ప్రాంతములో గూడ మరి రెండు చాళుక్య వంశములించుమించుగ నప్పటినుండియే నెలకొని యున్నవి. వాటిలో గోదావరి వెంట నిప్పటి నిజామాబాదు, కరీంనగరు జిల్లాలలో పోదన (భోధను), వేములవాడ రాజధానులుగ సుమారు క్రీ. శ. 970 వరకు రాజ్యముచేసిన చాళుక్య శాఖయొకటి. వారి ప్రక్కనే యిప్పటి ఖమ్మం జిల్లాలో ముదిగొండ రాజధానిగ కొంతకాలము, ఆ తరువాత కొరవి రాజధానిగ కొంతకాలము రాజ్యము చేసిన చాళుక్య శాఖ రెండవది. వీరినే ముదిగొండ చాళుక్యులు లేక కొరవి చాళుక్యులని యందురు. ఈ రెండు శాఖలవారు ఎప్పుడే విధముగ రాజ్యములు నెలకొల్పినది స్పష్టముగ తెలియదు. కాని వీరి వంశస్థాపకుల పేర్లు రణవిక్రముడు, రణమర్దుడు, కొక్కిరాజు అనునవి బాదామి చాళుక్యులలో కొందరు మొదటి రాజుల పేర్లను పోలియుండుటను బట్టియు, నీ రెండు వంశములలో ననేక రాజులు పేర్కొన బడుటవలనను ఈ యుభయవంశములు వేంగి చాళుక్య వంశమువలెనే కడు ప్రాచీనమైనవని చెప్పవచ్చును. ముదిగొండ చాళుక్యుల చరిత్రను దెలుపు ఆధారములు మిక్కిలి తక్కువ. రెండు తామ్రశాసనములు కొరవి శిలాశాసనము మాత్రము వీరి యుదంతమును కొంత తెలుపుచున్నవి. మరికొన్ని శిలాశాసనములలో గూడ వీరి ప్రసక్తి గనవచ్చుచున్నది. వీటి సహాయముతో నీ చాళుక్యుల చరిత్ర కొంత వ్రాయుటకు వీలగుచున్నది.

## 1. ప్రాచీనులు

గత సంచికలో ప్రకటించిన కుసుమాదిత్యుని క్రివ్వక శాసనము గాక కేంబ్రిడ్జి ప్రొఫెసరు సి. బెండాల్ అను నతడు పూర్వము నిజాం ప్రభుత్వ సేకరణలో భద్రము చేయబడియున్న తామ్రశాసన మొకదానిని 'నాల్గవ కుసుమాయుధుని దాన శాసనము' (Grant of Kusumayudha IV) అను శీర్షికతో ఇండియన్ ఆంటిక్వెరీలో 1903లో ప్రకటించెను.[1] దానిని మొగలి చెరువుల దాన శాసనమని కూడ చెప్పుదురు. క్రింది పట్టికలోని నాల్గవ కుసుమాయుధుడు దోనెయ శర్మకు మొగలి చెరువుల గ్రామమిచ్చినట్లిందు కలదు. ఈ మొగలి చెరువుల గ్రామము కొరవి ప్రాంతమున గలదు. ఈ చాలుక్యుల రాజధాని ఖమ్మం ప్రాంతములోనున్న ముదిగొండ. ఆ ప్రాంతము పూర్వము మంచి కొండ విషయ మనబడెడిది. అందు వలననే వీరు ఆ తామ్రశాసనములోను కొరవి శిలాశాసనములోను ముదుగొండ నల్కులని చెప్పబడిరి. చరిత్రకారులు ముదిగొండ చాళుక్యులని చెప్పుదురు. మొగలి చెరువుల దాన శాసనములో వీరి మూలపురుషుడు రణమర్దుడను చాళుక్యరాజుగ పేర్కొనబడెను. అందు వారి వంశమిట్లు చెప్పబడెను:



క్రివ్వక శాసనమందువలె ఈ శాసనములో కూడ దానకాలము చెప్పబడలేదు. కడపటివారగు నిజ్జయరాజు, వాని కొడుకు కుసుమాయుధుడు(IV). క్రివ్వక శాసనములోని మొదటి రెండు తరముల వారి పేర్లను పోలియుండుటనుబట్టి యీ రెండు తామ్రపట్టికలలో జెప్పబడిన వంశములు రెండు కలిసి యొకటియే కాదగునని ఊహించుటకు వీలగుచున్నది. క్రివ్వక శాసనములో నిజ్జయరాజునకు జ్యేష్ఠసోదరుడు కరియగొనగుణ్డు కొరవి వల్లభుణ్డని విశేషించి చెప్పబడెను. అతని ప్రస్తావన మొగలి చెఱువుల శాసనములో గానరాదు. అందు దానకర్తగ జెప్పబడిన నాల్గవ కుసుమాయుధునికి పెదతండ్రి యగుటవలన ప్రధానమగు వంశక్రమములో పేర్కొనబడలేదని భావించవలసియున్నది. అప్పటికీ రాజులు ముదుగొండ రాజులనియే చెప్పబడుచుండిరి గాని కొరవి వల్లభులని రూఢిగ జెప్పబడుటలేదు. క్రివ్వక శాసనము నాటికి వారు ముదుగొండను పూర్తిగ విడిచి కొరవిలో కొంతకాలము స్థిరపడిరనుకొనవలసియున్నది. అట్లు తమ వంశమును ముందుగ కొరవికి తరలించినవాడు కరియ గొనగుడగుటచే నతనిని క్రివ్వక శాసనములో స్మరించియుందురు. కాని మరికొంత కాలమునకు వీరు కొరవిని విడిచి 'బొట్టు' అను చోటునకు తరలిపోయినట్లు తెలియుచున్నది. క్రివ్వక శాసన మూలములో 21వ పంక్తియందు 'బొట్టున వాని ప్రధానులు' అని 'బొట్టు' అనెడిది యొక ప్రదేశముగ జెప్పబడెనని తెలియుచున్నది. అందువలననే శాసనదాతయగు కుసుమాదిత్యుని తండ్రి బొట్టుచేత భూపాలుడని క్రివ్వక శాసనములో పేర్కొనబడెను. బొట్టునకు తరలిపోయినది యీ బేతరాజో లేక యతని తండ్రి, తాత, ముత్తాతలో నెవరో సరిగా తెలియదు. ఈ విధముగ తమ స్థావరమును మార్చుకొనుచుండుటచే వీరిని ముదుగొండ చాళుక్యులు లేక కొరవి చాళుక్యులు లేక బొట్టు చాళుక్యులు అని తఱచుగ పేర్కొనుచుందురు.

ఈ రెండు తామ్రశాసనములందు మొత్తము 8+6=14 తరములవారు పేర్కొనబడిరి. వారిలో నిజ్జయరాజు, అతని కొడుకు నాల్గవ కుసుమాయుధుడు రెండిటిలో నొకరే యనుకొన్నచో 12 తరములవారు మిగులుదురు. వీరుగాక మొదట వంశకర్తయగు రణమర్దుని అన్న కొక్కి(లి)రాజు, క్రివ్వక శాసనములో నిజ్జయరాజు అన్న కరియగొనగుడు అను మరి యిరువురు జెప్పబడియుండుటచేత మొత్తము 14 మంది 12 తరములలో ముదిగొండ – కొరవి ప్రాంతములో రాజ్యమేలిరని తెలియుచున్నది. అనగా సుమారు మున్నూఱేండ్లకు పైగా వారా ప్రాంతమును పాలించిరి. కాని రెండు తామ్రశాసనములలోను కాలము చెప్పబడకుండుటవలన వారిని గూర్చిన సరియగు కాలక్రమము తెలుసుకొనుట కష్టమగుచున్నది.

ఈ చాళుక్యులను గూర్చి తెలుపు రెండు తామ్ర శాసనాలను బట్టి యింతవరకు కొంత తెలిసికొంటిమి. ఆ రెండిటిలోను చెప్పబడిన వంశముల నొకటిగా కలిపి గ్రహించుటకు వీలగునని స్థూలముగ జెప్పితిని. అయినను వారి కాల నిర్ణయము చేసినగాని అది ప్రామాణికము కాజాలదు. వారికి సంబంధించిన శిలా శాసనములు నాలుగు మాత్రము గలవు. (1) కొరవిలోను, (2) చెన్నూరులోను, (3) గూడూరులోను, (4) నత్త రామేశ్వరము లోను ఆ శాసనములు గలవు.

1. కొరవి శాసనము : వరంగల్లుజిల్లా మానుకోట (మహబూబాబాదు)కు సుమా రెనిమిది కిలోమీటర్ల దూరములో కొరవి గ్రామము కలదు. అందు వీరభద్రుని గుడి ప్రసిద్ధమైనది. అచట రెండు శాసనఖండములు గలవు. వానిలొకటి మొదటి భాగమనియు, రెండవది తుది భాగమనియు వ్రాతయొక్క మొదలు, తుదినిబట్టి చెప్పవచ్చును. జాతి కొలతలు కూడ నించుమించు సరిపోవును. అక్షరముల పోలికలు, భాష కూడ నొక కాలమునకు చెందినవే. కాని రెండును ఒకే శాసన ఖండములని రూఢిగ జెప్ప వీలుగకున్నది. శాసన కాలములు రెండిటిలోను లేదు. వీటిని గూర్చి కొంతకాలము క్రింది కొందరు శాసన పరిశోధకులు వేరు వేరు వ్యాసములను 'ఎపిగ్రాఫియా ఆంధ్రికా' అను ఆంగ్ల పరిశోధక వ్యాససంపుటి మొదటి భాగములో ప్రకటించిరి.[2] ఇది యొక విచిత్ర శాసనము. ఇందు జెప్పబడిన రాజకీయాంశములు సులభగ్రాహ్యము గావు. లోగడ 'తెలుగు శాసనాలు'అను పుస్తకములో దీనినిగూర్చి నేనొక వ్యాసము వ్రాసియుంటిని.[3] అందిరువురు చాళుక్య భీముల ప్రస్తావన గలదు. వీరిరువురు వేంగి మండలమునేలిన తూర్పు చాళుక్య శాఖకు చెందినవారు. మొదటి చాళుక్య భీముడు క్రీ. శ. 892 నుండి 922 వరకు ముప్పదేండ్లు పాలించెను. ఇతడు గుణగ విజయాదిత్యుని తమ్ముడగు యువరాజ విక్రమాదిత్యుని కొడుకు. ఈ భీముడు రాజ్యమునకు వచ్చునపుడు రాష్ట్రకూట రెండవ కృష్ణుడు (క్రీ.శ. 880-912) వేంగిపై దండెత్తెను. ఆ సందర్భమున త్రోవలో నుండు ముదిగొండ చాళుక్యరాజగు కుసుమాయుధుని సంహరించెను. ఇతడు చాళుక్య భీముని పక్షమువాడు. కుసుమాయుధుని పెద్ద కొడుకగు గొణగయ్య తండ్రి పోయినను యుద్ధములో ధైర్యము విడువక పోరాడి రాష్ట్రకూటులు దురాక్రమణ జేసికొనిన కొరవి వరకు గల తమ భూభాగమును తిరిగి స్వాధీనము జేసికొనెను. చాళుక్య భీమునికి అండగా నిలిచి వేంగిరాజ్యమును కాపాడుచుండెను. ఇతని తండ్రియగు (మూడవ) కుసుమాయుధుడు గుణగ విజయాదిత్యునికి సామంతుడై యుండి ఆ రాజు పేరునే తన కుమారునికి బెట్టెను. అదియే గుణగయ్య లేక గొణగయ్య. కొరవి శాసనము రెండవ ఖండములో 'అనుంగు గొణగణ్డు' అని కూడ పేర్కొనబడెను. రాష్ట్రకూట కృష్ణుడు ఆక్రమించుకొన్న రాజ్యమును తిరిగి సంపాదించుకొనుటయేగాక చాళుక్య భీమునికి ముఖ్యుడగుటను బట్టి యితనికి అనుంగుడను పేరుండియుండును. భీము డితనిని రాష్ట్రకూట రాజ్యమునకు వేంగి రాజ్యమునకు గడి స్థానమగు కొరవిలో కాపుంచెను. అందుచే ముదిగొండ నుండి తమ రాజధానిని కొరవికి మార్చిన వాడిత డనియే చెప్పవలయును. వీరి వంశములో నీ గొణగయ్య యీ ఘన కార్యము అనగా తండ్రి యుద్ధములో జనిపోయినను తన బలపరాక్రమములతో శత్రువశమైన రాజ్యమును తిరిగి సంపాదించి కొరవిలో సుప్రతిష్ఠితుడగుటనుబట్టి వంశ చరి

త్రలో నితని ఘనత కొనియాడబడుట గానవచ్చును. పై జెప్పిన క్రివ్వక శాసనములో అప్రస్తుతమైయున్నను కరియ గొణగుడు కొరవి వల్లభుడైనట్లు కీర్తింపబడెను. కరియ అనగా నల్లనివాడని తెలియుచున్నది. దీనినిబట్టి వేరొక గొణగు డున్నట్లు సూచితమగు చున్నది గదా ఆ వేరొక గొణగుడు కొరవి శాసనములోని అనుంగు గొణగుడేల కాకూడదనవచ్చును. కాని **అపూర్వ**మగు 'కొరవిపురవల్లభ' యను విశేషణము కొరవి శాసనమునుబట్టి అనుంగు గొణగునికి కంఠోక్తిగ జెప్పబడకున్నను అందలి విషయ పర్యాలోచనము వలన స్పష్టమగుచున్నది. క్రివ్వక శాసనములో కరియ గొణగుని కది కంఠోక్తిగ జెప్పబడెను. కనుక నిరువురు నొకరే య్యై యుందురని తోచుచున్నది. అనుంగు పదమునకు స్వామికి ముఖ్యుడని మాత్రమే యచట జెప్పవలెను. కొరవిశాసనము 'అనుంగు గొనగణ్డను పేరితో జలుక్య భీమణ్డ న్దను' అని అప్పటి సందర్భమునకు తగినట్లే ఆ విశేషణము వాడబడెను. అనగా కరియ గొనంగడను నిజనామములో 'కరియ' అను విశేషణమునకు బదులు 'అనుంగు' అను విశేషణము తాత్కాలికముగ జేర్చబడెనని తెలియుచున్నది. కనుక వారిరువురు ఒకేవ్యక్తిని సూచించుననుట సహేతుకమనిపించును. కాగా, కరియ గొనగుడు కానట్టి వేరొక గొణగు డెవరు కాదగునో చెప్పవలయును. వరంగల్లు తాలూకా నారాయణగిరి యను గ్రామ పరిసరమున నొక గుండు రాతిపైన నొక కన్నడ శాసనములో 'మహా సామన్తాధిపతి సత్యాశ్రయ కుళాన్వయ శ్రీమత్ గుణగ రస రుత్తరోత్తరాభివృద్ధి యొళ్' అని యొక గుణగయ్య మహాసామన్తరాజుగ జెప్పబడెను.[4] ఆ శాసనము శకాబ్దము 927 అనగా క్రీ. శ. 1004 నాటిది. అప్పటికి అర్వాచీన చాళుక్య వంశ స్థాపన జరిగి యిమ్మడి తైలపుని కొడుకగు ఇరివ బెడంగ సత్యాశ్రయుడు చక్రవర్తిగ అనుమకొండ ప్రాంతములో గానవచ్చును. ఈ సత్యాశ్రయ వంశము వాడగు గుణగుడు కొరవి శాసనములో జెప్పబడిన అనుంగుగొణగుడు కాజాలడు. కొరవి శాసనము క్రీ. శ. 934 ప్రాంతము నాటిది. ఇది క్రీ శ. 1004 నాటిది. అయినను క్రివ్వక శాసనములోని కరియగొనగుడు నారాయణగిరి శాసనములోని గుణగరసుడు కాగూడదా యనవచ్చును. ఇద్దరూ చాలుక్యాన్వయులే. కాని కొరవి చాలుక్యు లెచటను మహా సామంతాధిపతులుగ జెప్పబడలేదు. అంతేగాక నారాయణగిరి శాసనము లోని గుణగరసు కొరవి పురమునకు సంబంధించిన వాడుగ ఆ శాసనములో జెప్పబడలేదు. క్రివ్వక శాసనములోని గుణంగుడు విశేషించి కొరవి పురవల్లభుండని చెప్పబడెను. అట్టివాడు కొరవి శాసనములోని అనుంగు గొణంగుడు మాత్రమే కాని యితరుడు కానేరడు అతడే కరియ గొణంగుడు. అతడు క్రీ. శ. 934 నాటి వాడు క్రీ. శ. 1004నాటి నారాయణగిరి శాసనములోని గుణగ రసుడు చాలుక్య సత్యాశ్రయుని క్రింద వేరొక సామంతుడనుకొన వలెను. అతడును చాలుక్యాన్వయుడే. ఇతని నుద్దేశించి కరియగొన గుడు 'కరియ' యను విశేషణముతో జెప్పబడలేదు.

కరియ గొణగునికి సమకాలికుడగు వేరొక గొణగయ్య యెవ్వరైనది మనకు తెలియదు. కాని గొణగుని తండ్రి యగు కుసుమాయుధునికి స్వామియు, చాలుక్య భీమునికి పెద తండ్రియు నగు ప్రసిద్ధ గుణగవిజయాదిత్యుడే ఆ మరొక గొణగయ్య యనవచ్చును. ఆ రాజును గుణగ, గుణక్కెనల్ల అను బిరుదనామములతో బేర్కొనుట శాసనములందు గానవచ్చును. అందుచేత కొరవి గొణగయ్యను వేరుగ జెప్పుటకై 'కరియ గొణగయ్య' యని వాడుకయై యుండుటలో నసహజమేమియు లేదు. కనుక కొరవి శాసనమందు జెప్పబడిన అనుంగు గొణగయ్య క్రివ్వక శాసనములోని కరియ గొణగయ్యయు నొకే వ్యక్తి కాదని నిరూపించజాలము.

కొరవి శాసనములో గొణగయ్య తరువాత నతని తమ్ముడగు నిరవద్యుడు భీమసలుకి అనగా వేంగిరాజగు రెండవ భీముని (క్రీ. శ. 934–945) కనుకూలుడై కొరవికి పాలకుడయ్యెనని చెప్పబడెను. ఆ సందర్భమున నతడు కొరవి గ్రామ నాయకునకు కొన్ని పన్నులు వసూలు చేసికొనునట్టి యధికార మొసగును. క్రీ. శ. 934 లో కూడ కొరవిలోను వేంగిలోను రాష్ట్రకూట నాల్గవ గోవిందుని ప్రోద్బలమున రాజకీయాంతః కలహములు చెలరేగెను. వేంగిలో యుద్ధమల్లుని జంపి మొదటి అమ్మరాజునకు సవతి తమ్ముడగు రెండవభీముడు రాజ్యము చేజిక్కించుకొనెను. కొరవిలోని గొణగయ్య అమ్మరాజు కొడుకునకు తన సహాయమును ప్రకటించుటచేత, యుద్ధమల్లుని పక్షమునవచ్చిన రాష్ట్రకూట గోవిందుని సైన్యములాతనిని కొరవి నుండి తరిమివేయగా నతడు వేములవాడ చాలుక్య రాజగు రెండవ అరికేసరి నాశ్రయించెను. అరికేసరి గోవిందునికి శత్రువు. గోవిందుని చంపించి రాష్ట్రకూట సింహాసనముపై మూడవ అమోఘవర్షుని నెక్కించెను. ఈ మార్పిడిలోనే వేంగిలో రెండవ భీముడు యుద్ధమల్లుని జంపి సింహాసన మాక్రమించుకొనెను. ఈ యదనుచూచి కొరవి నుండి గొణగయ్య పారిపోయెను గనుక నతని తమ్ముడు నిరవద్యుడు రెండవ భీముని సహాయముతో కొరవికి రాజయ్యెను. ఇంతలో గొణగయ్య వృద్ధుడై చనిపోయి యుండును అతని కొడుకగు బద్దెగుడు అరికేసరికి సామంతుడుగ కాళేశ్వరము–చెన్నూరు ప్రాంతముల నేలుచున్నట్లు క్రీ. శ. 942 నాటి చెన్నూరు శాసన మొకటి తెలుపుచున్నది. క్రీ. శ. 934 లో వేంగి చాళుక్యులలోను, రాష్ట్రకూట వంశములోను వెనుకటి రాజులను తొలగించి వారి దాయాదులు సింహాసనము లాక్రమించుకొనిరి. అట్టి మార్పు మధ్యనున్న చిన్న కొరవి రాజ్యములో గూడ వచ్చెను. వేంగి సింహాసనమునకు వారసుడైన మొదటి అమ్మరాజు కొడుకగు బేత (లేక) కణ్ఠిక విజయాదిత్యుని తరిమివైచి మొదటి తాడపరాజు క్రీ. శ. 928–29లో సింహాసనమాక్రమించెను. మొదటి చాలుక్య భీముని రెండవ కొడుకగు రెండవ విక్రమాదిత్యు డీ తాడప రాజును జంపి రాజయ్యెను. సంవత్సరములోపుగనే యితనిని జంపి అమ్మరాజు రెండవ కొడుకు రాజయ్యెను. కొద్ది నెలలలో నితనిని జంపి తాడపుని కొడుకగు రెండవ యుద్ధమల్లుడు రాష్ట్రకూట నాల్గవ గోవిం

దుని సహాయముతో క్రీ. శ. 930 ప్రాంతమున వేంగి సింహాసన మధిష్ఠించెను. అయినను నిజముగ వారసుడగు అమ్మరాజు కొడుకగు కణ్ఠిక విజయాదిత్యుడు, ఇతని పిన తండ్రియగు రెండవ భీముడు విడివిడిగా యుద్ధమల్లునిపై కాలు దువ్వుచుండిరి. ఈ పరిస్థితిలో కొరవిలోని గొణగయ్య న్యాయసమ్మతముగ మొదటి అమ్మరాజు కొడుకైన కణ్ఠిక విజయాదిత్యుని పక్షము వహించినట్లు తోచును. అతని తమ్ముడగు నిరవద్యుడు రాజుకాదు గనుక కొరవిని విడిచి వేంగి దేశమున రెండవ భీముని పక్షమున జేరెను. ఇంతలో యుద్ధమల్లునికి సహాయముగ రాష్ట్రకూటగోవిందుని సైన్యములు వేంగి ముఖముగ తరలి వచ్చుచు దోవలోనున్న కొరవిపై దాడిచేసిరి. యుద్ధమల్లుడి కొక విరోధి యైనందున కొరవి రాజైన అనుంగు గొణగయ్య గోవిందుని సైన్యము నెదుర్కొన శక్తి చాలకపోవుటచేతను, వేంగిలో నిపుడు తన కాశ్రయమిచ్చువారు లేకపోవుటచేతను ప్రక్కనున్న వేములవాడ రాజగు చాలుక్య రెండవ అరికేసరి యొద్దకు చేరెను. ఈ యరికేసరి గోవిందునికి శత్రువు. ఇతడు తరువాత కొద్ది కాలములోనే క్రీ.శ. 934–35లో గోవిందుని దేశమునుండి పారదోలి బద్దెగుడను మూడవ అమోఘవర్షుని రాష్ట్రకూట సింహాసన మెక్కించెను.[5] గోవిందుని పరాజయముతో వేంగిలో యుద్ధమల్లుని బలము తగ్గెను. రెండవ చాలుక్య భీముడు (భీమ సలికి) యుద్ధమల్లు నెదిర్చి వేంగి సింహాసన మాక్రమించుకొనెను. తన నాశ్రయించియున్న కొరవి నిరవద్యుని కొరవి రాజ్యము నందు తనకు అనుకూలుడగు సామంతునిగ ప్రతిష్ఠించెను. ఈ సందర్భమున నిరవద్యుడు కొరవి నాయకుడగు పెద్దనను రావించి యతనికి కొన్ని పన్నులు వసూలుచేసికొను నధికారమొసగి తన పక్షమేయుండవలెనని చెప్పుటకై యతనిచే కొరవి శిలాశాసనము వేయబడెను. కొరవిపుర వల్లభుడని పొగడ్త నొందిన గొణగయ్య ఈ విధముగ కొరవిని పూర్తిగ విడిచిపోవలసిన వాడయ్యెను. అతడు న్యాయము కొరకై వేంగిసింహాసనమునకు వారసుడైన కణ్ఠిక విజయాదిత్యుని పక్షమున యుద్ధమల్లుని దురాక్రమణము నెదుర్కొనుచు రాష్ట్రకూట గోవిందునికి శత్రువు కావలసి వచ్చెను. తానాశ్రయించిన వేములవాడ రెండవ అరికేసరి గోవిందుని పదభ్రష్టుని గావించినను తనకేమియు లాభము కలుగలేదు. మూడవ పక్షమువాడైన రెండవ చాలుక్య భీముడు వేంగి సింహాసనము నాక్రమించుకొనుటవలన నతనికి సహాయముగనున్న నిరవద్యుడు కొరవి దేశమున కధిపతి కాగలిగెను. రాజకీయ నాయకుల యదృష్టములు కొద్దిలో తారుమారగుననుట కిదియొక చక్కని యుదాహరణ.

ఇంతలో గొణగయ్య చనిపోయినట్లు తోచును. గోదావరి తీరమున చెన్నూరు గ్రామములో నగరేశ్వరాలయము వద్దనున్న శాసన

ములో శకము 863 ప్రాంతమున (= క్రీ. శ. 941) చాలుక్య గొణగరసుని కొడుకైన బద్దెగు డొకడు చాలుక్య అరికేసరి ప్రాపున జేరి పొదననాడులో చేరిన తేకుబట్టు–70 రాజ్యభాగములో నొక యగ్రహారమునకు సంబంధించిన దానమొసగినట్లు చెప్పబడెను. దీనినిబట్టి కొరవి గొణగయ్య కొడుకు గూడ అరికేసరికి సామంతుడుగ నచటనే స్థిరపడెను. కొరవిలో మిగిలినది నిరవద్యుని వంశమని దీనివలన స్పష్టమగుచున్నది. ఈ విషయము కొరవి శిలాశాసనములో క్లుప్తముగ సూచించబడెను. అప్పటి వేంగి రాజకీయములను, రాష్ట్రకూట రాజకీయములను సరిగా సమన్వయము చేసికొనినగాని యీ కొరవి శాసన మర్థముకాదు. క్రివ్వక శాసనము కరియ గొణగయ్యను కొరవి పురవల్లభుడని మాత్రము చెప్పి యంతటితో వతని వంశమును వదలి తమ్ముడగు నిజ్జయరాజు వంశమే యచట స్థిరపడినట్లు చెప్పును. కొరవి శాసనము నిరవద్యుడచట స్థిరపడినట్లు తెలుపుచున్నది. అనుంగు గొణగయ్యను కొరవి పురవల్లభునిగ వర్ణించును. ఇంతవరకు మనకు కొరవిని గూర్చిన రాజకీయాంశ మొకటియే తెలియుచున్నది. దాన్ని పురస్కరించుకొని కొరవి శాసనములోని అనుంగు గొణగుడే క్రివ్వక శాసనంలోని కరియ గొణగుడనియు, కొరవి శాసనములోని నిరవద్యుడే క్రివ్వక శాసనములోని నిజ్జయ రాజనియు గుర్తించుట సమంజసమని తోచుచున్నది. కొరవి శాసనములోని వారిద్దరు సోదరులైనట్లు క్రివ్వక శాసనములోని వారిద్దరు కూడ సోదరులేయగుట రాజకీయాంశమునకు తోడు వేరొక ప్రధాన కారణము కాగలదు. నిరవద్యుడను పదము అనిందితుడను వర్థములో నొక బిరుదు. ఈ బిరుదును ఆనాటి చాలుక్యరాజులు తదితరులు వాడుకొనుచుండిరి. దానితోబాటు తమ నిజనామమును గూడ జెప్పుకొనిరి. కొరవి శాసనములో నొకవైపున మొదటి పంక్తిగా 'సటానెగల్ల శ్రీనిరవద్యుణ్డనేక సమర' మున్నగు విషయము వ్రాయబడెను. శాసన శిల యడుగువైపున భిన్నమై యుండుటచేత ఈ వాక్యమునకు ముందు వేరొకవైపున నెంత వ్రాత నష్టమయ్యెనో తెలియదు. అందు నిజ్జయుడను నిజనామ ముండి యుండెనను ఊహకు తావు కలదు. వేరొక చోటెచ్చటను నిరవద్యుడను పేరు కానరాదు. కనుక రెండు తామ్రశాసనములందు చెప్పబడిన నిజ్జయుడను పేరునే నిజనామముగ గ్రహించి నిరవద్యుడనునది యతని బిరుద నామముగ కొరవి శాసనమందుపయోగించబడెనని చెప్పవలెను. దానిలో కూడ శిలాభాగము విరిగియుండుటచేత నిజ్జయుడను నిజనామముండెనను అనుమానమునకు తావున్నది.

ఈవిధముగ మొగలి చెఱువుల తామ్రశాసనమును, క్రివ్వక తామ్రశాసనమును, కొరవి శిలాశాసనముతో సమన్వయముచేసి రెండు తామ్రశాసనములందు జెప్పబడిన వంశావళులను కలిపి యొకటిగా నమర్చుట అసమంజసము కానేరదు.




* ''ఆచిదేవి'' (నిజ్జయరాజు భార్య) — ఇప్పటికీ అరవ చెట్టియార్‌లలో భార్యని ''ఆచి'' అంటారుట! ఫలానా చెట్టియార్ ''ఆచి'' అని......

ముదిగొండ చాలుక్యులను గూర్చిన సమాచారము తెలుపు మొట్టమొదటి శాసనము కొరవిలోని శిలాశాసనమే. అది సుమారు క్రీ. శ. 934 నాటిది అంతకు ముందున్న రాజుల సంగతి కొంత మొగలి చెఱువుల శాసనములో జెప్పబడినను అది కేవలము రాజుల పేర్లు తెలిసికొనుటకు మాత్రమే యుపయోగించును. వీరికి రాజ చిహ్నముగ నొక కణ్ఠియ యుండెడిదనియు దానిని వంశస్థాపకుడగు రణమర్దుని పేరుతో రణమర్ద కణ్ఠియయని పిలుచువారని కొరవి శాసనమును బట్టియే తెలియుచున్నది. ఈ ప్రాచీన రాజులు వేంగి

చాలుక్యులతో నతి సన్నిహితులుగనుండి వారి పరిపాలనా నిర్వహణ ములో తోడ్పడుచుండెడివారు. ఆ వేంగీశులు కూడ తమపై తఱచుగ దండెత్తివచ్చు రాష్ట్రకూటుల నిరోధించుటకై ముదిగొండ రాజుల సహాయ మభ్యర్థించువారు. క్రీ. శ. 973లో రాష్ట్రకూటులు పతనమొందిరి. పశ్చిమ చాలుక్యులు తెలంగాణము గూడ నాక్రమించుకొనిరి. వేంగిమండలములోని రాజకీయములలో నరాజక మేర్పడి సరియగు రాజెవరు లేకపోయెను. ఆ సందర్భములో కొరవి నేలుచున్న ముదిగొండ సల్కిలు పశ్చిమ చాలుక్యుల నాశ్రయించవలసి వచ్చెను.

ఇంతవరకు ముదిగొండ చాలుక్యుల వంశములో ప్రాచీనుల గూర్చిన చరిత్ర స్థూలముగ జెప్పబడెను. రాష్ట్రకూటుల యధికార ముచ్ఛ్రదశలో నున్నంతకాలము వీరు చాల యిక్కట్లకు లోనుగావలసి వచ్చెను. రాష్ట్రకూట రెండవ కృష్ణుడు మొదటి చాలుక్య భీమునిపై దండెత్తి వెళ్లినపుడు మూడవ కుసుమాయుధుడు రాష్ట్రకూటుల నెదిర్చి ప్రాణములు గోల్పోయెను. తరువాత నాలుగవ గోవిందుని యుద్ధమల్లునికి సహాయముగ బోవుచు కొరవి నుండి గొణగయ్యను పారద్రోలెను. ఈ నడుమ వీరికి పోటిగ రాష్ట్రకూటులు తమ పక్షమున కాకత్య యెఱ్ఱనను, వాని మనుమడు గుండియను కొరవిలో గాకున్నను ఆ సమీప ప్రాంతమున ముదిగొండ సల్కిలకు పక్కలో బల్లెమువలె నెలకొల్పినట్లు తెలియుచున్నది. ఇంకముందు చెప్పబోవు కథ ముదిగొండ సల్కిలకు—కాకతీయులకు సంబంధించియుండును.

## అధోజ్ఞాపికలు

1 ఇం. ఏంటి XXXII - P. 281.

2 Epigraphia Andhrica Vol. I పుటలు 119-145. (i) శ్రీ యం. వి. యన్. ఆదిత్యశర్మ; (ii) శ్రీ యన్. దాశరథి; (iii) శ్రీ యన్. ముకుందరావు; (iv) శ్రీ జి. జవహరులాలు, నాలుగు ప్రత్యేక వ్యాసములు వ్రాసిరి.

3 మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించినది, 1975. పుటలు 48–70.

4 వరంగల్లు జిల్లా శాసనములు, పుట 18.

5 పంపకవి రచించిన కన్నడ విక్రమార్జున విజయమను భారతములో గూడ నరికేసరి విజయిత లేక బిజ్జ అను చాలుక్య రాజున కాశ్రయమిచ్చెనని గలదు. ఈ బిజ్జయే గొణగ విజయిత.

*(సశేషం)*

# గోవులు

## శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఆలోచనల పువ్వులు పరుచుకున్న
నిశ్శబ్దపు పచ్చిక బయలు మీద
నిమిషాల ఆవుల్ని అదలించే
ఆత్మను !
ఆలకాపరిని !
అనుభవం చేతిపూతగా ధరించి
వంటరిగా అదలిస్తున్నా,
వయసు తెలియని గోవుల్ని,
కాలపుటఘాతం వైపుకు
ఒరులెరుగని సుషుప్తి స్థలానికి –
కాంతి వలయానికి !
కర్మ మార్గానికి !
ఈ నిమిషాలు నన్ననిమిషుణ్ని చేస్తున్నవి,
మంచితనం వెండి కాటుక నా కంటికి పూసి
గొప్పదనం బంగరు పన్నీరు నా తలపై చిల్కరించి
ఈ గోవులు నన్ను మరల మరల బ్రతికిస్తున్నవి!

శ్రీ విక్రాల శేషాచార్యులు

# సంస్కృతములోని తెలుఁగు వ్యాకరణ చ్ఛన్దో గ్రంథములు

**అ**తి విపులమైన యీ భూవలయములో నే దీవియందే దేశమందున్ననైనను చిలుకలు, కోయిలలు, కాకులు, కప్పలు, ఎద్దులు, దున్నలు, పిల్లులు, మేకలు, కుక్కలు, గాడిదలు, గుఱ్ఱాలు మున్నగాగల బహువిధ జన్తు కోటిలో నొక్కొక్క విధమైన జంతువునకొక్కటియే భాషగ నుండును. ఉదాహరణము :- ఎచ్చటనైనను పిల్లులు మావ్ అని, మేకలు మే అని, కుక్కలు బవ్ అని అనును. ఐతే మావ్ మే-బవ్ మొదలైన యీ శబ్దములు ధ్వన్యనుకరణములే. ఐనను వాటిలో నేదో సంకేతమునుబట్టి దాని జాతిదైన మఱియొక జంతు వాభాష నెఱుంగును. ఇట్లే సర్వత్ర ఉండెడు మానవజాతికి గూడా ఒక్కటే భాషయుండవలెను. అది సంస్కృత భాష అని అశేష విమర్శక లోక మంగీకరించిన విషయమే. ఆ సంస్కృత భాష అనంతర మనంతకాలములో అనేక సహస్ర లక్షల సంవత్సరములు గడువగా ఆయా భూభాగములలోని శీతోష్ణ వాత తారతమ్యము ననుసరించి పలుకులో పలు రకముల లఘూచ్చారణము కలిగి — ఆ లఘూచ్చారణమే సులభమైనందున నిలిచిపోయినది. అవియే దేశభాష లని చెప్పబడుచున్నవి. చివరకు సంస్కృత మభ్యసించ వలసిన దశ నొందినది. ఇట్లు పలుతావుల పలు విధముల నేర్పడిన ఆ లఘూచ్చారణను కూడా మఱికొంత కాలమునకు మఱియొక రకముగ మాఱునని తెలిసి ఆ లఘూచ్చారణమునే (ప్రకృత మాంధ్ర భాష) సంస్కరించుచు నతి పురాతన కాలము నందలి మహర్షులు అన్ని ప్రాంతములవా రెఱుంగుటకుగాను అన్ని దేశములలో వాడుక భాషయైన సంస్కృతముతోనే ఆ లఘూచ్చారణమున (ప్రకృత మాంధ్ర భాష) కు వ్యాకరణ శాస్త్రమును, ఆ భాషతో కవిత లల్లుటకు లక్షణమునున్ను రచించిరి. సంస్కృతములో తెలుగు వ్యాకరణ గ్రంథములను రచియించిన మహనీయులను కొందఱిని — వసుచరిత్ర రచయితయగు రామరాజభూషణుని కంటె కొంచె మనంతర కాలీనుడైన మండ లక్ష్మి నరసింహాచార్య కవి సంస్కృత భాషతో స్వకృతమైన [1]''ఆంధ్ర కౌముది'' అను వ్యాకరణ గ్రంథములో మొదట ఐదారు శ్లోకము లైన తర్వాత పేర్కొనియున్నాడు. వారు విష్ణువు — ఇంద్రుడు — బృహస్పతి — సోముడు — చంద్రుడు—కణ్వుడు — పుష్పదంతుడు — అధర్వణుడు — భృగువు మున్నగువారు. ఈ వ్యాకరణ కర్తలలో దేవతలు, ఋషులు కలిసి యున్నారు. ఆంధ్రము విష్ణు ప్రియమైన భాష కనుక దేవతలు, ఋషులు నీ భాషకు వ్యాకరణములను రచించినారు. ఆంధ్రము విష్ణుప్రియమైనదనుటకు పూర్వోక్తుడయిన మండ లక్ష్మి నరసింహ కవి ఆంధ్ర కౌముదిలో నథర్వ శిఖోపనిషత్తు నుంచి ప్రమాణమును చూపియున్నాడు. ''త్రిమూర్తీనాం సంస్కృ తాంధ్ర ప్రాకృతాస్తు ప్రియంకరాః''అని. అనగా సంస్కృతము, ఆంధ్రము, ప్రాకృతము త్రిమూర్తులైన బ్రహ్మ — విష్ణు — రుద్రులకు ప్రియమైనవి యని యర్థము. ఆంధ్ర భాష విష్ణుప్రియమైనది కనుకనే ముందు వైకుంఠాది విష్ణులోకములలోనుండి యొక సందర్భములో విష్ణు నానతిని జేసి గరుడుడు దేవతలకు నుపదేశింపగా వారి వలన ఋషులు పొంది వ్యాపింపజేసిరి. ఆంధ్ర శబ్దముయొక్క వ్యుత్పత్తియు నీ యర్థమునే తెలుపుచున్నయది. ఎట్లనిన? ''శ్లో॥ అక్షరాణా మకారో ఽ స్మి...'' ''అకారో విష్ణువాచకః'' ఇత్యాది భగవద్భాగవత సూక్తులనుబట్టి ''అః'' అనగా విష్ణువు. ''అం'' అనగా విష్ణువును, ''ధ్ర'' వాహనమై ధరించువాడు కాబట్టి ''అంధ్రః'' అనగా గరుడుడు. తస్యేయం ఆంధ్రీ, ఆంధ్రీ చ సా భాషా చ ఆంధ్ర భాషా అని సమాసము. గరుడుని సంబంధమైన భాష అని యర్థము. ఈ విషయము మిగుల విస్తరముగ మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి శ్రీమాన్ కీ శే. విక్రాల రామచంద్రాచార్యులవారు ''జనక జీవిత'' మనెడు మాతాతగారైన షడంగ వేదజ్ఞ శ్రీమాన్ కళత్తూరు విక్రాల రాఘవాచార్యుల వారి జీవిత చరిత్రములో వా''రాంధ్రదేశ భాషా మహిమానువర్ణన'' మను గ్రంథమును రచించిన విషయమును వ్రాయుపట్టున అందలి ''శ్లో॥ చతుష్షష్ట్యక్షరా కాచిత్...'' అను శ్లోకము నుదహరించి దాని వివరణములో నాంధ్ర భాషోత్పత్తి కథను కృష్ణయజుశ్శాఖల నుంచి యెత్తి తెలిపియున్నారు. దాని సారాంశము — దేవతలు అసుర పరాజయార్థము యజ్ఞము చేయనెంచి నారాయణు నాశ్రయించగా ఆ నారాయణుని యనుజ్ఞగొనిన గరుడుని వలన వారును, వారి నుండి మహర్షులును పొంది వ్యాపింపజేసిరి. ఇట్లీభాష భువికి వచ్చుటకు గరుడుడే మొదలు కావున దీనికాంధ్ర భాష అని పేరు కలిగెను. ఈ యితిహాసమును బట్టియే

పై ఆంధ్రదేశ భాషా మహిమాను వర్ణనములో మఱియొకతావునను

"శ్లో॥ ద్వైవీ చాఽఽన్ధ్రీచ భాషే ద్వే పరస్పరసమే స్మృతే
యస్మా ద్ద్వైస్వమభ్యస్తే విష్ణుతత్త్వ ప్రకాశికే."

అనియు దెలిపిరి. ఇది మండ లక్ష్మీనృసింహకవి ఆంధ్రకౌముది యం దుదహరించిన

"ఆంధ్ర సంస్కృత భాషాస్తు దేవతావ్యాగి ప్రమోదదాః
సుబన్తైశ్చ కృదంతైశ్చ యుక్తాస్స్వర్గప్రదా నృణామ్."

అనెడు కణ్వస్మృతి సూక్తి ననుసరించి చెప్పబడినది.

విష్ణువు మున్నగు వ్యాకరణ కర్తలలో బేర్కొనబడిన అథర్వణుడు దేవర్షుల నడుమను నుడువబడుటచేత నథర్వణకారికావళి ప్రణేతయైన అథర్వణాచార్యు కంటెను భిన్నుడయిన యొక మహర్షి అని భావించనగును.

మఱియు కణ్వమహర్షి నారాయణు నాజ్ఞచేత తా నాంధ్ర వ్యాకరణము రచించెననియు, తాను రచించిన వ్యాకరణమునకు ద్రోహము చేసినవాడు గురు ద్రోహము చేసినవాడే అనియు నుడివె నని తెలిపియున్నాడు. ఆ పంక్తులు—"పునః కణ్వస్తు యథాఽఽహ. ఆంధ్రవిష్ణో రనుజ్ఞాకృతస్య మద్వ్యాకరణస్య ద్రోహీ గురుద్రోహీ" అని.

మఱియు శ్రీమద్రామాయణ ప్రణేతయైన వాల్మీకి మహర్షియు నాంధ్ర భాషకు వ్యాకరణము రచించె నని శ్రీమాన్ మా తండ్రిగా రొక యుపన్యాసము నందును, ఆంధ్ర వాల్మీకి శ్రీ వావిలికొలను సుబ్బరావుగా రాంధ్ర వాల్మీకి రామాయణము బాల కాండ ప్రథమ సర్గము పీఠికా పద్యములలోను దెలిపియున్నారు. ఆ పద్యము —

"గీ॥ అమర భాషను బలికె రామాయణంబు
నాంధ్ర భాషకు వ్యాకృతి కాద్యుఁ డయ్యె।
నట్టి వాల్మీకి మనమున నలరకున్నె
యస్మదీయాంధ్ర పద్యరామాయణమున."

(౮౧వ పద్యము.)

ఈ పద్యము యొక్క మందరవ్యాఖ్యాన పంక్తులు :-
"తాత్పర్యము. సంస్కృత భాష యందు శ్రీమద్రామాయణము రచించెను. ఆంధ్ర భాషా వ్యాకరణము రచించిన వారిలో మొదటి వా డయ్యెను ఇ ట్లాది కావ్యకర్తయు ఆంధ్ర వ్యాకృతి కర్తయు నైన వాల్మీకి తాను రచించిన శ్రీమద్రామాయణమునకు సరియై నదియుఁ, దాను రచించిన వ్యాకరణ లక్షణములచే బద్ధ మైనదియు నైన ఆంధ్ర పద్య రామాయణముచే సంతోషింపకుండునా ?..." ఇత్యాది (1932 సంవత్సర ముద్రితము ౯౯వ పుట.)

వీరే కాక అథర్వణాచార్యుడు త్రిలింగ శబ్దాను శాసనము నందు మఱియొక మునీంద్రుని దెలిపినాడు. "శ్లో॥ హేమచంద్రాది మునిభిః కథితం చాఽఽన్ధ్ర లక్షణ" మ్మని. ఇ య్యాది మును లెవ్వరో యెఱుంగరారు. కాని యీ హేమచంద్రుడు ముని కనుక అభిధాన చింతామణి కావ్యానుశాసనము మున్నగు పెక్కు గ్రంథములను రచించిన జైనుడైన హేమచంద్రాచార్యుని కంటెను భిన్నుడని భావించదగును.

ఇట్లు సంస్కృత మాంధ్ర భాషగ మాఱుటకు చాల సమీప కాలనువా రనందగిన అతి చిరంతన కాలీనులైన మునివర్యు లాంధ్ర భాష యొక్క వ్యాకరణ చ్ఛన్దశ్శాస్త్ర గ్రంథములను సంస్కృతము తోనే రచించగా వెనుక బహు కాలమున కవతరించిన బుధ మూర్ధన్యులు ౧ కొందఱు సంస్కృతముతో గ్రంథ రచన సంప్రదాయ మనియు, ౨ మఱికొందఱు సంస్కృతములో రచించినచో పాఠకులా భాషను కూడా అభ్యసించ వీలగుననియు, ౩ ఇక గొందఱు ఈ గ్రంథ నిర్మాత ఉభయభాషా ప్రవీణు డని భావికాలపువారు భావించెద రని కీర్తికాములై, ౪ మఱికొందరు దూరదేశములలోని విద్వాంసులు నాంధ్ర భాషయొక్క లక్షణముల నెఱుంగుదురని యాశయము తోను సంస్కృతముతోనే తెలుగు వ్యాకరణ ఛన్దో గ్రన్థములను రచించిరి.

ఆంధ్రభాషయొక్క లక్షణగ్రంథము లాంధ్రభాషతోనే రచియించ దగి యుండగా సంస్కృతభాషతో విరచించుటకొక్క కారణము నా మనస్సునకు తట్టినది. అది—కొందఱు ముందు సంస్కృతమును బాగుగ నభ్యసించి ఆ వెనుక తెనుగును చదువుకొని—తెనుగులో గ్రంథరచనను మొదలిడుటకు ముందుగ—పరిచయ విశేషము చేత తమకు సులభమైన సంస్కృతముతోనే-పిమ్మట నేర్చుకొనిన తెనుగు భాషయొక్క లక్షణ గ్రంథములను రచించియుందురనియు, ఋషిప్రణీతములు తెనుగు విస్తరించి దృఢపడకముందు రచితములై యుండునని.

ఇట్టి గ్రంథములలో నేది యే యుద్దేశముతో రచితమైనను నివి యుభయభాషాభ్యాసమునకు మిగుల నుపయుక్తము లనుటలో సందేహము లేదు.

ఈ యుపన్యాసమునందు నా యెఱింగిన యిట్టి గ్రంథములను తెలుపుచున్నాను.

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో।
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా। నా రుచిరార్థ
సూక్తినిధి నన్నయభట్టు తెనుంగున న్మహా। భారత సంహితారచన

కుపక్రమించి మొదటి మూడు పర్వములలో నాది—సభా పర్వములను పూర్తిగను, నారణ్య పర్వమును కొంతవరకు తెనిగించి తెనుఁగున కాదికవి యని ఖ్యాతి గనినవాడు ఆర్యావృత్తములతో [2]"నాంధ్ర శబ్ద చిన్తామణి" యను గ్రంథమును రచించెను. మన కుపలభ్యమానములైన సంస్కృతభాషా ప్రణీతాంధ్ర వ్యాకరణ గ్రంథములలో నిదియే తొలి మానవకృతి యనవచ్చును. ఆంధ్రమునకు ద్వితీయాచార్యుడని ప్రతిష్ఠ గాంచినవాడు, మహాభారత విరాటపర్వాంధ్రీకరణ నిపు

ణుడునైన అథర్వణాచార్యుడు మొదట త్రిలింగశబ్దానుశాసనమును, అనంతర [3]"మథర్వణకారికావళి" యని చెప్పబడెడు వికృతి వివేక, మను గ్రంథమునున్ను అనుష్టుప్ శ్లోకములతో రచించినాడు. ఈయథర్వణాచార్యుడే త్రిలింగ శబ్దానుశాసనమునందు "శ్లో॥ అప్రయుక్తత్వదోషస్తు న విరుద్ధో హరేర్మతే" అని స్మరించిన హరి పండితుడో మఱియొకడో హరి యనువాడు విరచించిన "హరికారికావళి" యను పేరుకల ఒక గ్రంథము కలదు. అథర్వణ కారికావళి యందే స్మరింపంబడిన శ్రీ కవి మున్నగు ఆంధ్రవ్యాకర్తల రచనలేవో లభించక వాటి పేళ్లుకూడా విస్మృతములైనవి. ఆంధ్ర శబ్ద చింతామణికి అహోబలపండితుడు [4]"అహోబలపండితీయ"మని స్వనామాంకితమైన కవి శిరోభూషణ మనెడు యించుక విస్తృతమైన వ్యాఖ్యానమును రచించినాడు. మంచెళ్ల వాసుదేవకవి ఆంధ్ర సిద్ధాంతకౌముది అని నామాంతరముకల [5]"వైకృత చన్ద్రిక"ను రచించెను. ఈ వాసుదేవకవి రచించినదే..........మఱియొక గ్రంథము మద్రాస్ ప్రాచ్య లిఖిత గ్రంథభాణ్డాగారపు పుస్తక సూచికలో కనుపించుచున్నది. తర్క సంగ్రహ నిరుక్తి, తర్క సంగ్రహ టిప్పణి, తర్కవాదము, ముక్తావళి, మంజూష మున్నగు గ్రంథముల కర్తలైన కొడవలూరు పట్టాభిరామ పండితులవారు "పట్టాభిరామ పండితీయ"మను పేరుతో బృహద్వ్యాఖ్యను రచించినారని విక్రమసింహపురీ మండల సర్వస్వము చెప్పుచున్నది. "ఆంధ్రపాణిని" బిరుదుకల నివృత్తి శేషాచల కవి సంస్కృతభాషతో నాంధ్రవ్యాకరణము రచించెనని ఆయన శిష్యుడైన నెల్లూరు శివరామకవి "కామకళానిధి" యను గ్రంథములో—

"మ॥ సకలాంధ్రోక్తుల 'కాంధ్రపాణిని' యనన్ శాస్త్రంబు గల్పించి త
త్ప్రకృతి ప్రత్యయ నిర్ణయంబుకొఱకై భాష్యంబుఁ గావించి, దే
శికుఁడై రాజులచేతఁ బూజఁ గొను నా శేషాచలర్షిన్ నివృ
త్తి కులస్వామిని మద్గురుం గొలుతు భక్తి న్మానసాబ్జంబునన్."

అని చెప్పినాడు. కాని దాని రచనా ప్రకారమును తెలుప నందున నా గ్రంథము సూత్రాత్మకమో శ్లోకాత్మకమో ఎఱుంగ రాదు. రసమాధుర్యాది విషయములలో భోజదేవుని చంపు రామాయణమునకు సాటియగు చంపుభాగవతము (ముద్రితము)ను రచియించిన శిరోమణి రామానుజాచార్యులవారు వాల్మీకీయాంధ్ర వ్యాకరణ సూత్రములకు ననుష్టుప్ శ్లోకానువాద మనదగిన "ఆంధ్రవ్యాకరణ శిరోమణి"ని రచించెను. చిత్తూరు జిల్లా కాళహస్తిలో శ్రీయుక్త మైదవోలు లక్ష్మీనృసింహ సోమయాజులవారి గృహములో వారి సొంత గ్రంథాలయములోని లిఖిత గ్రంథముల పట్టికలో విశేషాంశములను దెలిపెడు నెనిమిదవ కాలములో నీ యాంధ్ర వ్యాకరణ శిరోమణి రూలుమీద దానికి సూటిగ "వాల్మీకి వ్యాకరణ సూత్రాణాం అనుష్టుప్ శ్లోకీకరణం. శ్లోకానాం శిరోభాగేషు వాల్మీకి సూత్రాంకితం చ" అనియు, (అనగా వాల్మీకి వ్యాకరణ సూత్రముల కనుష్టుప్ శ్లోకరచనము. శ్లోకములయొక్క పై భాగములయందు వాల్మీకి సూత్రములతో గూడినదియు యని.) గ్రంథాంతమునందు "పొత్తూరు నారాయణశాస్త్రి భిర్లిఖితం తాళపత్రగ్రంథమాలోక్యమైదవోలు లక్ష్మీనరసయ్యానామ్నాస్వకృతే లిఖితో ఽయంగ్రన్థః" (పొత్తూరు నారాయణ శాస్త్రులవారు వ్రాసుకొనిన తాళపత్రగ్రంథమును జూచి మైదవోలు లక్ష్మీనరసయ్య వ్రాసుకొనినది) అను వ్రాతయు దీని స్థితి నెఱింగించుచున్నది. వీరికి గొంచెము వెనుక కాలములో 1876వ సంవత్సరములో ప. వేంకట కృష్ణయ్యచేత ముద్రింపించి ప్రకటింపబడిన శ్రీపరవస్తు చిన్నయ సూరిగారి బాలవ్యాకరణముయొక్క టైటిల్ పేజీ వెనుక పేజీలో పీఠికలో "...నా నేర్చుకొలందిని సంస్కృత భాషతో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుట వలన దానియందలి సూత్రములు కొన్ని తెనిగించి ప్రకృత గ్రంథము రచించినాడ..." అనియు, గ్రంథము కడన 133వ పుటలో—

"క॥ మును మదుపజ్ఞ బగుచున్। దనరిన వ్యాకృతిని సూత్రతతి యొక కొంతం
దెనిగించి యిది ఘటించితి। ననయము బాలావబోధ మగు భంగి దగన్॥

అనియు

తెనుగునకు శబ్దలక్షణ। మనయం బరయంగ వేడ్క నందిన వారల్
తనరిన నీ వ్యాకరణం। బున మూలంబయిన కృతినిఁ బోలఁ గనఁ దగున్.॥"

అనియు తాను ముందు సంస్కృత భాషతో సూత్రములతో తెలుగు వ్యాకరణ గ్రంథ మొకటి విస్తృతముగ విరచించి ఆ పిమ్మట బాలబోధ కొఱకై అందలి కొన్ని సూత్రములను తెనిగించి ఆ బాల వ్యాకరణము రచించినట్లును, తెలుగు శబ్ద లక్షణము తెలియగోరువారు ఆ బాలవ్యాకరణముయొక్క మూలకృతిని చూడుడని తెలిపినాడు. ప్రాయశః సంస్కృత భాషారచితములైన తెలుగు వ్యాకరణ గ్రంథములలో నిదియే కడపటిది కావచ్చును. ఇవి సంస్కృత భాషలోని తెలుగు వ్యాకరణ గ్రంథములు.

ఇఁకను ఛన్దశ్శాస్త్రగ్రంథములు:-

శ్రీమాన్ మా తాతగారి వ్యాకరణ విద్యాగురువులైన శ్రీమాన్ కందాడై వేంకటాచార్యులవారు పూర్వ ప్రబంధములలో రచయితల వెనుక లేఖకుల ప్రమాదములచేత పడిన ప్రాసదోషములను, అచ్చట సాధుపాఠములను, దెలుపుచు ననుష్టుప్ శ్లోకములతో "ప్రాసధ్వజః" అను గ్రంథమును, అట్లే యతి ప్రమాదములను వాటి సాధుపాఠములను దెలిపెడి "యతిరత్న కిరీట"మనెడి గ్రంథము నార్యావృత్తములతో రచించిరి. ఈ "యతి రత్న

కిరీటము'' నకు శ్రీమాన్ మా. తాతగారు పూర్వప్రబంధములలోని పద్యములను, అటనట తమ రచిత పద్యములనున్ను నుదహరించుచు చక్కని వ్యాఖ్యను సంస్కృత భాషతోనే రచించి, తర్వాత ''వళి'' అనగా పద్యపాదాదుల యక్షరములు, వాటి సాధుత్వాసాధుత్వములను బోధించునట్టి ''వళిప్రదీపః'' అను గ్రంథమును సంస్కృతభాషతో నార్యావృత్తములతో రచించి దానికి స్వయముగ సంస్కృతముతోనే ఆంధ్రపద్యోదాహరణ సహితముగ నొక వ్యాఖ్యానమునున్ను రచియించిరి. గద్వాల సంస్థాన విద్వాంసులైన శ్రీమాన్ పురాణం దీక్షితాచార్యులవారు సుగమములయిన శ్లోకములతో ''ఛన్దోముకురః'' అను గ్రంథమును రచించినారు.

ఇఁకను వీటియొక్క టీకలను, అనువాదములను తెలిపెదను.

ఆర్షగ్రంథములలో బృహస్పతి — కణ్వగ్రంథములకు ప్రాచీన పండిత ప్రణీతములైన సోదాహరణ టీకా తాత్పర్యములు తాళపత్ర లిఖితములు కలవని ఆ గ్రంథములు కలవారు వాటిని జూచినవారు నా మిత్రులు చెప్పగా విన్నాను. నన్నయభట్టు కృతమైన [6]ఆంధ్రశబ్ద చిన్తామణికి పలువురు పండితులు రచించిన టీకా తాత్పర్యములు కలవు. బాలసరస్వతీ మహోపాధ్యాయుడు కొంత విరివిగ [7]''బాలసరస్వతీయ''మని తన బిరుద నామముతో నొక తెనుగు వివరణమును రచించినాడు. [8]''అప్పకవీయ'' మాంధ్రశబ్ద చిన్తామణి కారికల నాధారముగఁ గొని రచించినదే. ఔత్తరాహులైన నొక యాచార్యులవారు తెనిగించిన [9]ఆంధ్ర కవిశిరోభూషణ మను నది చిరకాలమునా డచ్చైనదియు, మఱొక శాస్త్రులవారును చేసిన మఱియొక [10]ఆంధ్రకవి శిరోభూషణమున్ను కొంతకాలమునా డచ్చైనదియు నా విద్యాభ్యాస కాలమునందు మా యింట నుండినవి యిప్పు డదృశ్యములై పోయినవి. 3 అథర్వణ కారికావళికి ద్వితింత్రిణి సీతారామకవి చేసిన తెనుగువ్యాఖ్య కలదు.

నాకీ వ్యాసరచనోద్దేశమును కలిగించిన యొక సంఘటన నిచ్చటఁ దెలిపెదను. విజయవాడవద్ద నామిత్రు డొక్కఁడు తన యింటిలోని గ్రంథముల పట్టిక (లిస్టు) నేర్పఱచుచు నందులో సంస్కృత గ్రంథములను ఆంధ్రగ్రంథములను వేరువేరుగనే వ్రాసి సంస్కృత వ్యాకరణ గ్రంథములలో నథర్వణ కారికావళి, కవిశిరోభూషణముల పేళ్లున్ను చేర్చుకొనియుండెను. నే నొకప్పు డచ్చట కేగినప్పు డత డద్దానిని జూప నేను దానిని చదివి యీ గ్రంథముల నిచ్చట వ్రాసితివేమని యడుగగ నందుల కాయన సంస్కృత రచితములు సంస్కృత వ్యాకరణ గ్రంథములు కనుక అని బదులు చెప్పగా నేనవి తెనుగు వ్యాకరణ గ్రంథములని చెప్పి వాటిని చదివి వాటిలోని విషయములను నుడువగా నాతడు చదువు కొనినవాడు కావున ''సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః'' అను సూక్తిని యథార్థముఁ గావించుచు విషయమును గ్రహించి నేను తెలిపిన తావున వాటి పేళ్లను వ్రాసి రెండవమాఱు గ్రంథపట్టికను తయారుచేసికొని ముందటి పట్టికను రద్దుచేసికొనెను. నా డిట్టి గ్రంథములను దెలుప గలిగిన కౌతుకము నే డీ వ్యాసరూపమున ఫలించినది.

## అధోజ్ఞాపకలు

1 ఆంధ్రకౌముది - మద్రాస్ యూనివర్సిటీవారి వలన విద్వత్పరీక్షకు బఠనీయ గ్రంథముగా నేర్పరుపబడి సూత్రవృత్తులు నాగరలిపితోను, ఉదాహరణము లాంధ్రలిపితోను నచ్చువేసిన సుమారు ౯౭ పుటలుకల యీ గ్రంథము ఆర్షముద్రాశాల, విశాఖపట్టణము అనుచోట దొరకును.

2 ఆంధ్రశబ్ద చిన్తామణి—సటీకము. 3. అథర్వణ కారికావళి—సటీకము, 4. అహోబలపండితీయము (కవిశిరోభూషణము), 7. బాలసరస్వతీయము, 8. అప్పకవీయము—వావిళ్ల రామస్వామిశాస్త్రులు & సన్స్, 292, ఎస్ప్లనేడ్, మద్రాస్, అను తావున లభించును.

5 వైకృత చన్ద్రిక—ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరి, హైదరాబాదు.

6 ఛన్దోముకురః—గద్వాల సంస్థానము, నైజాము.

9–10 ఆంధ్రకవిశిరోభూషణములు.



శ్రీ చందు సుబ్బారావు

# చీలిక

అనుకోకుండా కల్సుకున్నందుకు ప్రకాశరావుగారు మహదానందం చెందారు. గుంటూరు వెళ్ళి చాలా రోజులైందేమో, ఆయన్నీ మధ్య కలుసుకోనేలేదు.

ప్రకాశరావుగారు స్నేహశీలి. ఆయనంటే నాకెంతో గౌరవం. ఆ ఊళ్ళోనే ఓ కాలేజీలో సీనియర్ ఇంగ్లీషు లెక్చరర్‌గా పని చేస్తున్నారు. లెక్చరర్ అంటే కేవలం ఆ పూటకు ముక్కున పెట్టుకుని చీదే ఉపన్యాసకుడుకాదు. కుణ్ణంగా చదివినవాడు. గంటల తరబడి ఓ విషయం గూర్చి విడమర్చి చెప్పగల్గినవాడు. ఏది మంచో, ఏది చెడో, ఏది సాహిత్యమో, ఏది సాహిత్యం లాంటి వేరొక పదార్థమో ఆయన చెబితేనే వినాలి. కళకు అర్థం అద్భుతంగా చెప్పగలడు. 'అభివృద్ధి' అంటే ఆయనకు స్పష్టమైన అవగాహన ఉంది. అభివృద్ధి నిరోధకులంటే అసహ్యమూ ఉంది.

మనుషుల్ని ప్రేమించగలడు. సమానత నాశించగలడు. సమాజం ఎటు పోతుందో మాత్రమే కాదు, ఎటు పోవాలో కూడా ఆయనకు నిర్దిష్టంగా తెలుసు. తెలుగు సాహిత్యం మీద ఆయనకు ప్రేమాభిమానా లున్నాయి. అవే మమ్మల్ని కలిపాయి. ఆయన కంపెనీ కోసం నేనెంతో ఆరాటపడతాను. 'మెచ్యూర్డ్'గా మాట్లాడే ఆయన లాంటి వాళ్ళు దొరికితే నాకు భోజన పానీయాలక్కర్లేదు. నేను ప్రక్కనుంటే ప్రకాశరావుగారికి గాలి పీల్చుకునే అవసరం లేనట్లు మాట్లాడతారు. గుంటూరు వెళ్ళినప్పుడల్లా ఆయన ఆతిథ్యం సంపూర్ణంగా స్వీకరించి రావటం అలవాటైపోయింది.

ప్రకాశరావుగారు ఇటీవల ఇల్లు కట్టించుకున్నారు. ఎమ్మే ప్యాసైన పెద్దమ్మాయి పెళ్ళి కూడా చేసారు. డాక్టరు కిచ్చారుట. యాభై వేలు దాకా కట్నం కూడా కుమ్మరించారట !

వెళ్ళగానే ఈ మాట చెప్పారు ... కేవలం వార్తగా చెప్పారే గాని వాగ్వివాదం కోసం ఆయనెత్తలేదు...నేను మాత్రం...చనువు తీసుకుంటూ

'ఎందుకు కొంటారండీ ప్రకాశరావుగారూ ఇలా వేల వేలు కుమ్మరించి...కరప్షన్ కాదా యిది...ఒక రకంగా యంగ్‌మైండ్స్‌ను మనమే బ్రైబ్ చెయ్యటంలా...మనమే యిలాచేస్తే ఇంకా మనం చెప్పే దెవరికి? ?...' కొంచెం బాధగానే అన్నాను.

ఆయన కూడా తేలిగ్గా తీసుకుంటూ,

'కరెక్ట్-కరెక్ట్...ఏవిటోనోయ్ భాస్కరం... ఇదొక విషస్ సర్కిలైపోయింది. ఈ సమాజంలో ఈ వైరుధ్యాలు తప్పవేమో' అన్నాడు, ''ఈ సిగిరెట్ అలవాటు మానలేకపోతున్నాను'' అన్నంత తేలిగ్గా.

నాన్‌సెన్స్ అనిపించింది. కూతురు మేడల్లో, కారుల్లో తిరగాలని ఎయిర్ కండిషన్డ్ బోగీ లాంటి అల్లుణ్ణి డెలిబరేట్‌గా కొని సమాజం, వైరుధ్యం అంటున్నాడు. చదువుకున్నాం కనుక తెలివి తేటల్తో సమర్థించుకో నవసరం లేదు. 'చేసింది వెధవ పని' అని ఒప్పుకోవటం ఉత్తమం. గట్టిగా ప్రకాశరావుగారితో ఈ ముక్క అంటే ఒప్పుకుంటాడు కూడాను. కాసింత సమాజ వైరుధ్యం అడ్డొచ్చి...మాట మార్చి...కొత్త ఇంటి వంక చూస్తూ

'ఇల్లు బాగుంది' అన్నాను.

'ఆఁ. ఏం బాగుందిలే...అసలది కాదోయ్ భాస్కరం...బీదా బిక్కీ అని యిలా కబుర్లు చెబుతామా ... అదేమిటో ఆరుగదుల యిల్లు కట్టించినా యింకా చాలటం లేదు. మేడమీద రూమ్స్ వేయించమని పిల్లలొకటే గోల.. మరా గుడిసెల్లో, రోడ్ల ప్రక్క డేరాల్లో ఎలా వుంటున్నారో ఏమిటో . ' అర్థం కానంత మిథ్యా విషయం అందులో వున్నట్లు మొహం పెట్టాడాయన. నేనేం మాట్లాడలేదు. పూర్తిగా ఆయన మాటలు వింటే ఉండే తియ్యదనం కోసం వెతుకుతున్నాను.

అవును ఆయన మాటలు తియ్యగానే ఉంటాయి. పరస్పర విరుద్ధంగా ఉండొచ్చు. వికృతంగా ఉండొచ్చు. అర్ధ సత్యాలు కావొచ్చు...'కరెక్టు. కరెక్టు...'అంటూ ఏది కరెక్టో తెలియకుండా చెప్పవచ్చు. ప్రతి విషయాన్ని గుండెల్లోనుండి తోడిచెబుతాడాయన. ఏవైనా పిల్లిమొగ్గ భావాలు కనిపిస్తే అది ప్రకాశరావుగారి హృదయంలో వున్న పొరపాటు కావొచ్చు కాని నాలికలో కనిపించే చీలిక కాదు.

'కరెక్టే' అన్నారు మళ్ళీ ఆయన చిరునవ్వు నవ్వి ... ఏది కరెక్టో ఓ క్షణం నాకు బోధపడలేదు.

'ఇదే సోషలిస్టు కంట్రీలో అయితే చప్పాలొలవగొట్టి ఈ యింట్లో ఆరు కాపురాలుండమంటారు...హహ్హహ్హా' అని నవ్వారు. నేనూ నవ్వాను. నవ్వుకు శృతిగా కాదు, నవ్వగల్గిన ఆయన శక్తికి ప్రతిగా. నవ్వు లాగింతర్వాత...

'అబ్బెబ్బే ... అప్పుడు మీరు విద్యావేత్తల కేటగిరీలో మళ్ళీ మంచి పొజిషనే కొడతారు...' అన్నాను.

'అవునోయ్...అక్కడా పెద్ద పీట మనకే...'

'తప్పదు కదా మేధావులం...'

ఇద్దరం మరోసారి హాయిగా నవ్వుకున్నాం. వాళ్ళ రెండో అమ్మాయి ట్రేలో స్వీట్సూ, హాట్సూ పట్టుకొచ్చింది. చాలా అందంగా వుంటుంది పిల్ల.

'తెలుసుగా, నంబర్ టూ,' అన్నాడు ప్రకాశరావుగారు.

'తెలియకపోవటమేమిటి' అని ఆ అమ్మాయివంక చూసి, చిరునవ్వుతో పలకరించాను.

'ఇది మాత్రం ఇది ఇయ్యేడు ఇరవై వేలు మింగింది ... ఆ డాక్టర్ సీటు కాదు కాని ఆ సుబ్బారెడ్డిగారు నన్నార్పేసాడు... తీరా సున్నం ఒడిలాక ఆ కాకినాడలో అఘోరించింది...'

'నేనేం చదువుతానన్నా...మీరు నమ్మకండి అంకుల్...నేను బి యస్సీనే చదువుతానన్నాను. మీరూ అమ్మానే పోరిపోరి కాకినాడ పంపించారు...' అంది బుంగమూతి పెట్టా పిల్ల.

'ఐసీ' అన్నాన్నేను. ప్రకాశరావుగారు ఇరకాటం ముహం పెట్టారు.

'ఆ వెధవ బియస్సీలు...చదివేం చేస్తారోయ్... ప్రొఫెషనల్ టచ్‌లేని కోర్సులు అడుక్కుతిన్నా...చెప్పు భాస్కరం.'

ఆయన పని చేస్తోంది 'అడుక్కుతినే' కోర్సుల కాలేజీలోనే! టిఫిన్ పెట్టి ఆ అమ్మాయి లోని కెళ్ళింది.

వాళ్ళ మూడో అబ్బాయి, కురచ లాగూ, బనియన్ వేసుకుని టెన్నిస్ బేట్ పట్టుకుని, టెన్నిస్ బంతిలా ఇంట్లోంచి దూసుకు పోయాడు...చాకులా ఉన్నాడు కుర్రాడు.

ప్రకాశరావుగారు అతనివంక విసుగ్గా చూసి

'వెధవ ఇంటర్ జూనియర్ ఏడుస్తున్నాడో లేదో అప్పుడే ప్రియా స్కూటర్ కావాల్ట. రేప్పొద్దున వెనక్కూచోటానికి ఓ ప్రియురాలు కావలంటాడు...అడుక్కుతిన్నా వీడికి చెప్పవోయ్ ... కాలేజీ, ఫర్లాంగు దూరం లేదు... అడ్డగాడిదలా గుంటూరు సర్వే చెయ్యటానిక్కాక వీడికెందుకోయ్ వెహికిలూ.'

'పోన్లెండి...ఒక్క కొడుకు గదా కొనండీ' అన్నాను, నేను అనకపోతే ఆగుతుందా అనుకుంటూ.

'ఆఁ ... కొనాల్సిందే ... నా ప్రాణం తోడేసి నిన్ననే 500 రూపాయలు ఆ విశాఖపట్నం కంపెనీవాడికి కట్టించాడు...'

హఠాత్తుగా నాకో సంశయం కలిగింది ... ప్రకాశరావుగారు జీతంమీదే ఇవన్నీ చేస్తున్నారా...వెనకేమైనా ఆస్తివుంటే కరిగించి తింటున్నారా... తెలుసుకోవాలనిపించింది.

'అన్నట్లు గురూగారూ, ఇల్లు ఎంతయింది' అన్నాను, సత్యం దానంతటదే వస్తుందని.

'ఎంత కాకేమిటి భాస్కరం ... నా ప్రాణాలు తోడేసింది ... సీలింగ్ అయ్యేసరికి నలభై అయిదు వేలు...ప్లాస్టరింగ్ పదివేలు... మొజాయిక్ అయిదూ...ఫ్లెష్‌డోర్స్ రెండూ...పెయింట్స్ నాలుగూ ...కాంపౌండ్‌వాల్ ఆరూ నన్ను తినేసిందోయ్. అబ్బ యిల్లు మాత్రం కట్టకూడదోయ్. Only fools build houses అన్నాళ్ళే వాడెవడో ... వెధవదీ లక్ష ఎఫ్. డి. లో పడేస్తే టెన్ పర్సెంట్ యిస్తున్నాడు కదోయ్...'

ఏమో—యిస్తున్నాడేమో...ఇంకా నాకు తెలియలేదు.

'అడక్కూడదనుకోండి ... ఇదంతా సేవింగేనా గురూగారూ...' అన్నాను.

'సేవింగే' అనేసి, ఉలిక్కిపడి కుర్చీలో సరిగ్గా కూచుని

'సేవింగంటే జీతంరాళ్ళ సేవింగనుకునేవ్...ఇంట్లో కాలేజీ తోనే...' తేల్చి చెప్పారాయన.

ఒక క్షణం ఎగాదిగాచూసి 'ప్రయివేట్సా' అన్నాను.

'ఆ—మరి...నిజంగా భాస్కరం! ఆ పదేళ్ళూ ... రోజుకు ఆరు గంటలు...ఉదయం మూడు బేచ్‌లూ... సాయంత్రం మూడు బేచ్‌లూ...చెప్పి చెప్పి కాలేజీలో నోరు పెగలక కూర్చుండి పోయే వాణ్ణి. చివరికి నోటి నుండి బ్లడ్‌పడితే ఏ టి. బీ. నో పట్టుకుం దని చచ్చే భయపడ్డాను ... మా ఆవిడ ప్రయివేట్స్ మానేస్తే గాని వీల్లేదంది ... లక్కీగా రక్తం నేసల్ రప్చర్ అన్నాడన కో డాక్టరు. ఆ పదేళ్ళ రక్త మాంసాల పెట్టుబడి కదూ యిది ' అని చిలిపిగా నవ్వి ...

'పెట్టుబడి' అనే మాటను మళ్ళీ అని 'ఇలా సోషలైజ్ చేయబడుతూంది' అని పెద్దగా నవ్వారు. నాకు నవ్వు రాలేదు. ఏడుపొచ్చింది.

అన్నీ తెలిసిన ప్రకాశరావుగార్కి తన రక్తమాంసాల 'పెట్టుబడి' ఎవరికోసమో తెలియలేదంటే ... ఎందుకోసమో అర్థం కాలేదంటే...నిజంగా బాధ వేసింది.

నిద్రాహారాలు మాని పిల్లలకు ప్రయివేట్లు చెప్పి, కాలేజీలో గొంతులేక కూర్చుండిపోవటం ...

ఎమ్మే చదివిన పిల్లకు ఎవడ్నో కొనుక్కోవటానికా ... మెడికల్ సీటుకు బేరం పెట్టటానికా...

డబ్బుపెట్టి చదువుకుని, చదువుతో డబ్బుగడించి, డబ్బుతో చదువులు కొనుక్కుని, కొనుక్కున్న చదువు అమ్ముకుని, అమ్ముకున్న డబ్బుతో కొనుక్కుని...ఇదేనా జీవితం!

'నువ్వెన్నన్నా చెప్పోయ్, భాస్కరం...బెర్నార్డ్ షా చెప్పాడుగా ప్రైవేట్ ప్రాపర్టీ ఉన్నంతకాలం నథింగ్ హేపెన్స్ అని . ఈ స్వంత ఆస్తి పోవాలోయ్' అన్నాడు

ప్రకాశరావుగారు ప్రకాశరావుగారితోనే మాట్లాడుకుంటున్నారు. నేను వినటంలేదు... నాకు బోర్ కొట్టిందనుకుని, ఆయన నన్ను లేపి పెరట్లో మొక్కలు చూపించటానికి తీసుకువెళ్ళాడు. మధ్యలో ...

'లెఫ్ట్ ఆల్టర్‌నేటివ్ ఈ దేశంలో ఎప్పటికైనా ఏర్పడుతుం దంటావా' అన్నారు.

'డాక్టరు మొగుళ్ళుగాక ఆడపిల్లలు మామూలు మొగుళ్ళతో కాపురంచేసే ఆల్టర్‌నేటివ్ ఏర్పడితే' అందామనుకొన్నాను. ఆయన 'హర్ట్' అవుతాడేమోనని ఆపుకున్నాను.

పెరట్లో ఓ రోజామొక్క ఎక్కణ్ణించి తెప్పించారో చెబుతూ, మధ్యలో 'ప్రపంచ సామ్రాజ్యవాద కేంద్రం ఎక్కడికి మారుతుందో' చెప్పారు. ఇంతలో ...

'కుయ్—కుయ్' మంది వాళ్ళ కుక్కపిల్ల నన్నుచూసి.

'ఛా—పో అవతలికి' అని గెంటేసాడు.

'స్టుపిడ్ మేటింగ్ సీజన్ వచ్చింది కావును ... ఒహటే అరుపు...మేల్ దొరికి చావటం లేదు...' అన్నాడాయన కుక్కపిల్ల బాధ నర్థం చేసుకుంటూ.

'ఈ విప్లవరచయితల్లో మళ్ళీ డివిజన్స్ వచ్చాయట' అన్నారు హఠాత్తుగా ఏదో గుర్తొచ్చినట్లు.

'ఆ — వచ్చాయి రెండు గ్రూపులుగా విడిపోయారు ..' అన్నాను, కుక్కపిల్లా, అగ్గిపుల్లా . కాదేదీ సంభాషణ కనర్హం అని సరిపుచ్చుకుంటూ.

'భాస్కరం, ఆ పూలు చూసావా. జూలై ఫ్లవర్స్ అని చాలా డెలైట్‌ఫుల్‌గా ఉంటాయి. వర్షాకాలం తర్వాత పూయటం ప్రారంభిస్తుంది ...'

ఈసారి నేను జోక్ వేద్దామనుకుని ...

'ఇరాన్‌లో ఖొమేనీ లెఫ్టిస్ట్ అంటారా' అన్నాను.

'వెధవ లెఫ్టిస్ట్. వాడేం లెఫ్టిస్టోయ్...రెలిజియస్ క్రూక్... కన్సర్వేటివ్... పాప్యులిస్ట్ అంతే. వాళ్ళ దేశం పెనంమీది నుంచి పొయ్యిలో పడింది. అన్నట్టు, ఆ ఉగాండాలో బఫెలోగాణ్ణి దించేసారు చూశావా...'

నవ్వుకున్నాం. పూలు చూసి నవ్వుకున్నాం. పక్షుల్ని చూసి నవ్వుకున్నాం. ప్రజల్నీ, దేశాల్నీ చూసి నవ్వుకున్నాం. చక్కని సాయంత్రం చల్లనిగాల్లో హాయిగా ఇద్దరం ప్రపంచాన్ని సమీక్షించుకున్నాం. గాలీ,పిట్టా,వెల్తురూ మమ్మల్నెలా సమీక్షించుకున్నాయో తెలీదు.

* * *

సాయంత్రం ఏడు దాటింతర్వాత 'శిఖరాగ్ర' సమావేశానికి ఇద్దరం. ఆయన గదిలో కూర్చున్నాం .. ఎదురుగా టీపాయ్ మీద గ్లాసులూ, పదార్థాలూ .

మామూలుగా మొదటి గ్లాసు కిరసనాయిల్లా వుంది. రెండోది మంచినీళ్ళలాదిగిపోయింది. మూడోది అమృతంలా గోచరించింది. శరీరానికి అమరత్వం మెల్లమెల్లగా సిద్ధిస్తూంది.

ఇంతల్లో ఏదో చిన్న అలికిడి...

ఇద్దరం సాహిత్యం చర్చించుకుంటున్నాం ... ఇలియట్, శ్రీశ్రీ, దోస్తా విస్కీ, కృష్ణశాస్త్రి...వచ్చిపోతున్నారు...గుడిపాటి వెంకటచలం గుర్తొస్తున్నాడు... ఏది ఏమైనా కవిత్వానికి ప్రేరణ పెద్దన్నగారి పద్యమేనని ఓ తీర్మానం ... మార్క్సు కీ ఫ్రాయిడ్ కీ నివాళు లర్పిస్తూ మరో తీర్మానం ... తిలక్ చెప్పిన "భూమధ్య రేఖ" మీద నిలబడి ఇలా తీర్మానాలు చేసుకుంటుండగా ...

ఇంతల్లో అలజడి పెద్దదైంది. వాళ్ళావిడ గొంతు పెంచి కేకలేస్తోంది ఎవరిమీదనో...!

ఇక్కడ రసాయనం నరాల్లోకి ప్రవేశిస్తూంది...కళాభిరుచిని కొరడాల్తో కొట్టి నిప్పులాంటి నిజాల్ని కక్కిస్తోంది. చుట్టూ ఉన్న ఉపాహారాలు తింటున్నాం.

ఇంతల్లో తగాదా పెరిగిపోతోంది ... వాళ్ళావిడా, మరో ఆడ గొంతూ ...

గ్లాసు క్రిందపెట్టి చిరాగ్గా లోనికెళ్ళారు ప్రకాశరావుగారు. మూడ్ సరిగా లేదు. వాళ్ళావిడనేమైనా అంటాడేమో నని భయ పడ్డాను.

తగాదా సాగుతూ, రేగుతూనే వుంది ... పదిహేను నిమిషాల తర్వాత కళ్ళు మరి కాస్త ఎర్ర చేసుకుని తిరిగొచ్చారు. వస్తూనే 'టేకిట్ భాస్కరం ... ఇంకోటి తీసుకో ప్లీజ్' అంటూనే 'వెధవ న్యూసెన్సు' అన్నారు. ఆ రెండో విశేషణం గొడవ గురించి !

'ఒద్దు గానండి...గొడవేమిటి ?' అన్నాను.

'తగాదా ఏముంది .. సిల్లీ థింగ్ ... సర్వెంట్ మెయిడ్ ... జీతం పెంచమంటుంది.'

**'ఎంతటా ?'**

'మళ్ళీ రూపాయి పెంచాలట...మూణ్నెల్లక్రితమే పదికాదని పదకొండుచేసాం.. ఇప్పుడు పన్నెండంటుంది' సీరియస్సయిపోయారు ప్రకాశరావుగారు.

'దట్సాల్ రైట్...నీ మూడ్ పాడుచేసానో ఏమిటో .. వన్ మోర్ ... ఇంకోటి తీసుకో...డియర్.. ప్లీజ్...వన్ మోర్...' బల వంత పెడుతున్నాడు...తను ...

ప్రతిదానికీ విలువుంటుంది. 'వన్ మోర్' పెగ్ విలువ నాలుగు రూపాయిల్దాకా వుంటుంది.

పదకొండుకూ ... పన్నెండుకూ మధ్య వన్ మోర్ రూపీ ఉంటుంది !

చుట్టం చూపుగా వచ్చిన భాస్కరానికీ...గొంతులో కుక్కు తున్న వన్ మోర్ కీ...వన్ మోర్ రూపీకీ తేడా వుంటుంది.

'అఫ్ హ్యూమన్ బాండేజ్'లో మనిషికీ మనిషికీ ఏదో తేడా వుంటుంది...ఒక్క మనిషిలోనే రెండు బాండేజ్‌స్ చూడలేనంతగా మత్తు ఎన్ని పెగ్గులు తీసుకున్నా రాదు.

అసలు మేధావులకు మత్తు అంత తొందరగారాదు...వచ్చిం దనుకోవటం తప్పు ! !

# అనుభూతికి యేతం

## శ్రీ కె. అంజయ్య

రాత్రిని చప్పరిస్తూనే
  రెండు గంటల్ని ఖూనీ చేశాం.
జ్ఞానాన్ని దేవుకోవాలని
దాని "దరి" అందుకోవాలని
తపనలో తాపంలో
శబ్దాల్ని మెదడ్లో రుబ్బుతూ
పీల్పు విడుపు ప్రక్రియలో
చీకటిని చప్పరించేసి బాగాలేదని తేల్చి
దీపంలో నింపుకున్న కిరణాల్ని ఒంపుకుంటూ
అనుభూతుల్ని నెమరేయడం.
ఆలోచనల్ని సాకి పదునుపెట్టడం.
ఆవేశాన్ని కాంతివేగంలో పాదివి
అక్షరాల్ని కాగితంపై అద్దడం.
తదుపరి మామూలుగా విశ్రాంతి.
మామూలుగానే తెల్లవారడము.

డా. లింగంనేని బసవశంకరరావు

# ధ్వని మార్పులు

జీవద్భాషకు పరిణామం అత్యంత సహజం. భాషాచరిత్రను పరిశీలిస్తే ఒక కాలపు భాషాస్వరూపానికి మరొక కాలపు భాషా స్వరూపానికి గమనించ గల్గినంత భేదం కనబడుతుంది. శాసనస్థాధారములను బట్టి, గ్రంథస్థాధారములనుబట్టి చూస్తే నన్నయ కాలంనాటి భాషకు, నేటి భాషకు ఎంతో వ్యత్యాసమున్నట్లు మనకు బాగా తెలుస్తుంది. భాషా చరిత్రను గమనిస్తే పరిణామమనేది భాషా సజీవత్వానికి లక్షణమని, భాష పరిణామశీలి అని విశదమవుతుంది. తరతరాలనుండి పరిణామం చెందుతు మనకు సంక్రమించిన భాష మన జీవిత కాలంలో కూడ మార్పు పొందుతు మన తర్వాత రాబోయే తరాల వారికి సంక్రమిస్తుంది. భాష మార్పుచెందుతున్నా ఆ భాషను వ్యవహరించేవారు ఆ మార్పును గమనించలేరు. భాషలో కల్గే మార్పు దాన్ని వ్యవహరించేవారు గమనించగల్గినంత వేగంగా జరగదు. సాహిత్యం, ప్రామాణికత ఉన్న భాషల్లో మార్పు కొంత మందంగా ఉంటుంది. ప్రామాణికత కొంత తక్కువగ ఉన్న అనాగరక భాషల్లో మార్పు కొంత వేగంగా ఉండవచ్చు.

ఒక ప్రాంతంవారు సంభాషించే విధానానికి మరొక ప్రాంతం వారు భాషించే విధానానికి, అలాగే ఒక వర్గంవారు మాటాడే పద్ధతికి మరొక వర్గంవారు మాటాడే పద్ధతికి కూడ భేదముంటుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే ప్రతి జిల్లాకు, తాలూకాకు, గ్రామానికి, కుటుంబానికి ఇంకా చెప్పాలంటే మనిషి మనిషికి భాషలో భేదముంటుంది. ఇలాంటి వైవిధ్యం భాషా వ్యవహారంలో ఉన్నా ఆ భాషలో సామాన్య ప్రమాణం బాగా ఉండబట్టే పరస్పరావగాహన సాధ్యమవుతోంది. తాను చెప్పే విషయం శ్రోతలకు అర్థం కావాలనే కుతూహలం వక్తకు ఎప్పుడూ ఉంటుంది. ఆ కుతూహలమే వక్తను సామాన్యప్రమాణానికి సన్నిహితంగా మాటాడేటట్లు చేస్తుంది. భాషలో ప్రధాన భేదాలు మాత్రమే పరిగణింపబడతాయి. అప్రధాన భేదాలు పరిగణింపబడవు. వైయక్తిక భేదంలోని వైవిధ్యం, మాండలిక భేదాల్లోని వైవిధ్యాలు సామాన్యంగా ఎప్పుడూ అప్రధానంగానే వుంటాయి.

భాషలో కల్గే మార్పు ముఖ్యంగా రెండురకాలు — ఒకటి శాబ్దికమైన మార్పు అనగా ధ్వనిమార్పు (Phonetic change). రెండవది—ఆర్థికమైన మార్పు (Semantic change). ఉచ్చారణాశ్రితమైన ధ్వని సముదాయంతో ఏర్పడ్డ పదజాలం ఉచ్చారణ భేదానికి లోనయినప్పుడు ధ్వనిమార్పులు ఏర్పడతాయి. ఈ ధ్వని మార్పులు కొంతకాలానికి స్థిరపడి సర్వదా ప్రయోగింపబడతాయి. ప్రాఙ్నన్నయ కాలంనాటి కొణిరి, పణి అనే పదాలలోని ణకారం నకారంగా నన్నయ కాలంనాటికి మార్పునొంది, స్థిరత్వం పొంది కొనిరి, పనిగా నిలిచిపోయాయిగదా!

భాషలో కనబడే విభిన్నధ్వని మార్పులకు హేతువులు ఇదమిత్థమని నిర్ణయించి చెప్పటానికి సాధ్యపడదు. అందుకే ఎఫ్. ఎమ్. బెరెజిన్ 'The reasons for these Phonetic changes are still obscure' (P. 98 Lectures on Linguistics) అన్నాడు. కాని కొందరు భాషా శాస్త్రజ్ఞులు కొన్ని ధ్వని మార్పులకు గల కారణాలను సందర్భాన్ని అనుసరించి ఇలా ఊహిస్తున్నారు—(ఎ) ఊనిక వలనమార్పు:—ఊనికలేని ధ్వనులు జారవిడువబడటమో లేక అస్పష్టంగా ఉచ్చరింపబడటమో జరిగి పదంలో ధ్వని భేదం తీసికొని రావచ్చు. తెలుగులో పూర్వాంధ్రయుగంలో ఊనిక పదాదిని ఉండేదని తరువాతి కాలంలో పదాంతంవైపు జరిగిందని తత్ఫలితంగానే తెలుగు భాషలో వర్ణవ్యత్య రూపాలు ఏర్పడ్డాయని మన భాషా శాస్త్రజ్ఞుల తలంపు. ఊనిక వలన ధ్వనిమార్పు—చేయవలయును > చేయవలెను > చేయవలె > చేయాలి > చెయ్యాలి. (బి) ఉచ్చారణ లాఘవము :— వక్త వీలయినంత వరకు ఉచ్చారణ సౌలభ్యానికి ప్రయత్నిస్తుంటాడు. వర్ణ సమీకరణం, వర్ణలోపం, అగ్రాగమం మున్నగు ధ్వనిమార్పులు ఉచ్చారణ సౌలభ్యా పాదకములని చెప్పవచ్చు. (సి) ఉచ్చారణ దోషం—శ్రవణదోషం :— ఒక తరంనుండి మరియొక తరంవారికి భాష అనుకరణ మూలంగ సంక్రమిస్తుందిగదా! ఉచ్చారణలో గాని, శ్రవణంలో గాని దోషముంటే ధ్వనిమార్పులు కల్గవచ్చు. (డి) ఉచ్చారణవేగం:—ఉచ్చారణ వేగంవల్లకూడ భాషకొంత వరకు మార్పు పొందవచ్చునంటున్నారు (ఇ) భౌగోళిక—శీతోష్ణ పరిస్థితులు ఉచ్చారణ భేదాన్ని కల్గిస్తాయని కొందరు భాషా శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. మరికొందరు ఈ అభిప్రాయాన్ని ఆదరించటంలేదు. (ఎఫ్) సాంఘిక రాజకీయ పరిస్థితులు ఒకప్పుడు భాషలో విశేషంగా మార్పు తీసికొని రావచ్చు. 14, 15 శతాబ్దాల్లో ఇంగ్లీషు భాష విశేషంగా [illegible]టానికి గల కారణాన్ని జెస్పర్సన్ పండితుడు ఆ శతాబ్ద[illegible] యుద్ధాలు, క్షామం, అస్థిర పరిస్థితులని భావించాడట. [illegible] శతాబ్దంలో [illegible]ండులోని శ్రామికవర్గం వారి భాష విద్యార్థుల భాషతో పోల్చిచూ[illegible] ఎంతో మారినట్లు తెలుస్తున్నదట. దీనికి కారణాన్ని ఆయన శ్రా[illegible]లు తమ పిల్లలకు భాషా శిక్షణాన్ని గూర్చి శ్రద్ధ వహింపక[illegible] అని చెప్పాడు. (జి) స్త్రీ శిశువుల ప్రభావంచే భాష మారుతు[illegible]ని కొందరంటారు. నిరక్షరాస్యులయిన స్త్రీలు, శిశువులు సామ్యాన్ని, అనుచిత విభాగాన్ని, లోకనిరుక్తిని బాగా అనుసరిస్తారు. అందువల్ల కూడ భాషలో మార్పు రావచ్చు. (హెచ్) జాతీయతాభావం,

మాతృభాషాభిమానం కూడ భాషలో మార్పు తీసికొని రావచ్చు నంటారు. (ఐ) భాషా వ్యవహారంలో ఫాషన్ చూపించటంవల్ల కూడ కొద్దిగా మార్పు రావచ్చు. (జె) అన్య భాషా సంపర్క కారణంగా ఉచ్చారణలో భేదం రావచ్చు. హిందీ, ఆంగ్లభాషా ప్రభావాలచే తెలుగు భాషలోని ఫకారయుక్త రూపాలు కొన్ని ఫ ( )కారయుక్త పదాలుగా ఉచ్చరింపబడుతున్నాయి ఈ విధంగా కారణాలను కొన్నిటిని పేర్కొనటమేగాని అందలి యాధార్థ్యం సందేహాస్పదమే నని భాషా శాస్త్రజ్ఞుల భావన.

ఇక ధ్వని మార్పులను పరిశీలిద్దాం. ధ్వనిమార్పుల్లో ప్రధానంగా మూడురకాలు కనబడ్తాయి. (అ) వర్ణలోపం, (ఆ) వర్ణాగమం, (ఇ) ఒకవర్ణం మరొక వర్ణంగా మారటం.

1. <u>పదమధ్యాజ్లోపం:</u>— దీనినే పదమధ్యాజ్నాశం అని అంటారు ఈ ధ్వనిమార్పు ఉచ్చారణ వేగ కారణంగా వచ్చి ఉండవచ్చు. పద మధ్యమందలి అచ్చు లోపించటమే దీని లక్షణం. కలదు▷ కల్దు, పొలతి▷ పొల్తి, వలదు ▷ వల్దు; కలికి ▷ కల్కి, పూనికి▷ పూన్కి, ములికి▷ ముల్కి; అడుగు▷ అడ్గు, కడుగు▷ కడ్గు, విడుచు▷ విడ్చు; కానక▷ కాన్క, కినుక▷ కిన్క, చినుకు▷ చిన్కు; అలుక▷ అల్క, కాలువ▷ కాల్వ, చిలుక▷ చిల్క.

2. <u>పదాంతాజ్లోపం</u> :—దీనినే బ్లూమ్ ఫీల్డు, ఎపోకోప్ అని పేర్కొన్నాడు. తెలుగు కావ్య భాషలో కూడ గణాలకోసం ప ్యలలో పదాంతాజ్లోపం కనబడుతుంది—తత్పొలుర్, బాలుర్, కోమలల్, పుష్పముల్, కాంచెన్, వచ్చెన్ ఇత్యాదులున్నాయి. ఆధునికాంధ్ర భాషలో కూడ ఈ ధ్వనిమార్పు కనబడుతుంది — ఎప్పుడొచ్చావ్? ఏం జేశావ్?

3 <u>పదాది హల్లోపం</u> :- దీనిని ఉచ్చారణ చలన సిద్ధాంతమని అంటారు. ఎఫారెసిస్ అనగా మొదటిహల్లు లోపం. చిగురు▷ ఇగురు, పూను▷ ఊను, వాడు▷ ఆడు, వీడు▷ ఈడు, హడపము▷ అడపము, హరిదళము▷ అరిదళము.

పదాది సంయుక్తాక్షరాలలో రెండవ హల్లు లోపించటం కూడా కనబడుతుంది. క్రమ్ముకొను▷ కమ్ముకొను, క్రొత్త▷ కొత్త, గ్రద్ద▷ గద్ద, ప్రాత▷ పాత, ప్రొద్దు▷ పొద్దు, మ్రింగు▷ మింగు, క్షారము▷ కారము.

పదాది సంయుక్తాక్షరాలలో **మొదటి** హల్లు లోపించటం కూడా ఉంది. స్థానము▷ తానము, స్నానము▷ స్తానము▷ స్తానము ▷ తానము, వ్రాయు▷ రాయు.

4. <u>లోపదీర్ఘత</u>:—తెలుగులోపదమధ్యాక్షర (సిలబ్ల్ హల్లుతో అచ్చుకూడా) లోప తత్పూర్వ స్వర దీర్ఘ రూపాలెక్కువ. చివుకు▷ చీకు, చేసెడివాడు▷ చేసేవాడు, దనుక▷ దాక, దుముకు▷ దూకు, నివులు▷ నీలు, పగడములు▷ పగడాలు, పొగవు▷ పోవు, ముత్యములు▷ ముత్యాలు, మీసములు▷ మీసాలు (మీసలు), మొగము▷ మోము, వజ్రములు▷ వజ్రాలు, సగము▷ సాము, ఈ ధ్వని మార్పు ఉచ్చారణ వేగకారణంగా వచ్చియుండునా?

5. <u>వర్ణనాశం</u> :— దీనినే (హాప్లాలజీ) వర్ణలోపం, హల్లోపం, అక్షరలోపమని అంటున్నారు ఈ మార్పు తెలుగులో : అంత + దాక▷ అందాక, ఇంత + దాక▷ ఇందాక, ఎంత + దాక▷ ఎందాక, ఎనుప + పసరం▷ ఎనుపసరం, ఎనుప + పెంటి ▷ ఎనుపెంటి, తాకు + కట్టు▷ తాకట్టు, పెద్ద + తనం▷ పెత్తనం, ప్రాత + తుట్టు▷ ప్రాదుట్టు, బొంత + దళం▷ బొందళం, వంగ + కాయ▷ వంకాయ. సంస్కృతంలో : మధు + ధుక్▷ మధుక్, శష్ప + పింజరః▷ శష్పింజరః.

6. <u>అగ్రాగమం</u> :— ఉచ్చరించటానికి కష్టమైనవి గాని, అలవాటులేని వర్ణాలుగాని పదాదిని ఉన్నపుడు దానిముందు ఒక అచ్చు చేర్చి ఉచ్చరించటాన్నే ప్రాతెసిస్ అగ్రాగమమంటారు. ద్రావిడ భాషలో పదాదిని సంయుక్తాక్షరాలు సాధారణంగా ఉండవు. పదాది సంయుక్తాక్షరాలుగల ఆంగ్లపదాలను ఎరవు తీసికొన్నపుడు ఉచ్చరించటం కష్టం కాబట్టి ముందొక అచ్చుచేర్చి ఉచ్చరించే సంప్రదాయం తెలుగులోకి వచ్చింది. స్కూలు-ఇస్కూలు, స్టేషను—ఇస్టేషను.

ద్రావిడ భాషల్లో పదాదిని దంత మూర్ధన్యాలైన ర, ల వర్ణాలుండవు. కాబట్టి సంస్కృతం నుండి ర, ల ఆదిగాగల పదాలను ఎరవు తెచ్చుకొన్నపుడు తమిళంలో పదానికి ముందు ఒక అచ్చు చేర్చుట కనబడుతుంది. లక్ష్మణ▷ ఇలక్కువన్, లంకేశ్వర▷ ఇలంకేశ్వరన్, లక్షణమ్▷ ఇలక్కియమ్, లోకమ్▷ ఉలగమ్, రామన్▷ ఇరామన్, రక్తమ్▷ ఇరకతమ్, రాజన్ ▷ అరసన్. తెలుగులో రథం▷ అరదం.

7. <u>వర్ణాగమం</u> :—ఒక పదంలో ఒక అక్షరం గాని, వర్ణం గాని అధికంగా వచ్చి చేరటమే వర్ణాగమం· కోలాటం▷ కోలాటకం, చింపిజుట్టు ◁చింపిరిజుట్టు, చిచ్చు కన్ను▷ చిచ్చుఱకన్ను, చిచ్చు పిడుగు▷ చిచ్చుఱపిడుగు, దొంగాటం▷ దొంగాటకం, నడిరేయి▷ నడికిరేయి, నడవడి▷ నడవడిక, పితలాటం▷ పితలాటకం, బొటవ్రేలు▷ బొటనవ్రేలు, విటతాటం▷ విటతాటనం, వేగుజుక్క▷ వేగురు జుక్క.

8. <u>ద్విరుక్తాద్విరుక్తత</u> :— ఒక పదంలో ద్విత్వాద్విత్వము లుండుట గెమినేషన్, నాన్ గెమినేషన్. తెలుగులో ఈ సంప్రదాయం ఎక్కువ. అక్కట—అకట, అచ్చట—అచట, ఉయ్యాల — ఉయాల, ఎఱ్ఱయ్య—ఎఱ్ఱయ, చిట్టి—చిటి, చిన్న—చిన, తల్లి—తలి, తిక్కన్న—తిక్కన, నన్నయ్య—నన్నయ, పిన్న—పిన, ప్రెగ్గడ—ప్రెగడ.

9. <u>విప్రకర్షం</u> : దీనిని వికర్షం, స్వరభక్తి, స్వరవిశ్లేషం అని కూడ అంటారు. ఆంగ్లంలో ఎపెంతెసిస్, అనాటిక్సిస్ అని

పేర్కొంటారు. ఒక పదంలోని సంయుక్తాక్షరాన్ని ఉచ్చరించటం కష్టం కాబట్టి దాన్ని విడగొట్టుచు మధ్య ఒక అచ్చు వచ్చి చేరటమే విప్రకర్షం. ఈ మార్పు వేదకాలంలోనే కలదట — ఇంద్ర> ఇందర. తెలుగులో ఇది అర్ధతత్సమ, తద్భవ రూపాల్లో కనబడుతుంది. అల్పుడు> అలుపుడు, చంద్రుడు> చందురుడు, కీర్తి> కీరితి, దర్శనం> దరిసెనం, ద్వారం > దువారం, మంత్రం> మంతరం, మర్యాద> మరియాద, యత్నం> యతనం, రాత్రి> రాతిరి, లగ్నం> లగనం, శ్రీ> సిరి, శబ్దం> సబుదం, హర్షం> హరుషం.

10. <u>అచ్చుల పరస్పరాకర్షణ</u> : దీన్నే సమస్వరత, స్వరాకర్షణ, వర్ణ వికారమనీ అంటారు. ఆంగ్లంలో "ఒవెల్ ఎట్రాక్షన్." ఒక పదంలోని విభిన్నాచ్చులు ఒక దాని కారణంగా మరొకటి మారిపోవటం. హరి + లు=హరులు, హరి + కున్=హరికిన్, లక్ష్మి + లు=లక్ష్ములు, టర్కిష్ భాషలో సమస్వరత కనబడుతుంది. కొన్ని తెలుగు పదాల్లో ఒక అచ్చు కారణంగా రెండు అచ్చులు మారిపోవటం కూడా ఉంది. కలికి + లు=కలుకుల , ములికి + లు=ములుకులు.

11. <u>శ్వాసత — నాదత</u> : శ్వాసాక్షరాలు నాదాక్షరాలుగా, నాదాక్షరాలు శ్వాసాక్షరాలుగా మారిపోవటమే. శ్వాసత (అన్‌వాయిసింగ్) : అదుకు > అతుకు, ఉదుకు> ఉతుకు, చిదుకు> చితుకు, బ్రదుకు > బ్రతుకు, మెదుకు > మెతుకు, వెదకు > వెతకు. నాదత (వాయిసింగ్): ఉటల్ > ఒడలు, కడచు> గడచు; కడప> గడప, కనుక> గనుక, కానుగ> గానుగ, చీరాడు > జీరాడు, చెముడు> జెముడు, తూలు> దూలు, త్రోవ> ద్రోవ, సెక> సెగ. తెలుగులో నాదమైన ద్రుతప్రకృతికం మీది పరుషాలు సరళాలుగా మారటం కనబడుతుంది—పూచెను + కలువలు=పూచెను గలువలు, తోచెను + చుక్కలు=తోచెను జుక్కలు. పరుషాలైన క, ట, త లు గ, డ,ద లుగా మారటం కూడా వుంది. వాడు + కొట్టె=వాడు గొట్టె, నీవు + టక్కరివి=నీవు డక్కరివి, తల్లి + తండ్రులు=తల్లిదండ్రులు, కూర + కాయలు=కూరగాయలు.

12. <u>స్పర్శం> స్పర్శేతరం</u> (ఊష్మం) : గ్రిమ్సు సూత్రం ప్రకారం ఇండోయూరోపియను భాషల్లోని ప, త, కలు జర్మానికు భాషలలో ఫ, థ, హ లుగా మారతాయి—పితా> ఫాదర్, భ్రాతా> బ్రోథేర్, కెంటుమ్> హండ్రడ్.

ప్రాచీన కన్నడంలోని పదాది 'ప'కారం ఆధునిక కన్నడంలో 'హ'గా మారుతుంది. పత్తు> హత్తు, పంది> హంది, పాలు> హాలు, పెణ్ణు> హెణ్ణు.

మూల ఇండోయూరోపియనులోని పదాది 'చ'కారం శతమ్ భాషల్లో శ, సలుగా మారింది. చంతోమ్ అనే పదం సంస్కృతంలో శతమ్, ఇరానియన్‌లో సతమ్‌గా మారింది.

13. <u>అనునాసిక్యం</u> : స్పర్శవర్ణాలు ఆయా వర్గానునాసికాలుగా మారటం. అడగు> అణగు, కడగు> కణగు, కడుదురు> కణుదురు, పోడి> పోణి, బెడకు> బెణకు, ముడుగ > ముణుగు, వడకు> వణకు, తిరుగపోత> తిరుగమోత, పొగరుపోతు> పొగరుమోతు, బుర్రటకొమ్ము> ముర్రట కొమ్ము, బుస్సు> ముస్సు, తోడుబాలు> తోడుమాలు.

అనునాసిక్య లోపం కొన్నిచోట్ల కనబడుతుంది. కోంత> కోత, కోంతి> కోతి, పాంత> పాత, పేండ> పేడ, మీంద> మీద, వాండు > వాడు, వీండు > వీడు. ఇలాగే అంట > అఁట> అట, ఇంక> ఇఁక> ఇక.

14. <u>వర్ణవ్యత్యయం</u> : ఉచ్చారణలోని తత్తరపాటు వలన గాని మరే కారణంచేతగాని ఒక పదంలోని వర్ణాలు ముందు వెనుకలుగా తారుమారవటాన్ని మెటాథెసిస్ వర్ణవ్యత్యయ మంటారు. అనగ> నాగ, అనన్> నాన్, అనవుడు> నావుడు, అవ్వు > వాష్టు, ఆవర్> వారు, అలవు> లావు, ఊర్లో> ఊళ్లో, ఎలదీగ> లేదీగ, ఎలదూడలు> లేదూడలు, ఉగుర్> గోరు, జగదొంగ> గజదొంగ, నవ్వులాట> నవ్వుటాల, తడువుకొను> తవుడుకొను, ఫర్లాంగు> ఫ్రలాంగు, పారువము> పావురము, మరకతము> మరతకము, వారువము> వావురము, రిక్షా> రిష్కా, సరుదుకొను> సదురుకొను.

15. <u>వర్ణసమీకరణం</u> : స్థానకరణ ప్రయత్నాదుల్లో భేదమున్న రెండు వర్ణాలు పక్క పక్కన వచ్చినపుడు అందొకటి వేరొకటిగా మారటమే వర్ణ సమీకరణ (ఎస్సిమిలేషన్) మని చెప్పవచ్చు. నిజానికి అచ్చుల పరస్పరాకర్షణ, శ్వాసత - నాదత, తాలవ్యీకరణం లాంటివి కూడ వర్ణసమీకరణము నందలి భేదాలే. కాని భిన్న హల్లుల సమీకరణాన్నే వర్ణ సమీకరణ మని పిలవటం మనకు అలవాటయిపోయింది. వర్ణ సమీకరణం ముఖ్యంగా సంపూర్ణ వర్ణ సమీకరణ మని, అసంపూర్ణ వర్ణ సమీకరణమని రెండురకాలు. ఒక హల్వర్ణం ఇంకొక హల్వర్ణంగా పూర్తిగా మారిపోవటం సంపూర్ణ వర్ణ సమీకరణం- పెర్ + పులి > పెర్పులి> పెర్బులి > పెబ్బులి> బెబ్బులి, తిరున్తు> తిర్తు> తిర్దు> తిద్దు> దిద్దు. ఒక హల్వర్ణం మరొక హల్వర్ణంగా పూర్తిగా మారక ఏదో ఒక లక్షణాన్ని మాత్రమే గ్రహించటం అసంపూర్ణ వర్ణ సమీకరణమనవచ్చు. అవన్ + కళ్> అవన్‌గళ్, వాక్ + మయ> వాఙ్మయ, షట్ + ముఖ> షణ్ముఖ.

సంపూర్ణ వర్ణ సమీకరణం మరల మూడు విధాలు :

(అ) పురోగామి వర్ణ సమీకరణం, (ఆ) తిరోగామి వర్ణ సమీకరణం, (ఇ) పరస్పర వర్ణ సమీకరణం. వర్ణ సమీకరణం జరగటంలో పూర్వ వర్ణం పురోగమించి తరువాతి వర్ణాన్ని తనవలె మార్చుకొన్న యెడల దాన్ని పురోగామివర్ణ సమీకరణం లేక పరవర్ణ సమీకరణం అని అంటారు — అక్షరం> అక్కరం, అగ్ని> అగ్గి, అన్యం> అన్నెం, ఎడ్డ> ఎడ్డ, కన్య> కన్నె, కొలను> కొల్ను> కొల్లు-(కోరుకొల్లు,పాలకొల్లు) నిత్యం> నిత్తెం, పథ్యం> పత్తెం,

పక్షి> పక్కి, పద్మ> పద్ద, పుణ్యం> పుణ్ణెం, ముత్యం - ముత్తెం, మక్షిక> మక్కి, రిక్షా> రిక్కా, వలన> వల్న> వల్ల, సత్యం - సత్తెం. పరవర్ణం తిరోగమించి ముందున్నవర్ణాన్ని తనలాగమార్చిన యెడల తిరోగామి వర్ణ సమీకరణం లేక పూర్వ వర్ణ సమీకరణం అనీ అంటారు. కల్ప (సూత్ర)> కప్ప(సుత్త), కలదు> కల్దు> కద్దు, తత్ + చరితమ్> తచ్చరితమ్, ధనుస్ + శింజినీ > ధనుశ్శింజినీ, పూర్ణిమ> పున్నమి, భక్తి> బత్తి, మనస్ + శాంతి> మనశ్శాంతి, వలదు> వల్దు> వద్దు. పూర్వవర్ణ లక్షణ మొకటి పరవర్ణానికి, పరవర్ణలక్షణ మొకటి పూర్వ వర్ణానికి వచ్చిన యెడల అవి పరస్పరము ఒకదాని ప్రభావము మరొకటి పొందింది కాబట్టి దానిని పరస్పర వర్ణ సమీకరణ మంటారు—గుడి + లు=గుళ్ళు, గుమ్మడి + లు=గుమ్మళ్ళు త్రాడు + లు=త్రాళ్ళు, మడి + లు = మళ్ళు, నాడు + లు=నాళ్ళు, రెండు + నాళ్ళు=రెణ్ణాళ్ళు, వాడు + ని=వాణ్ణి, వేడి + నీళ్ళు= వేణ్ణీళ్ళు.

16. వర్ణ విభేదనం : దీనికే పృథక్కరణమనీ పేరు. రెండు సమాన వర్ణాలు ఒక పదంలో పక్క పక్కనగాని వ్యవహితంగా గాని వచ్చినపుడు ఉచ్చరించటం కష్టం. అందువల్ల అందులో ఒకవర్ణం వేరొక వర్ణంగా (డిస్సిమిలేషన్) మారిపోతుంది. సంస్కృతంలో రెండు మహా ప్రాణ వర్ణాలు పక్కపక్క న వచ్చినపుడు అందులో మొదటి మహా ప్రాణవర్ణం అల్ప ప్రాణ వర్ణంగా మారుతుందని గ్రాస్‌మన్ ధ్వనిసూత్రం. ఇది వర్ణ విభేదన కారణంగా వచ్చింది. ధా + తి, ధా—ధా + తి=దధాతి, భూ నుండి బభూవ అలాగే బీభత్సుడు. వీటన్నిటిలో ధాతువు అభ్యస్తమై మహాప్రాణం అల్పప్రాణం అయ్యింది. తెలుగులో కొడవలి + లు> కొడవళులు, పిడికిలి + లు= పిడికిళులు, రోకలి + లు=రోకళులు. ఇట్లే చూచు + ఇంచు= చూపించు, పిలుచు + ఇంచు=పిలిపించు, నచించు + ఇంచు=వచింపించు మున్నగునవి.

17. తాలవ్యీకరణం : కంఠ్య వర్ణాలైన క, గ,లకు తాలవ్యాచ్చులు పరమైతే చ, జ లుగా మారిపోవటం తాలవ్యీకరణం. ప్రాచీనాంగ్లంలోని 'కిన్' ఆధునికాంగ్లంలో 'చిన్'గా మారింది. మూలద్రావిడంలోని పదాది కకారం తాలవ్యాచ్చరమైనపుడు తెలుగులో చకారంగా పరిణతి పొందింది కిళి> చిలుక, కివి> చెవి, కెందొవ> చెందొవ, కెడు> చెడు, కెఱ> చెలువు, కెయ్> చేయు,

దంత్య వర్ణాలు కూడ తాలవ్యాలుగా మారటం కనబడుతుంటుంది. కన్నడంలో తేల్> చేళ్, తేనె> జేను.

తాలవ్యాలు కంఠ్యాలుగా మారటం సాధారణంగా కనబడదు. మూల ఇండోయూరోపియనులోని పదాది చకారం కకారంగా కెంటుమ్ భాషల్లో మారింది. ఇది తాలవ్యీకరణానికి విరుద్ధమైన కంఠ్యీకరణం (వెలారైసేషన్) అని చెప్ప వచ్చా?

ఆధునికాంధ్రంలో చకారం తకారంగా మారటం కనబడుతోంది - పాడుచున్నాడు> పాడుతున్నాడు, కొట్టుచున్నాడు> కొట్టున్నాడు. మరి దీన్ని దంత్యీకరణం అనవచ్చా? ప్రాచీన ద్రావిడంలో శత్రర్థక ప్రత్యయం మొదట తకారమేనని అది తర్వాతి కాలంలో 'చ'కారంగా పరిణతి పొందిందని ద్రావిడభాషా శాస్త్రజ్ఞుల తలంపు. మళ్ళీ అది ఆధునిక తెలుగు భాషలో చకారం తకారంగా పరిణతి పొంది కనబడుతోంది.

18. సామ్యం : భాషలోని ధ్వనిమార్పులకు భౌతికకారణాలు లాగానే మానసిక కారణాలు వర్తిస్తున్నాయి. మానసిక కారణాల్లో సామ్యం, అనుచిత విభాగం ప్రధానమైనవి. భాషలో నియతి సార్వత్రికం. ఈ నియతి నతిక్రమించిన రూపాలు కొన్ని భాషలో ఉండవచ్చు. ఇవి కూడ సామ్యకారణంచేత క్రమబద్ధాలై మార్పు నొందుతాయి.

చూతురు, తెత్తురు, వత్తురుల సామ్యంచేత కోతురు, చేతురు రూపాలేర్పడ్డాయి.

కండ్లు, చండ్లు అనే బహువచన రూపాలకి ఏకవచన రూపాలు కన్ను, చన్ను. అందువల్ల దీని సామ్యంచేత 'పండ్లు' నకు ఏకవచనంలో 'పన్ను' అనే రూపం ఏర్పడటం జరిగింది. దీని అసలు రూపం పన్నుకాదు, పల్లు.

సంస్కృతంలో 'ఈ' అనే ప్రత్యయం స్త్రీ లింగసామాన్యం అవటంచేత ఆ 'ఈ' ప్రత్యయం రాగూడనిచోట్ల కూడ అది చేర్చి కుసుమ కోమలి, పద్మనేత్రి, మీననేత్రి రూపాలు ఏర్పరచారు.

ప్రముఖత, మధురత, సుందరత రూపాల సామ్యంచేత ప్రాముఖ్యత, మాధుర్యత, సౌందర్యత అనే రూపాలు వచ్చాయి.

తొమ్మిది రూపసామ్యంచేత ఎనిమిది రూపం ఏర్పడిందని ద్రావిడ భాషా శాస్త్రజ్ఞుల తలంపు.

ఫాదర్, మదర్‌ల సామ్యంచేత బ్రోథేర్ అనేరూపం బ్రదర్‌గా మారింది.

19. అనుచిత విభాగం : సామ్యం కారణంగానే ఈ అనుచిత విభాగం ఏర్పడుతుంది. ఇతర శబ్దాలతో పోల్చిచూచి శబ్దాలను తప్పుగా విభజించటం అనుచిత విభాగం తెలుగు భాషలో బహువచన లకారానికి ప్రచారం ఎక్కువ కాబోలు. ఎలి—కళ్, కిళి—కళ్, నరి—కళ్, బూరి - కళ్, యానై—గళ్ మున్నగు తమిళ పదాలకు సాజాత్యాలైన తెలుగు పదాలు ఎలుక—లు, చిలుక—లు, నక్క—లు, బొక్క—లు, ఏనుగు—లు, అని అనుచిత విభాగంచే ఏర్పడినవే గదా!

20. ప్రకృతి భావ నివారణ : కొన్ని పదాల్లో య,వ,న,లు సంధ్యక్షరాలుగా వచ్చి చేరతాయి. ఈ మార్పు ఉచ్చారణ సౌలభ్యాపాదక మనవచ్చు. పదంలో సహజంగా లేని ధ్వనులు కొత్తగా వచ్చి చేరటం సౌలభ్యా పాదకమని చెప్పటం కొంత వింతగా వుంటుంది. అవ్యవహితోచ్చారణలో నూత్న ధ్వనులు వచ్చిచేరటం ఒక స్థానకరణ ప్రయత్నంనుండి మరొక స్థానకరణ ప్రయత్నానికి వచ్చి చేరటానికి

సహాయకారి అన్నమాట. ఇది తెలుగులో ఎక్కువ. మా—ఇల్లు= మా యిల్లు, మా—ఊరు=మావూరు, చేయు—అతడు=చేయునతడు. పూవు, చెఱువు, గోవులలో ఉన్న 'వు' వర్ణం కూడ ఉచ్చారణ సౌలభ్యార్థమై వచ్చిందని చెప్పవచ్చు.

21. <u>సంకరం</u> :— ఈ సంకరం కూడ మానసిక కారణంగా ఏర్పడిందని చెప్పవచ్చు. ఇది రెండు పదాలలోని వర్ణాలమధ్య జరుగుతుంది సాధారణంగా. (వర్ణ వ్యత్యయం ఒక పదంలోని వర్ణాలకు మధ్య జరుగుతుంది) సంకరంలో రెండు పదాలలోని వర్ణాలు తారుమారవుతాయి. కాబట్టి ఇది కూడ ఒక రకమైన వర్ణవ్యత్యయమే.

22. <u>విపరీతోచ్చారణ</u> :— కావ్యభాషలో అచ్చుబద్ధవకారలోపం [illegible] చేసినవాడు> చేసినాడు. నేటి తెలుగు భాషలో కూడ సామాన్య ప్రజానీకం ఉచ్చారణలో 'వ' కార లోపం కనబడుతుంది— వాడు> ఆడు, వీడు> ఈడు. శిష్టభాషలో ఈ లోపం కనబడదు. శిష్టుల్లాగా 'వ' కారాన్ని ఉచ్చరించాలనే భావనతో శబ్దసహజమైన 'వ'కారాన్ని ఉచ్చరించటంతోబాటు, శిష్టేతరులు పదంలో 'వ'కారం లేనిచోట్ల కూడ వ కారాన్ని చేర్చి కొన్నిచోట్ల ఉచ్చరించటం కనబడుతుంది—ఎన్ను> వెన్ను, ఎండ> వెండ, (అన్నం> వణ్ణం కూడ ఇట్టిదేనేమో?) దీనినే ''హైపర్ స్టాండర్డయిసేషన్'' అంటారు.

23. <u>సంప్రసారణం</u> :— సంస్కృతంలో య, వ, ర, ల లు ఇ, ఉ, ఋ, ౡ అవటాన్ని సంప్రసారణమంటారు. అంటే ఇది యణా దేశానికి విరుద్ధమన్నమాట— యజ్+త=ఇష్ట, వప్+త= ఉప్త, గ్రహ్+తి=గృహ్ణాతి. ఈ సంప్రసారణం తెలుగులో కనబడదు. కాని పదాది వ కారానికి బదులు 'ఒ' ను ఉచ్చరించటం కనబడుతుంది—వడ్డి- ఒడ్డి, వద్దు— ఒద్దు. దీనికంటె ఎక్కువగా, దీనికి విరుద్ధంగా పదాది ఒ కారాన్ని వ కారంగా ఉచ్చరించటం ఉంది ఒగరు> వగరు, ఒనరు> వనరు, ఒద్ద> వద్ద, ఒదరు> వదరు, ఒయ్యారం - వయ్యారం, ఒరవడి> వరవడి.

24. <u>లోకనిరుక్తి</u> :— శబ్ద వ్యుత్పత్తి విచారాన్ని పండితుల వలె పామరులు కూడ ప్రయత్నిస్తారు. వారి భావనలు ఒక్కొక్కపుడు శాబ్దికంగాను, ఆర్థికంగాను కూడ మార్పులు తెస్తుంది. వ్యుత్పత్తి అర్థంగాని పదాలకు భాషా వ్యవహర్తలు ఏదో ఒక విధమైన అర్థం వచ్చునట్లు శబ్దార్థాన్ని కల్పించటాన్ని లోకనిరుక్తి అనిచెప్పవచ్చు. అరుంధతి> ఆరనిజ్యోతి, చంద్రమా> చందమామ, జీరగ> జీలకర్ర. నిజానికి అన్యభాషా పదాలకే లోకనిరుక్తి ఎక్కువ.

<u>అన్యభాషా ప్రభావం</u> :— భాషలో మార్పులు బహుముఖంగా జరగటానికి అన్యభాషా ప్రభావం ఒక ముఖ్య కారణం అనవచ్చు. ఆంధ్ర భాషను చారిత్రకంగా పరిశీలించినపుడు సంస్కృత ప్రాకృతాలతో, తమిళ కన్నడాలతో, హిందుస్తానీ, అరబ్బీ, ఉర్దూ, డచ్చి, పోర్చుగీసు, ఇంగ్లీషు మున్నగు భాషలతో సంబంధముందని తెలుస్తుంది. ఆ కారణంగా అన్యభాషా ధ్వనులు, పదజాలం కొంత వరకు ప్రవేశించాయి. సంస్కృతంనుండి ఋ, ౠ వర్ణాలు; విసర్గ, మహాప్రాణ వర్ణాలు; శ, ష లు తెలుగులోకి వచ్చాయి. హిందుస్తానీ, ఆంగ్లభాషల సాహచర్యంచే ఫ వర్ణం వచ్చింది—సఫేద్, కాఫీ, ఆఫీసు. ప్రపంచ భాషలన్నింటిలో ఎంతో కొంత అన్యభాషా ప్రభావం ఏదో ఒక కారణంగా ఉంటూనే వుంటుంది.

## కొన్ని ఉపయుక్త గ్రంథాలు


1 A Course in General Linguistics-F.D. Saussure.

2 An Introduction to Comparative Philology– P. D. Gune.

3 Introductory Linguistics–Robert A. Hall Jr.

4 Language - Leonard Bloomfield.

5 Lectures on Linguistics – F. M. Berezin.

6 ఆంధ్ర భాషా వికాసము – గంటి జోగిసోమయాజి.

7 తెలుగు భాషా చరిత్ర – టి. భాస్కరరావు.

8 భాషాశాస్త్ర వ్యాసములు – లకంసాని చక్రధరరావు.




శ్రీ జంధ్యాల బాలగంగాధర తిలక్

# అర్థశాస్త్రంలో 1979 సం. పు నోబుల్ బహుమతి గ్రహీతలు

స్వీడిష్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ (Sweedish Academy of Sciences) వారి ప్రపంచంలోకెల్లా అత్యంత విశిష్టమయిన నోబుల్ బహుమతి ఈ సంవత్సరం అర్థశాస్త్రంలో చికాగో విశ్వ విద్యాలయంలో ఆచార్యులుగానున్న థియొడర్ విలియమ్ షుల్ట్జ (Theodore William Schultz)కు, వెస్ట్ ఇండీస్‌లో పుట్టి ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయంలో పని చేస్తున్న సర్ ఆర్థర్ లూయిస్ (Sir Arthur Lewis)కు లభించింది. ఈ సంవత్సరం ఈ అత్యున్నతమయిన గౌరవప్రదమయిన పురస్కారం ఈ ఇరువురికి ఇవ్వటంలో విశిష్టత ఉన్నది. ఈ ఇరువురు విశ్వవిఖ్యాత అర్థశాస్త్రవేత్తలు అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థికాభివృద్ధి సమస్యలపై అవిరళమయిన పరిశోధనలు జరిపారు.

డాక్టర్ ఆల్‌ఫ్రెడ్ నోబుల్ (Alfred Nobel) స్వీడన్ దేశంలో గొప్ప భౌతిక శాస్త్రవేత్త. విచ్ఛిన్నకరమయిన డైనమైట్‌ను కనుగొన్న శాస్త్రవేత్త ఈయనే! అయితేనేమి సర్వసంపన్నుడయిన డాక్టర్ నోబుల్ వైద్య శాస్త్రము, శాంతి, సాహిత్యము భౌతిక శాస్త్రము, రసాయనశాస్త్రములలో ప్రతి సంవత్సరము ప్రపంచంలోకెల్లా విశిష్టమయిన కృషిచేసిన వారికి ఒక విశిష్టమయిన పురస్కారమీయవలెనని సంకల్పించి తన యావదాస్తిని ఒక ట్రస్టుకు అప్పగించి



శ్రీ థియొడర్ షుల్ట్జ



సర్ ఆర్థర్ లూయిస్

తన 53వ ఏట 1886లో దివంగతుడయినాడు. ఇపుడు విఖ్యాతి చెందిన నోబుల్ బహుమతి ఆయన పేరుమీదుగనే ఈయబడు తున్నది.

అర్థశాస్త్రంలో నోబుల్ పురస్కారం ఇవ్వటం 1969లో ప్రారంభమయింది ఆ సంవత్సరంలో జాన్ టింబర్గన్ (Jan Timbergen), రగ్నార్ ఫ్రిష్ (Ragnar Frisch) లకు ఈ బహుమతి లభించింది. 1970లో పాల్ శామ్యూల్ సన్ (Paul A Samuelson)కు, 1971లో సైమన్ కుజ్నెట్స్ (Simon Kuznets)కు, 1972లో కెన్నెత్ ఆరో (Kenneth J Arrow), సర్ జాన్ హిక్స్ (Sir John R Hicks) లకు ఈ పురస్కారం లభించింది. 1973లో వస్లీ లియోన్‌తీఫ్ (Wassily Leontief), 1974లో గున్నార్ మిర్డాల్ (Gunnar Myrdal), హేయక్ (F A Hayek)లు ఈ విశిష్టమయిన బహుమతితో సత్కరింప బడ్డారు. 1975లోకూప్‌మన్స్ (T Coopmans), కాంతారో విచ్ (Kantorovich)లు, 1976లో మిల్టన్ ఫ్రీడ్‌మన్ (Milton Friedman) ఈ ఘనతను సాధించ గలిగారు. జేమ్స్ మీడ్ (James E Meade), బెర్టిల్ ఓహ్లిన్ (Bertil Ohlin) 1977 లోను, హెర్బర్ట్ సైమన్ (Harbert A Simon) 1978 లోను నోబుల్ బహుమతిని సముపార్జించుకొన్నారు.

ఈ సంవత్సరం ఈ విశిష్ట సత్కారాన్ని పొందిన ఇరువురిలో ఒకరయిన ప్రొఫెసర్ షుల్ట్జ వ్యవసాయార్థ శాస్త్రవేత్తగా విఖ్యాతి చెందారు. వీరు సాంప్రదాయ వ్యావసాయ ఆధునీకరణము (Modernisation of traditional agriculture) గురించి ఎంత గానో పరిశోధనలు జరిపారు. పెక్కు అభివృద్ధి చెందుతున్న దేశాలలో వ్యవసాయరంగంలో శ్రామికుని ఉపాంత ఉత్పాదకత (Marginal Productivity of labour) శూన్యమే కాక, శూన్యముకంటె తక్కువను (negative లేక మైనస్ చిహ్నముతో ఉండునని) పలువురి అభిప్రాయముతో ప్రొ. షుల్ట్జ ఏకీభవించరు. వారి దృష్టిలో ప్రాచీన వ్యవసాయ విధానము ననుసరిస్తున్న నేడు కృషీవలుడు కూడ సరియగు హేతువాదే (Rationalist)! అనుచితమయిన నిర్ణయములు గైకొనడు. కావున ఉపాంత వ్యవసాయ కార్మికుని ఉత్పాదకత శూన్యముకాదు; అయితే వేతనము విలువకంటె కొంచెము తక్కువగా నుండవచ్చును. వ్యవసాయ రంగములో ఉత్పాదక సాధనముల (Factors of production) పై వచ్చు లాభములు చాలా స్వల్పము. కావున ఉత్పాదక సాధనముల ఉత్పత్తిపై ఎక్కువ పెట్టుబడి చేయుట సాధ్యపడదు. కావున వ్యావసాయిక ఆధునీకరణము కూడా చాలా కష్టము. ఇంతేకాక వ్యవసాయ రంగముపై ప్రభుత్వ వ్యయము కూడా చాలా తక్కువ. వీటి కారణముగా పెక్కు అల్ప వికసిత దేశములలో వ్యవసాయ రంగములో అభివృద్ధి సంతృప్తికరముగా లేదని ప్రొ. షుల్ట్జ అభిప్రాయము.

1960 వరకు ప్రొ. షుల్ట్జ ప్రధానముగా వ్యవసాయార్థ శాస్త్రవేత్తగానే ఉండిపోయారు. కాని 1960 డిశంబర్‌లో అమెరికను అర్థశాస్త్రవేత్తల వార్షిక సమావేశంలో మానవధనం (Human Capital) అనే విషయంపై వీరిచ్చిన అధ్యక్షోపన్యాసంలో విద్యార్థశాస్త్రానికి (Economics of Education) కి అంకురార్పణ జరిగింది. ప్రొ. షుల్ట్జ విద్యార్థ శాస్త్రానికి పితామహుడుగా వినుతికెక్కారు. అర్థశాస్త్ర ఆలోచనా విధానంలో ఒక విధంగా 'మానవ ధనం' అనే పేరుతో ఒక విప్లవాన్ని ప్రొ షుల్ట్జ రేకెత్తించారని యం. జె. బౌమన్ (M.J. Bowman) ప్రశంసించటంలో ఏమాత్రం అతిశయోక్తి కానరాదు. ప్రొ. షుల్ట్జ చేత అంకురార్పణ గావింపబడిన ఈ క్రొత్త శాస్త్ర విభాగం అనతి కాలంలో ఒక ప్రత్యేక శాస్త్రంగా రూపొందింది. ఈ శాస్త్రంలో పరిశోధనా వ్యాసాలు, గ్రంథాలు అనగణితంగా పెరుగుతున్నాయి. 1975 నాటికి దాదాపు 2వేలకు మించిన ప్రధానమయిన పరిశోధనా వ్యాసాలు, గ్రంథాలు ఉన్నట్లు ఇటీవల తయారయిన ఒక నిఘంటువు ద్వారా తెలుస్తున్నది. అంతేకాకుండా అర్థశాస్త్ర పాఠ్య గ్రంథాలలో విద్యార్థ శాస్త్రం ఒక అనివార్యమయిన భాగమయిపోయింది.

అర్థశాస్త్ర సిద్ధాంత చరిత్ర (History of Economic Thought) ను అవలోకిస్తే ప్రారంభంలో ఆర్థికాభివృద్ధికి వ్యాపారము ప్రధానమని భావించడం జరిగినదని తెలుస్తున్నది. ఈకాలాన్ని వ్యాపార సిద్ధాంత (Mercantilist) యుగము అనేవారు. తదుపరి ఫిజియోక్రాట్స్ (Physiocrats) కాలంలో ఆర్థికాభివృద్ధికి భూమి ఏకైక సాధనంగా గుర్తింపబడింది. 18వ శతాబ్దపు చివరి కాలంలో సాంప్రదాయక ఆర్థిక సిద్ధాంత వేత్తలు (Classical Economists) మూలధనము (Capital) నకు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. తదుపరి మార్క్సిస్టులు శ్రమకు అధిక ప్రాధాన్యత కల్పించారు. 20వ శతాబ్దపు మొదటి అర్ధ శతాబ్దంలో వ్యవస్థాపనము (Organisation) ఆర్థికాభివృద్ధికి మూలమని గుర్తించడం జరిగింది. కాని ప్రొ. షుల్ట్జ నేడు ఆర్థికాభివృద్ధికి మానవ ధనం ప్రధానంగా విద్య ఎంతో అవసరం అని తీర్మానించారు.

విద్యార్థ శాస్త్రంలో ప్రొ. షుల్ట్జ మూల సిద్ధాంతాలు తేలికగా అవగాహన చేసికొనవచ్చు మానవునిలో రెండు ఉత్పాదక సాధనా లున్నాయి. అవి శ్రమ, మానవ ధనం. విద్య, ఆరోగ్యం మున్నగునవి మానవ ధనంలోని ప్రధాన అంశాలు. మానవ ధనం (Human Capital) భౌతిక ధనం (Physical Capital) వలె అత్యంత విలువయినది. కాబట్టి విద్య, ఆరోగ్యము మొదలగు వానిపై చేయు వ్యయము ఆహారంపై చేయు వ్యయమువలె వినియోగ వ్యయము (Consumption Expenditure) కాదు; యంత్రములపై చేయు వ్యయమువలె పెట్టుబడివ్యయము (Investment Expenditure). ఆర్థికాభివృద్ధికి పెట్టుబడి ఎంతేని అవసరము. కావున విద్యారంగముపై వ్యయము చేయుట దేశార్థికాభివృద్ధికి ఎంతయినను తోడ్పడును. సంక్షిప్తముగా చెప్పవలెనన్న ముడి సరుకు అయిన మనిషిని విద్య మానవీయ మూలధనముగా మార్చును.

ప్రారంభములో ప్రొ. షుల్ట్జ సిద్ధాంతములపై విమర్శ ముమ్మరముగా నున్నది. కాని నేడు వీరి సిద్ధాంతములు అందరకు అంగీకార యోగ్యమయినవి.

ప్రొ. షుల్ట్జ విదేశవ్యాపార సిద్ధాంతాలపై కూడ గణనీయ మయిన కృషి చేశారు. విదేశ వ్యాపార సిద్ధాంతాలలో ప్రొ. షుల్ట్జ వెలిబుచ్చిన అభిప్రాయాలు క్లుప్తంగా పేర్కొందాము :

అభివృద్ధి చెందుతున్న చాలా దేశాల ఎగుమతులలో వృద్ధి రేటు ఎక్కువగానే ఉంది. అంతే కాకుండా ఆ దేశాలు ప్రధానంగా కొన్ని ప్రాథమిక వస్తువుల ఉత్పత్తిలో విశిష్టీకరణ గావించి వాటినే ఎగుమతి చేస్తున్నాయి. కాని సమగ్ర దృష్టితో పరిశీలిస్తే ఈ విధానం మంచిది కాదు. ఈ ప్రాథమిక వస్తువులకు సంబంధించి విదేశ మార్కెట్లలో అస్థిరత అధికంగా ఉంటుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలు ఈ అస్థిరతను తట్టుకొనలేవు. తత్కారణంగా విదేశ వ్యాపారములోనే కాక ఆంతరంగికంగాకూడ అల్పకాలీన, లఘు కాలీన అస్థిరతను ఎదుర్కొనవలసి వస్తుంది.

సర్ ఆర్థర్ లూయిూస్ అభివృద్ధి చెందుతున్న దేశాలకు అనువయిన అభివృద్ధి ప్రణాళికా విధాన నమూనా **(Development Planning Model)** ను తయారు చేయటంతో వినుతి కెక్కారు. సర్ లూయిూస్ సిద్ధాంతం ప్రకారం అల్పవికసిత దేశాలలో రెండు ఆర్థిక రంగాలు ఉన్నాయి : మొదటిది ప్రధానమయినది పరిశ్రమల రంగము **(Industrial Sector)**; రెండవది ముఖ్యముగావ్యావసాయిక రంగము **(Agricultural Sector)**. వ్యావసాయిక రంగంలో శ్రామికులకు బొటాబొటి ఆదాయం లభిస్తుంది. తత్కారణంగా వారు కనీస అవసరాలతో మాత్రమే జీవించగలుగుతూ ఉంటారు. అంతే కాకుండా వ్యావసాయిక రంగంలో ఉత్పాదనమునకు అవసరమయిన దాని కంటె అధికంగా శ్రామికులుంటారు. పరిశ్రమల రంగం వారికి ఉపాధి కల్పిస్తుంది. పరిశ్రమల రంగం యొక్క ప్రధాన ఆశయం లాభాలు ఆర్జించటమే. వ్యావసాయిక రంగంలో అవసరానికి మించిన శ్రామికులు అసంఖ్యాకంగా ఉండటంతో పరిశ్రమలరంగం ఈ అధిక శ్రామికులతో ఎంతయినా అభివృద్ధి చెందుతూ ఉంటుంది. కాని పరిశ్రమల రంగంలోవేతనాలు శ్రామికుల ఉత్పాదకతపై ఆధారపడక, వ్యావసాయరంగంలోని వేతనాలపై ఆధారపడి ఉంటుంది. వ్యావసాయక రంగంనుండి శ్రామికులను తీసికొనవలసి వస్తుంది కాబట్టి వ్యావసాయిక రంగంలోని వేతనాల కంటె పరిశ్రమల రంగంలోని వేతనాలు స్వల్పంగా అధికంగా ఉంటాయి. వ్యావసాయక రంగంలో ఉపాంత శ్రామికుని ఉత్పాదకత **(Marginal Productivity of labour)** శూన్యం కావచ్చు. అయి నప్పటికి ఈ రంగంలో ఉపాధి లభిస్తుంది. కాని పరిశ్రమలరంగంలో ఉపాంత శ్రామికుని ఉత్పాదకత విలువ వేతనాలకు తగ్గకూడదు. వేతనానికంటె తగ్గు పరిస్థితివస్తే క్రొత్త శ్రామికులకు పరిశ్రమల రంగంలో ఉపాది లభించదు. పరిశ్రమలరంగంలో ఉత్పత్తయిన మిగులు (Surplus) దేశాభివృద్ధికి ఎంతో అవశ్యకము. ఇది సూక్ష్మంగా లూయిూస్ ప్రణాళికాభివృద్ధి సిద్ధాంతము. దీనిని రెండు ఆర్థిక రంగముల అభివృద్ధి ప్రణాళికా నమూనా అని కూడా అంటారు.

లూయిూస్ ప్రణాళికా నమూనా ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికను ఖండములకు చెందిన అభివృద్ధి చెందుచున్న దేశాలను దృష్టిలోనుంచుకొని రూపొందింపబడింది. అయితే అది పూర్తిగా క్రొత్తనమూనాకాదు. ఇది సాంప్రదాయిక అభివృద్ధి నమూనా **(Classical development model)** ఆధారంగా తయారుచేయ బడింది. లూయిూస్ అభివృద్ధి ప్రణాళికా నమూనా ముఖ్యంగా 3 షరతులపై ఆధారపడి ఉంది :

1. పరిశ్రమల రంగంలో వేతనాలు వ్యవసాయరంగంలోని శ్రామికుని ఉపాంత ఉత్పాదకతకంటె కొంచెం అధికంగా ఉండవలె. 2. పరిశ్రమల రంగంలో పెట్టుబడి దేశజనాభా పెరుగుదలతో పోల్చి చూచినపుడు చాల ఎక్కువగా ఉండకూడదు. 3. శ్రామికునికి శిక్షణ ఈయవలసివస్తే దాని కగు ఖర్చు దాదాపు దేశంలో అంతట స్థిరంగా ఉంటుంది· ఈ మూడు షరతులు పాటించగలిగితే సర్ లూయిూస్ దృక్పథంలో శ్రామికు లధికంగా ఉన్న అభివృద్ధి చెందుతున్న దేశాలు అధికంగా మూలధనం (Capital) లేకుండానే బాగుగా అభివృద్ధి చెందవచ్చు. లూయిూస్ ననుసరించి ఇటువంటి పరిస్థితులలో దేశంలో పొదుపు 5 శాతంనుండి 12 శాతంవరకు పెరగవచ్చు.

కాని లూయిూస్ అభివృద్ధి ప్రణాళికా నమూనా అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలకు ముఖ్యంగా భారతదేశానికి వర్తించదని ప్రొ. ఎ. యం. ఖుస్రోవంటి శాస్త్రవేత్తల అభిప్రాయము. వ్యావసాయక రంగంలోనుండి పారిశ్రామిక రంగంలోనికి శ్రామికుల తరలింపు అంత సులువుకాదు. ఇది ముఖ్యంగా సామాజిక పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. లూయిూస్ అభివృద్ధి ప్రణాళికా నమూనాలో సామాజిక పరిస్థితులకు సరియగు స్థానం ఈయబడలేదని తత్కారణంగా లూయిూస్ ప్రణాళికా నమూనా మన దేశానికి వర్తించదని విమర్శ. ఏమయినప్పటికి లూయిూస్ అభివృద్ధి చెందుతున్న దేశాల అభివృద్ధికై ఎంతో కృషి చేశారనటంలో సంశయంలేదు.

అభివృద్ధి చెందుతున్న దేశాల వివిధ సమస్యలపై గణనీయ మయిన పరిశోధనలు జరుపుతున్న ఇరువురు అర్థశాస్త్రవేత్తలకు ఈ సంవత్సరం నోబుల్ పురస్కారం లభించటం అభివృద్ధి చెందుతున్న అన్నిదేశాలకు ఎంతో ముదావహమయిన విషయం.



## ఆంధ్ర ప్రశస్తి - విశ్వనాథ దేశభక్తి

ఆంధ్ర ప్రశస్తి ప్రారంభములో

''మా పూర్వాంధ్ర ధరాధి నాయక కథా మంజూషికా రత్న గా
థా పద్యావళి పేరిహారి సుమనోదామమ్ము మాధ్వీక భా
షా పృక్తమ్ము మహాప్రబంధ రచనా సౌందర్య పున్ వాసనల్
తీపై క్రమ్మగ నాంధ్ర సోదరుల కందిత్తున్ గళాంకమ్ముగన్''

అనినారు కవిసమ్రాట్టులు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు. ఆ విధముగా— ఆంధ్ర మహావిష్ణువు, శాతవాహనుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, మాధవవర్మ, వేంగీ క్షేత్రము, ముఖలింగము మొదలైన పాత్రలలో ఆంధ్ర ప్రశస్త్యమృతమును పంచినారాయన.

సత్యనారాయణగారి రూపెత్తిన దేశభక్తియే ఆంధ్రప్రశస్తి. ఆంధ్రుల ప్రాచీన వైభవమును తలచుకొనినచాలు ఆయనకు కరళ్ళు కరళ్ళుగా దుఃఖము పొంగివచ్చును. ప్రాచీనమైన దన్నచో నా కవి కదొక యావేశము.

ఆంధ్ర విష్ణువు శ్రీకాకుళాధినేత నిశుంభ దైత్యాధిపుని సంహరించుట మొదటి ఖండికలో వర్ణితము. ఈరాజు ''తెనుగున్ జేండ్లకు నాది పూరుషుడు'' గనుక నతనితో నాంధ్రప్రశస్తి ప్రారంభము సమంజసము. దీని చివర కృష్ణాతీర శ్రీకాకుళ వర్ణన మది యొక ధగద్ధగితమైన మెరుపు. శకకర్తయైన శాతవాహనుడు దీపకర్ణి రాజునకు లభించుట రెండవ ఖండికలో వర్ణితము. గోతమీ పుత్ర శాతకర్ణి మహాక్షాత్రపుడైన నహపానుని సవంశముగా సంహరించుట మూడవ ఖండికలో వర్ణితము.

తదుపరి ''ఈనా పదార్పిత క్షోణినే రాజు ధర్మాసనంబుండి స్మృత్యర్థ మనెనొ ?'' అని పులకరించుచు వేంగీక్షేత్ర ప్రాచీన వైభవమును వర్ణించిరి కవిగారు. అటు తరువాత ''శ్రీ గంధ కస్తూరికా గురు ద్రవ్యమ్ము లిట దిగంతముల వాసించెనేమొ, తెలుగు కళింగ రాజుల గుండె నెత్తురుల్ కడగి రక్షా దీక్ష గడలెనేమొ'' యని లీలమించిన ముఖలింగ ప్రతిభను వక్కాణించిరి. కుమారుని ధర్మదేవతకు బలిపెట్టి — విజయవాటికను కనకవర్షము కురిపించిన మాధవవర్మ కథ నభినుతించెను.

తదుపరి

''శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ యను నాశీః పూర్వ కారంభ వాణీ వైదగ్ధ్యము''నకు కాణాచియైనవాని, ''ప్రౌఢాంధ్ర విజ్ఞాన భాషా మహాదేవి కావాసమైన యా స్యమ్ము వాని'' నన్నయ భట్టు ప్రతిభ నభివర్ణించెను.

''ప్రోలరాజు వధ''లో కాకతి ప్రోలరాజు స్వంత కుమారునిచే వధింపబడుటను, కొండవీటిపై నేడు తిరుగాడు పొగ మబ్బులను గురించి ''కొండవీటి పొగమబ్బులు''లోను, పలనాటి బ్రహ్మనాయని కాలమునాటి 'చంద్రవంక యుద్ధము'ను విజయ నగర రామరాయల పౌరుషమును, కేళాదిపురి సదా శివరాయల రాజభక్తిని ''యమ దంష్ట్రిక''లోను — దేశభక్తి తప్ప — ఒక దానితో మరియొక దానికి పోలిక లేకుండ రచించినారు కవి సమ్రాట్టులు. ఇందలి ప్రతి రచనయు రస గుళికయే.

ముత్తెపు చిప్పలో బడిన ఏచినుకైనను ముత్తెమగునన్నట్లు సత్యనారాయణగారి మనసులో పొడమిన ప్రతి యూహయు రసరామణీయ కత్వమున కొదుగును కాబోలు.

సత్యనారాయణగారు ప్రాచీనాంధ్ర చరిత్రమును కనుల ముందుంచినారు. అక్షరాక్షరమును రసభరితము చేసినారు.

''ఈ పవిత్ర ధరిత్రి నోపె త్రైలింగ రా
జశ్రీ సుధా ప్రవర్షంబు కురిసి''

''కడగి యిచ్చటి మంటి గడ్డలు నైతమ్ము
నవ మృగీమద వాసనలు వెలార్చి''

యని మురిసిపోవు నాయన.

''ఈనా శరీర మందివతళించిన గాలి
యెంత పౌరతన్య మేచి కొనెనొ !''

''ఈనా తనూపూర్ణమైన యాకాశమ్ము
నేకతు ధ్వనులు శబ్దించి నవియొ''.

''అన్మ దజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్ప
నీ పునీతావనీ ఖండ మిచట నిలిచి
య స్వతంత్రత దొరలునా యాంధ్ర శక్తి
నన్ను కంపింపం జేయుచున్నది భృశమ్ము.''

అని వాపోవుదు రాయన.

''ఎచట గనిన పూర్వ పల్లవ నృప చరితలె
వ్రాయబడి, గీయబడి యుపన్య
సింపబడి శ్రోత్ర పేయమై చెన్ను దాల్చె
నీ యతీంద్రియ శక్తి నాకెట్లు లబ్బె—''

అని ఆరాట పడుదు రాయన ''వేంగి క్షేత్రము'' లోన.

'ముఖలింగము'లో

ద్వార బంధాలపై వ్రాయబడిన తొంటి తెలుగు
లిపి పోల్చుకొని కూడ బలుకు కొనెదు
నా మహా మాతృదేశ బద్ధానురాగు లెవరొ
నా గుండె నెత్తురు లిట్లు కదుప''

అని అల్లాడిపోవు నాయన.

అందులోనే మరియొక చోట :

నా హృదయ సీమలో న సృజ్జ్వాళ గర్భ
పదములంబడి యొరసి ప్రవాహ మేచి
యుాగి బుడగల్లై యుచికి వచ్చినా
కనుల తుట్టు తుదలలో నాట్యమాడు.''

నని విశదీకరించినారాయన. ఇంతింతై వటు డింతయ్యై యన్నట్లు ఆంధ్ర ప్రశస్తిలో కవి యావేదన పట్టరానిదై కన్పట్టును.

తెలుగు దేశమన్న నా మహాకవి కెంత ప్రాణమో, ఆంధ్ర ప్రశస్తి రచనా కాలమున కస్వతంత్రముగా నున్న మాతృదేశమును తలచుకొని యాయన యెంతవిలపించెనో చెప్పుటకు ఇందణువణువు ఏను నుదాహరణములే.

''పాడిన గీతమే మరల బాడెద గూడిన భావమే
మరల గూడెద నేమి సేయవలె గుండియ శోషిలి
దుఃఖవేదనన్ గాడిన నా హృదంతర ముఖంబున
మా తొలినాటి కీర్తి రా పాడిన నాదు వాక్కు
తెగ బాఅదు మాత్న పథాల వెంబడిన్.''

అని ఆంధ్ర ప్రశస్తి అడుగడుగునను నావేదనయే విస్ఫుట మగు చుండును.

ఆ ఆవేదన యెంతకు పరిణమించినదో గనుడు. 'ముఖ లింగము' లో

''ఈ పొంగెత్తిన వంశధార మరి ఇట్లే పొంగులై పొంగులై
నా ప్రాణమ్ములు దేహమీ జలములోనన్ ముంచుకోనిమ్ము...''

అని యుద్రేకపడువరకును సాగినది.

చివరికా మహావేశ భావ తీవ్రత ఆయన చేతనే ఏమని పించు చున్నదో చూడుడు.

''ఏమి మిగిలినదీ నాటి కిట్లు పొంగు
లొలయు వర్షానదీ గభీరోదకముల
దైన్య గర్భ చారిత్రముల్ దక్క భిన్న
గిరి శిఖర దుర్గ పరిదీన గీతి దక్క''

అప్పుడు ఆంధ్రదేశము అనుభవించుచున్నదుర్భరమ్మైన అస్వతంత్రము భరింపలేక

''ఇచటి నాగావళీ ప్రచుర వర్షాంభస్త
రంగముల్ వంశధారా జలములు
తరగెత్తిన మహేంద్ర తనయా సు పాథస్సు
లొకసారిగ్గా బొంగి యుబికి పోయి
గౌతమీ కృష్ణవేణీ తరంగములు తా
రాధ్యమ్మునందు నైక్యము భజించి
గుండ్లకమ్మ జలాల గుబురులో గుబురులై
పెన్నా తరంగముల్ పెరిగి పోయి
తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయ వారి
కెరలిపడి తెన్నుగేల ముగించ నిమ్ము
నేటితో, న స్వతంత్రతా నియతమ్మైన
యీ బ్రతుకు తెన్నువారు భరించలేరు''

అనివేసినారు సత్యనారాయణగారు ఆవేదనతో —

ఇంత యేల ?

ఆంధ్ర ప్రశస్తి అమూలాగ్రము నక్షరాక్షరమును కవిగారి దేశ భక్తినీ, ప్రాచీనాంధ్ర రాజభక్తినీ ప్రతిబింబితము చేయుచుండును.

ఇది చూడుడు— కొండవీటి పొగ మబ్బులలో ...

''కొండవీటి పొలాల్ వీడి కోనులేక
ఆశ బలమున మగుడు ప్రేతాత్మల వలె
సొరిది నీ గిరి కొమ్ముల జుట్టుపట్ల
నిట్టి పొగమబ్బులై భ్రమియించు గాక.
నా ప్రాణములకు నీ పొగ మబ్బులకు
కేమి సంబంధమో ! యేను గూడ
పొగ మబ్బునై కొండ చిగురు కోనల పైన
బురుజుల పైని గొమ్ములకు బైని
ప్రాలిపోనో మధ్య ప్రేవోనో నేల
రాలిపోనో గాలి తేలిపోనో''

అని తాదాత్మ్యమును భజించెను.

విశ్వనాథవారి ఆత్మ పూర్వాంధ్ర ప్రశస్తిని స్మరించి యెంత అల్లాడినదో వివరించుట కొకటా రెండా, ప్రతి పద్యము నుదాహరణమే.

ఇంక కళాప్రపూర్ణుల కవిత్వమును గురించి చెప్పనదేమి ? యదియు పాత మధురమే.

కాగా నా మహాకవి ప్రయోగ వైచిత్ర్యమున కుదాహరణము లుగా నొండు రెండు...

''సాగర మేఖలా చారు కుచద్వ యీ శాయి ఆంధ్రావని చక్రవర్తి !''

''నీ కర్పూరపు ఖండముల్ భుజముల౦దింపంగ ద దోయీ! శిశూ !''

''రామ నాయక భళారే! శత్రుసప్తాంగహారీ! కేళాధిపురీంద్ర! యాదవ మురారీ! కోటికోలాహలా! కై కో సామి పరాకు!''

''శకార గంగై కొండ చోడుతో నీ చోటు వియ్యాల బిగువులు బిగిసెనేమో'' —

ఇట వియ్యాల బిగువులట—ఎంత రామణీయకమ్మైన మాట.

ఇంక —

ఉధృతమైన భావావేశము, అద్భుతమైనదేశభక్తి, అత్యంతమైన రసపుష్టతులలోబడి మున్గిపోవుచు వేనినైన నిరాకరించుటకు — కడకు దూషించుటకైనను వెనుదీయరు సత్యనారాయణగారు.

ఇదియే ముఖ్యముగా నాయన ప్రాచీన లక్షణము. మనము చదువుతున్నప్పుడు సహించక తప్పని విషయముగా కన్పట్టును.

నాజాతి పూర్వ ప్రథా జీవ రహితయై
శక్తి నాడుల యందు జచ్చి పోయి
నా మాతృభూమి తేజో మహశ్చ్యుతిని బ్రహ్మక్షత్ర భేదంబు
మంట గలిపి
... ... ... ... ... ... ... ... .. ... ... ..
నా తల్లి నేల నే నాటి వాచారముల్
పై మెఱుంగులు చూచి భ్రమసిపోయి ... ...

అని బాధపడిపోవును. తాను నమ్మిన విషయము నెంత దృఢముగ జెప్పనో ప్రారంభములో నాంధ్ర ప్రశస్తిని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి కంకిత మిచ్చుచు . ...

డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకు
రానట్టి ఈ పాడు కాలానఁ బుట్టి
... ... .. ... ... ... ... ... . ... ... ...
చాడీలకు ముఖ ప్రశంసల కీర్త్యకు
స్థానమైనట్టి లోకాన నుండి ... ...

యని నిర్భయముగా వాపోవుదురు.

అందుకే శ్రీ మల్లంపల్లి వారన్నట్లు, ఆ మహాకవి వేద శిరః ప్రతిపాదిత సార మహార్థ నిరూఢమతి

ఈ పుస్తకము ప్రత్యక్షర రమణీయమేగాదు. ప్రత్యక్షరమణీయమును — తను చెప్ప విషయము, వర్ణించిన వర్ణనము పఠితల మనస్సులపై గాఢమైన ముద్ర వేసికొనుటయే గాదు వారి మనో దర్పణములపై ప్రతిఫలింపకుండ నుండవు.

కనులకు కట్టినట్లుండు వర్ణన చేయునాయన. చంద్రభాగ నదీ తీరమున

'సవరాల గోడిగ' యను తన అశ్వముపైన అలరాజు, కారు బొల్లడను తన గుఱ్ఱముపై బాదన్న—పోరు సల్పుటకు సిద్ధముగా నుండుటను తెలుసుకొని ఒక్కటే పరుగుగా జనినాడచటికి బ్రహ్మనాయుడు.

వారి పరస్పర యుద్ధము ఆపు నుద్దేశమాయనది. వెళ్ళి రెండు గుఱ్ఱముల మధ్య నుంచుని —

కారు బొల్లని ముఖాగ్రమ్మున హేమ కం
కణ రమ్య దక్షిణ కరము సాచి
సవరాల గోడిగ నవఘుంటి కా లగ్న
గళ సీమపై సవ్య కరము నుంచి
పోరు నిలుపుడని మాట పెట్టెనట.

అహా ! ఏమి వర్ణన.

చంద్ర భాగా సరితీరమున నురుగులు గక్కుచున్న రెండు గుఱ్ఱముల మధ్య నట్లు నిలిచిన బ్రహ్మనాయుడు పఠితల మనః పీఠములపై నిలిచినాడు గదా.

సత్యనారాయణగారి దేశభక్తిలోని గాఢతకు, ఆర్ద్రతలోని తైక్ష్ణ్యమునకు ఉదాహరణములుగ నీ పద్యమును గాంచుడు.

ఇమ్ముగఁ గా కుళమ్ము మొదలీ వరకుంగల యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతరమేలొ చలించి పోవు నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని యెన్ని జ
న్మమ్ములుగాగ నీ తనువునన్ బ్రవహించునొ యాంధ్ర రక్తముల్ !

ఎంత గాఢ భావన.

ఇంకొకటి —

''ఇది వినిపింతునంచు మదినెంచెద మిత్రులకున్ గళస్థగా
ద్గదికము లోచనాంత బహుధారుత బాష్పనదమ్ము స్పందనా
స్పద హృదయమ్ము నా పనికి జాలక జేసెడు నన్ను నింతగా
నెద పదిలించుకొన్న దిది యెక్కడి పూర్వపు జన్మవాసనో.''

**శ్రీమతి ఓగేటి. ఇందిరాదేవి**

# వేమగిరిసీమ-కేసవరము

భక్తి ప్రబోధమండలి ఆధ్వర్యమున నేనును (గుండు విఘ్నేశ్వరశాస్త్రి తెలుగుపండిట్ — కోటికేసవరము) జి వి. యస్. నరసింహశాస్త్రిగారును (తెలుగు పండిట్—వేళంగి) ప్రాచీన గ్రామమైన కేసవరమును చారిత్రక పరిశోధనా దృష్టితో పరిశీలించి విషయములు సేకరించుటకు నేగితిమి.

ఇది వేమగిరి సమీపములోనున్న గ్రామము—వేమగిరి చారిత్రక ప్రసిద్ధిగల గ్రామము.

## వేమగిరి – ప్రాచీనత

హేమగిరి (వేమగిరి) ధవళగిరి (ధవళేశ్వరము) పద్మగిరి (రాజమహేంద్రవరము) భద్రగిరి (పట్టిసము) రామగిరి (రామదుర్గము) అని రాజమహేంద్రవరము పంచగిరుల ప్రాంతము. అందు వేమగిరి (హేమగిరి) మొదటిది. పూర్వము హేమము (బంగరము) దొరుకుచుండుటచే హేమగిరియని పేరు వచ్చినది.

ప్రాచీన కాలమున ఈ గిరి నొరసికొని గోదావరి ప్రవహించుటచే గుణగ విజయాదిత్యుని కాలములో (7, 8 శ.) వేమగిరి,

కోరుకొండలలో—జలదుర్గములు నిర్మించి సైనిక స్కంధావారము లుంచినట్లు ''లోకల్ రికార్డు'' వివరించుచున్నవి. అవి రాజ మహేంద్రపాలకుడైన రాజరాజనరేంద్రుని కాలము వరకు కొన సాగెను.

రాను రాను గోదావరీ ప్రవాహము మారుటచే - గిరిని చేరి నేల యేర్పడినది. కిమ్మూరు కైఫీదులో — ''రాజమహేంద్రమునకు ఆగ్నేయభాగమున ఆమడ దూరమున పూర్వము చాళుక్యరాజులు కట్టించిన కొండమీద దుర్గమునకు సామీప్యముగను—కాటయ వేమా రెడ్డిగారు గ్రామ నిర్మాణము చేయించినారు. అది వేమగిరియను వాడుకయై యున్నది'' అని గలదు. వేమారెడ్డి నిర్మించిన గ్రామము కనుక వేమగిరియైనది. ఇటీవల చాళుక్యుల కాలమునాటి బంగారు నాణెములు దొరికినవి.

కృష్ణదేవరాయల దండయాత్రను వర్ణించుచు — పెద్దన ''గనకగిరి స్ఫూర్తి గరచె గౌతమి గ్రాచె'' అని వేమగిరిని కనకగిరిగా వర్ణించియున్నాడు.

కాటన్ దొరగారు ధవళేశ్వరము అక్విడెట్‌ను నిర్మాణము చేయించినపుడు వేమగిరిలోని కొండపై నివసించినట్లును-అచ్చట నుండి ప్రతిరోజు గుఱ్ఱముపై స్వారి చేయుచు ధవళేశ్వరము వెళ్లెడి వాడని ఇక్కడ పెద్దల కథనము. వేమగిరికొండకు వెనుకనున్న ఒక విశాలమైన కొండపై—పునాదుల వరకు మిగిలియున్న ఒక కట్ట డము మిగిలియున్నది. అచటనే—కాటన్ దొరగారు నివసించినట్లు ప్రతీతి. దీనికి సమీపములోని గ్రామమే కేసవరము.

## కేసవరము – నామ ప్రాముఖ్యము

తూర్పు గోదావరి జిల్లాలో-పూర్వపు రామచంద్రపురం తాలూకా, నేటి ఆలమూరు తాలూకాలో—ఒక కేసవరమును దాని ప్రక్కనున్న రాజమండ్రి తాలూకాలో ఒక కేసవరమును గలవు. ఈ రెండింటికి తేడా తెలియుటకు ''కోట'' సమీపములోని గ్రామ మగుటచే — కోటకేసవరము క్రమముగా — కోటికేశవరముగా మారి పోయినది, అనియు—వేమగిరి సమీపములోని — కేసవరమును (నేటి ఆలమూరు తాలూకా) దండుకేసవరమనియు నందురు.

వేమగిరికి ''దండ''గా నుండుటచే దండకేసవరమయి క్రమ ముగా —దండుకేసవరమయి యుండును. పూర్వము ఒక దండు ఈ గ్రామముపై రాగా—వారిని ఎదుర్కొని వెడలగొట్టుటచే దండు కేసవరమయ్యెననియు, దండు అనగా సేనలుండుటచే — దండుకేస వరమయ్యెననియు ప్రజలు దండుగా=సమూహముగా నేర్పడుటచే దండుకేసవరమయ్యెననియు చెప్పదురు.

సామాన్యముగ - కోటలు, దుర్గములకు సమీపమున—కేసవర మని కాపవరమని గ్రామములుండును. కాపవరమనగా—రాజ్య(కోట) రక్షణ కవసరమైన రక్షకబలముండు గ్రామము. కేసవరమనగా— కేసరులవంటి వీరులుండెడి గ్రామము. వేమగిరి దుర్గము— కోటరక్షణ కవసరమైన దండు ఉండుటచే కేసవరమని పేరు వచ్చెను. దండుగల కేసవరము గాన దండు కేసవరమయ్యెను ఈ కేసవరమే మా పరిశోధనా గ్రామము.

## కేసవరము – ప్రాచీన చరిత్ర

ప్రాచీన చరిత్రను తెలిసికొనుట కుపయోగించువానిలో దేవా లయములు ముఖ్యములు గాన—వానిని పరిశీలించుదము. ఈ గ్రామ ములో మనకు కన్పించు దేవాలయములు ప్రాచీనమైనవి—ముఖ్యమై నవి రెండు గలవు. అందులో మొదటిది - శ్రీ భద్రకాళీసహిత వీర భద్రేశ్వరస్వామివారు. నారద మహర్షిచే ప్రతిష్ఠితమైనదని ప్రతీతి.

ఈ దేవాలయము అతి ప్రాచీనమైనది చాళుక్యుల కాలము నాటిది. గర్భగుడి—అంతరాళము—మండపములతో గూడినది. అనేక మారులు పునర్నిర్మాణములు జరిగినవి. 1938లో సామర్లకోట వాస్తవ్యులు బాగుచేయించినట్లు తెలియుచున్నది.

ఇందు శ్రీవీరభద్రేశ్వరస్వామివారి లింగము అడుగున్నరవరకు నుండును. అంతరాళము గోడకు, సప్తమాతృకలలో నాలుగు విగ్రహ ములు సున్నముచే కప్పబడియున్నవి మిగిలిన మూడును మండప ములోనున్న గోడకు నున్నవి. పునర్నిర్మాణములలో ఇవి చెదిరి యుండును ఇక్కడ—అంతరాళములోనికి ప్రవేశించు గుమ్మమునకు ఎడమవైపున 2 అడుగుల ఎత్తుగల వినాయకుని విగ్రహము గలదు. భద్రకాళీ విగ్రహము సుందరముగ నున్నది.

ఆ విగ్రహము ప్రక్కనున్న గోడకు కుమారస్వామి విగ్రహము కడు మనోజ్ఞముగా నూతనమైన రీతిలో గలదు. పాము శరీరము చుట్టబెట్టుకొనగా—పైన అయిదు పడగలక్రింద కుమారస్వామి కలడు. దాని ప్రక్కన సప్తమాతృకలలోని 3 విగ్రహములు (1/2 అడుగు) కలవు. కుడివైపు గోడపై కాలభైరవుని విగ్ర హము దిసమొలతో గలదు. గర్భగుడికి వెలుపల గోడకు బుద్ధుని విగ్రహము గలదు.

పూర్వమిచట చాల శిలాశాసనము లుండెడివనియు — వానిని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వచ్చినపుడు పరిశీలించుటకు గొనిపోయిరనియు పెద్దలుచెప్పిరి. ఇప్పటికిని తెలుగులిపి సంస్కృత భాషలో శిలా శాసనమొకటి రాళ్లలో గలదు. ఆధునికమువలె దోచు చున్నది.

మాఘ బహుళ ఏకాదశికి శ్రీ స్వామివారికి కళ్యాణము జరు గును. కృష్ణాష్టమి—కార్తీక పూర్ణిమ—విజయదశమి—ముక్కోటి ఏకాదశి—శివరాత్రులకు గ్రామసేవలు గలవు. ఈ గ్రామములోని దేవాలయముల నిర్వహణకు, దేవాదాయ ధర్మాదాయ శాఖవారి కార్య నిర్వాహకాధికారి గలరట.

సుమారు శతాబ్దముక్రిందట ఆగమశాస్త్ర పండితులు, శివా ర్చకులు అయిన శ్రీ ఎలమంచలి పేరయ్యశాస్త్రిగారు నేటి గుడి లోని శివలింగము పైభాగము పగుళ్లు ఏర్పడగా మరియొక శివ

లింగమును తెప్పించి ప్రతిష్ఠకు సన్నాహములు చేసిరి. శ్రీ స్వామి వారి కళలను తీసివేసి లింగమును లాగివేయుటకు త్రవ్వుట ప్రారంభింపగా ఎంత త్రవ్వినను చివర కనబడలేదట. ఇంక త్రవ్వుటకు శక్యముకాక ఆ లింగమునకే కళాన్యాసము గావించి యధావిధిగ అర్చనాదులు గావించిరి.

చేయునదిలేక క్రొత్తగా తెచ్చిన శివలింగమును చెరువు గట్టున నుంచగా ''పెద్దాడ'' గొనిపోయి ప్రతిష్ఠించిరట.

## కామాక్షీదేవి ఆలయము

శివాలయమునకు ప్రక్కగా కామాక్షీదేవి ఆలయము గలదు. ఈ ఆలయ నిర్మాణము అతి ప్రాచీనమైనది. చోళ—చాళుక్యరీతులు ఈ నిర్మాణములో గోచరించును. గర్భగుడికి వెలుపల అయిదు గూడులు పెద్దవి గలవు. ఇందు పూర్వము విగ్రహము లుండెడివి. నేడవి పోయినవి.

పెద్దాపురము శ్రీవత్సవాయి వారికాలములో అచట నొక నరసింహస్వామివారి ఆలయముండెడిదట. ఆ స్వామికి వత్సవాయి నరసింహస్వామి యనిపేరు. దుర్మార్గులు కొందరు వస్తువాహనములను దోచుకొనుచు—విగ్రహమును ముక్కలుచేసి ముత్యాలమ్మ గుడిదగ్గర పడవేసిరి. నేటికి ఆ ముక్కలలోని కొన్ని అచట కన్పించుచున్నవి.

పూర్వము—కాలువ కవతలవరకు గ్రామము వ్యాపించియుండుటయేగాక మరికొన్ని గ్రామములుండెడివి. అందులో నొక దానిలో కంసాలులు 360 కుటుంబాలు నివసించువారు. వారందరు ఇనుప పని మున్నగునవి చేయువారు. దానికి తూర్పున చిట్టాలమెట్ట గలదు. ఇనుము కరిగింపగా వచ్చిన రద్దును అక్కడ పోయుటచే ఆ పేరు వచ్చెనందురు.

వారందరు గలిసి ఖాళీగానున్న ఆలయములో కామాక్షీదేవి బంగారు విగ్రహమును ప్రతిష్ఠచేసి నిత్యార్చనలు చేయించువారు. దినమునకొక్కొక్కరు గ్రామమునకంతకు సంతర్పణలు చేయువారు. సంవత్సరమున కొకసారి వంతు వచ్చెడిది. ఇట్లు జరుగుచుండగా దుర్మార్గులు కొందరు ఆ బంగారు విగ్రహమును నెత్తుకుపోవ తలంపగా ఆ దేవి స్వర్ణవిగ్రహము తనంతటతాను లేచి జేగురు పాడులో నున్న నూతిలో పడిపోయినది. ఆ నూయి ఇప్పటికిని జేగురుపాడులోని పాయిఖానాలో మధ్యగా నున్నది.

తరువాత కంసాలులు ఇప్పుడున్న శిలావిగ్రహమును ప్రతిష్ఠ చేయించిరట. విగ్రహము సుమారు అడుగున్నది. బహు సుందరముగా చక్కని శిల్పముతోనున్నది.

ఈ గుడికి ఎదురుగా నంద్యాలవారి నుయ్యిగలదు. దానినే నందివారి నుయ్యి అని పిలిచెడివారట. అందలి నీరు చాలరుచికరముగా నుండుటయేగాక ఆ నీరు త్రాగినవారికి మిగిలినవారు సమాధానము చెప్పలేకపోయెడివారట. ఈ బాధ పడలేక దరిమిలా ఆ నూయి కప్పివేసిరట.

ఈ సమీపములో గల చెరువులో వరహాలదిబ్బ గలదు. అక్కడ అనేక విగ్రహా అవశేషాలు కన్పించునట. రోడ్డు ప్రక్కనగల చెరువునకు వత్యల చెరువని పేరు. పెద్దాపురం వత్సవాయివారు త్రవ్వించిరట. ఏనుగు లక్ష్మణకవి రామవిలాసములో—

మ॥ నిధి నిక్షేప తటాక దేవగృహముల్ నిర్మించెననియు

విశ్వనాధకవి శేషధర్మములలో—

సీ॥ నలరించె బ్రచురతో యప్రపూరిత తటా

కము సర్వజంతూప కారకముగ—అని వర్ణించెను.

ఈ సమీపములోనే శ్రీదేవీ భూదేవీ సహిత కేశవస్వామివారు గలరు. ఈ ఆలయ నిర్మాణము ఆధునికము. కుడిచేత పద్మము అభయహస్తము ఎడమచేతితో—గద పట్టుకొని యుండును. ఇటువంటి విగ్రహము చాల అరుదుగా కన్పట్టును. మాఘశుద్ధ ఏకాదశికి కళ్యాణము జరుగును.

బొమ్మూరు మెట్టనుండి ఈ గ్రామముగుండ పోవు ఒక గుహ కలదట. ఆ మెట్టపైనున్న గుహ పై భాగమున కాశీకేరాస్తా అని వ్రాయబడి యున్నదట. దరిమిలా ఆ గుహలో పశువులు పడుచుండుటచే దానిని రాళ్లతో కప్పివేసిరి. ఈ గుహ అక్కడనుండి కేసవరము మీదుగాపోవుటచే గుహ పై భాగమున గొట్టిన, లోపల గుల్ల అగుటచే దబ్—దబ్మని ధ్వనివచ్చును. ఈనాడా ప్రాంతమంతయు గ్రామము వెలసినది.

పూర్వము గ్రామము కాలువ అవతల వరకు నుండెడిది. గ్రామమునకు మధ్యగా కాలువ యేర్పడుటచే క్రమముగా నివతలకు పెరిగిపోయినది. ఈ గ్రామములోని గ్రామదేవతలు—మహాలక్ష్మి అమ్మవారు, గంటాలమ్మవారు, దండి గంగమ్మవారు—ముత్యాలమ్మవారు. ఈ దేవాలయము లన్నియు ఆధునిక నిర్మాణములు. కాని అమ్మవార్లకు శిలా విగ్రహములుండుట అపూర్వము.

పూర్వము గ్రామమునకు నాలుగువైపుల అమ్మవారి దేవాలయము లుండియుండును. కాలువ ఏర్పడిన తరువాత గ్రామము మారిపోవుటచే అందులో ముత్యాలమ్మవారు రోడ్డునకు ప్రక్కగాను మిగత అమ్మవార్లు గ్రామమునకు మధ్యగాను గలరు. పూర్వపు గ్రామమునకు ఇంచుమించుగా నవియే సరిహద్దులు.

మహాలక్ష్మి అమ్మవారి గుడి వెనుక—ముందు పోతురాజుగా పూజింపబడుచున్న శిలాస్తంభములపై ఒక వీరుడు చేతితో కత్తి ఎత్తిపట్టుకొనగా, ఒక చేతితో క్రిందకు గద పట్టుకొని నిల్చుండెను. ఆ స్తంభముపై ఒకవైపు సూర్యుడును, మరియొకవైపు చంద్రరేఖయు గలదు. ఇటువంటిదే ముత్యాలమ్మవారి గుడి వెనుక నొకటి కలదు. ఇవి ఆ గ్రామమునకు ప్రాచీన చిహ్నములు. కాటయ వేమారెడ్డి కాలమునాటి శిలాస్తంభములపై వైష్ణవ మత చిహ్నములగు శంఖ చక్రములు కన్పించును. ఇవి చాళుక్యుల కాలమునాటివి కావచ్చును.

## గని పోతురాజు – గండి పోతురాజు

వేమగిరి చుట్టును జలదుర్గముండెడిది. గోదావరికి గట్టు యేర్పడి కాలువలు త్రవ్వించుటచే ప్రవాహములు మారిపోయినవి ఆ జలదుర్గము ప్రదేశములన్నియు మెరకయ్యె కొన్ని పొలములుగను కొన్ని చెరువులుగను మారినవి. కేసవరము కొండల ప్రక్కనున్న చెరువునకు తూములు నిర్మించిరి. ఆ తూములు కట్టునపుడు మేస్త్రీ సర్వాకారముగ గీతలు గీసెను. ఆ తూములు గండిపడి కొట్టికొని పోయెను. మరల తూములు కట్టబడినవి. ఇరుకైన ఆ తూములకడ ధ్వని చేసిన ప్రతిధ్వని వచ్చెడిది. అక్కడ పోతురాజు పలుకుచున్నాడని ప్రజలు పూజించువారు.

ఆ తూములు ఎన్నిసారులు కట్టినను కొట్టుకొనిపోవుచుండెడివట. మరల కట్టుచుండగా ఒకనాడు ఒక బాలుడు చూచుటకు రాగా ఆతనిని తూములలో వేసి కట్టివేసిరట. ఆ తూములు మరి చెదిరిపోక అట్లేయుండెను. అక్కడ ఆ బాలుని పిలిచిన 'ఓ'యని పలుకువాడట. మరికొంత కాలమునకు పలుకుట మానివేసెను. గండి పడకుండ కట్టుటలో తోడ్పడినందున గండి పోతురాజను పేరుతో చెరువుగట్టున పూజింపబడుచున్నాడు.

అది కూడ మహలక్ష్మి అమ్మవారి గుడివెనుకనున్న పోతురాజుగా పిలువబడుచున్న శిలావిగ్రహమువంటిదే. కాని చిన్నది. రాయి అడ్డముగా త్రిప్పి చెక్కిరి. దీని వెనుక సుబ్రహ్మణ్యస్వామి విగ్రహము–స్త్రీ పురుష విగ్రహములు కలవు. స్త్రీ పురుష విగ్రహములను పార్వతీ పరమేశ్వరులుగా పిలుతురు.

అమ్మవార్లలో గంగమ్మ అమ్మవారికి తప్ప మిగిలిన అమ్మవార్లకు శిలావిగ్రహములు కలవు. ఈ స్త్రీ విగ్రహము ఆ అమ్మవారిది కావచ్చును. అది చెదరి చెరువుగట్టును చేరి పార్వతీ అమ్మవారుగా సేవలు పొందుచున్నది.

ఈ సమీపమున సుబ్రహ్మణ్యస్వామివారి విగ్రహము పడియుండగా దానిని పందలపాక గొనిపోయిరట.

శ్రీ పెదపాటి మంగయ్యగారు జనవరి 13 లగాయితు ఇచట అయిదు రోజులు తీర్థము ఏర్పాటుచేసి ప్రచారము చేసిరి. ఆ తీర్థమువలన రూ. 5 00/–లు ఆదాయము వచ్చుచున్నది. నిత్యము జనము వచ్చి పోతురాజును సేవించుకొని పోవుచుందురు. ఇచట గుడిలేదు. ఆరుబైటయే విగ్రహములు గలవు. ఎవరికి వారు పూజించుకొనవచ్చును. నిత్యము రద్దీగానుండును.

మా పరిశోధనలో సేకరించిన ముఖ్యవిషయము లివి. ఈ విషయ సేకరణములో నాతో సహకరించిన శ్రీ జోగావఝుల వీరవెంకట సోమసూర్యంగారికి, కేసవరం సిద్ధాంతిగారైన శ్రీమాన్ శ్రీ అత్తిలి విజయవేంకట జనార్దనాచార్యులుగారికి, గ్రామస్థులకు మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

గోదావరీ మండల చరిత్రవాను గ్రంథముకొఱకు ఈ విషయము సేకరింపబడుచున్నది గాన ఇందలి దోషాదోషములను మా మండలి దృష్టికి తెచ్చిన సవరించుకొందుము. ఇంతకంటెను ప్రత్యేకమైన విషయములు సమాచారము తెలిసినవారు మాకు తెలియజేసిన కృతజ్ఞతతో స్వీకరింతుము.

గోదావరి మండలము—చరిత్ర పరిశోధకులందరకు చారిత్రకులకు ఈ గ్రామము పరిశీలింపదగియున్నది. మాకున్న స్వల్పవ్యవధిలో కొంతవరకే సమాచారమును సేకరించి వెలుగులోనికి తెచ్చితిమి. భావి చారిత్రక పరిశోధకులు మిగిలిన సమాచారమును సేకరించి ప్రచారములోనికి తేగలందులకు ప్రార్థించుచు ఇంతటితో నీ విషయమును ముగించుచున్నాము.

సర్వేజనాః సుఖినోభవంతు
ఓం శాంతిః శాంతిః శాంతిః
**ఓం తత్సత్.**

శ్రీ భద్రకాళీ సహిత వీరభద్రేశ్వరార్పణమస్తు
శ్రీ భూదేవీ సహిత కేశవార్పణమస్తు.

*శ్రీ గుండు విఘ్నేశ్వరశాస్త్రి*

# పద్మ వ్యూహమున ప్రవేశించిన అభిమన్యుడు బాలుడు - అయిన నాటికి అభిమన్యుని వయస్సెంత ?

కురుక్షేత్ర మహా సంగ్రామమున పదమూడవ నాటి యుద్ధమున ద్రోణాచార్యుడు పద్మవ్యూహము నేర్పరచెను. అర్జునుని సంశప్తకులతో యుద్ధము చేయుటకు దూరప్రదేశమునకు తీసికొనిపోయిరి. పాండవులలో పద్మవ్యూహమున ప్రవేశించుటకు అర్జునుడు మాత్రమే నేర్పరి. మిగిలిన వారశక్తులు. గర్భస్థ శిశువుగనున్న అభిమన్యుడు మొగ్గరము ప్రవేశించు నేర్పు మాత్రమే తండ్రి వలన వినినాడుగాని తిరిగి వ్యూహము నుంచి బయల్వెడలు మార్గము దెలిసికొనలేదు. ఆనాటి యుద్ధమున కేర్పరుచబడిన మొగ్గరమున బ్రవేశించు నేర్పరులు తమపక్షమునందులేనందున ధర్మజుడు విచారగ్రస్తుడయ్యెను. పెదతండ్రికి అభిమన్యుడు, తాను మొగ్గరమున బ్రవేశింతుననియు, తనవెంట భీమసేనుడు మొదలగు వీరులు ప్రవేశించి తనకు సహాయమొనరింప గలరనియు ధైర్యము చెప్పి మొగ్గరము బ్రవేశించి శత్రువీరులను తుత్తునియలు జేసి, శత్రువుల చేతిలో అధర్మముగ ప్రాణములు కోల్పోయెను.

పలువురు, బాలుడయిన అభిమన్యుని అధర్మముగ వధించిరని పలికెడి పలుకు. అభిమన్యుడు బాలుడు. అయిన పద్మవ్యూహమున మరణించిన అభిమన్యుని వయస్సెంత యనునది పరిశీలనాంశము.

"యుధిష్ఠిర భీమార్జున యములుం గ్రమంబున దొల్లి
షోడశ పంచదశ చతుర్దశ త్రయోదశ వర్షజాతులయి
శత శృంగంబున నుండి హస్తిపురంబునకు వచ్చి యందు
గౌరవులం గలసి యస్త్ర విద్యలం గఱచుచుం బదు మూడేండ్లుండి
యపుడు ధృతరాష్ట్రుని యోగంబున వారణావతంబునకు
జననీ సహితంబుగ బోవ సమకట్టి ... ..."

— ఆదిపర్వము షష్ఠాశ్వాసము 142 వచనము

ధర్మరాజునకు 16 సం. లు, భీముడు—15 సం. అర్జునుడు—14 సం. నకుల సహదేవులు 13 సం.లు. వయసున శతశృంగము నుండి హస్తినాపురమునకు వచ్చిరి.

హస్తినాపురమున పదమూడేండ్లుండి అస్త్ర విద్యల నేర్చెను. ధర్మరాజు-16+13=29 సం. భీముడు 15+13=28 సం. అర్జునుడు—14+13=27 సం. నకులసహదేవులు—13+13=26 సం. లు.

"లక్కా గృహదాంబు వలన నష్టయులై జననీ సహితంబుగా
వనంబునకు జని ... ... ద్రౌపదీ స్వయంవరము
తరువాయి ద్రుపద పురంబున నొక్క సంవత్సరమున్న .."

— ఆదిపర్వము 3—15 వచనము

ధర్మరాజు — 29+1=30; భీముడు — 28+1=29 సం; అర్జునుడు 27+1=28 సం; నకులసహదేవులు—26+1=27 సం. లు.

"దుర్యోధనాదులతో గలసి యెప్పటియట్ల రాజ్య విద్యా
వినోదంబుల నేను సంవత్సరంబు లుండునంత"

— ఆదిపర్వము 8—64.

ధర్మరాజు 30+5=35 సం; భీముడు 29+5=34 సం.లు; అర్జునుడు=28+5=33 సం.లు; నకులసహదేవులు-27+5=32 సం. లు.

అప్పటికి అభిమన్యుడుపుట్టి అన్ని విద్యలూ నేర్చియుండెను. మాద్రేయులకు అభిమన్యునకు ఇరువది సంవత్సరముల అంతరము గలదు. కావున అభిమన్యునకు పన్నెండు సంవత్సరముల వయస్సయి యుండవచ్చును.

"మరియు ద్రోణుండు పాండవులకు నెయ్యుండయ్యును
దొల్లి యాజోపయాజుల వరంబున నగ్ని కుండంబున
నుద్భవిల్లిన ద్రుపదాత్మజుండు ధృష్టద్యుమ్నుండు
పాండవ సంబంధియయి ప్రతివీరుండగుట నాతనితో
దనకు సమరం బగునని యెరింగి పాండవానుగమనంబు
సేయనొల్లక గజపురంబున ధృతరాష్ట్రు నొద్దనయుండె.

నిట్లింద్రప్రస్థపురంబున నిరువది మూడేడులు రాజ్యంబుసేసి పాండవులు పాప ద్యూత పరాజితులయి—''

– సభా. 2-317

ఇంద్ర ప్రస్థమున పాండవులు 23 సంవత్సరములు రాజ్య పాలనను నెరపి ద్యూతమున పరాజితు లగుదురు.

కావున ధర్మరాజు– 35+23=58 సం. లు; భీముడు– 34+23=57 సం. లు; అర్జునుడు–33+23=56 సం.లు; నకుల సహదేవులు–32+23=55 సం.లు. ఇప్పటికి అభిమన్యుని వయస్సు–35 సం. లు.

పాండవులు పాప ద్యూతమున యోడి యేర్పరచుకొనిన నియమములు ననుసరించి పదురెండ్రేడులు అరణ్యావాసము,ఒకయేడజ్ఞాత వాసము నెరపిరి.

అరణ్యావాసము12సం.+1సం.అజ్ఞాతవాసము=13సం.లు. అప్పటికి ధర్మరాజు 58+13=71 సం లు; భీముడు–57+13=70 సం.లు; అర్జునుడు –56+13=69 సం. లు; నకుల సహదేవులు–55 + 13=68 సం. లు.

తిక్కన కర్ణ, అర్జున, దుర్యోధనులకు నెరసిన వెంట్రుక లనే వర్ణించెను కర్ణుడు ధర్మజునకన్న అధమము పదేండ్లు పెద్ద. యుద్ధ కాలమునాటికి భీష్ముడు వంద సంవత్సరములకు పైబడిన వయస్సు గలవాడు· కర్ణుడు 81 సంవత్సరముల ప్రాయము, ధర్మజుడు 71 సం. లు, భీముడు 70 సం. లు, అర్జునుడు 69 సం. లు, నకుల సహదేవులు 68 సం.లు. భీమదుర్యోధనులు ఒకే గురువు బలరామదేవుల యొద్దగదా విద్యను నేర్చిరి. ఇరువురు ఒక యీడువారు. యుద్ధమునాటికి వీరి వయస్సు 70 సం.లు.

ద్రోణుడు సర్వ సైన్యాధిపత్యము వహించిన పిదప దుర్యోధనున కిచ్చిన మాట ప్రకారము ధర్మజుని ప్రాణములతోబట్టి రారాజున కర్పించుటకు తన మూడవ రోజున యుద్ధమున పన్నిన పద్మవ్యూహములో ప్రవేశించిన అభిమన్యుని వయస్సు 48 సం. లు.

71 సం.ల వయసులోని ధర్మజుని దృష్టిలో 48 సం.లు వయస్సు గల్గిన అభిమన్యుడు బాలుడే

శ్రీ ఆ వెం. పానకేశ్వరరావు

# అప్పయ్య దీక్షితులు - ఉన్మత్త పంచాశత్

అద్వైత తత్వవేత్తలలో అప్పయ్య దీక్షితులు సుప్రసిద్ధులు. గౌడపాదులు, శంకరుల తరువాత అంతటి వైదుష్యముకల్గిన బ్రహ్మవిద్యానిష్ణాతులు. క్రీ. శ. 1550–1625 మధ్య జీవించిన దీక్షితులు పెక్కు భాష్యాలు, వ్యాఖ్యానాలు, స్తోత్రాలు రచించారు. అమలానందుల 'కల్పతరువు'పై దీక్షితులవారి 'పరిమళ' కృతి ఉత్కృష్టమైన భాష్యంగా విద్వాంసుల మన్నన లందుకొన్నది. పరిమళ భాష్య రచనతో దీక్షితులవారికి అద్వైత స్థాపనాచార్య బిరుద మివ్వబడింది. వీరి, న్యాయరక్షామణి, సిద్ధాంతలేశ సంగ్రహ అను గ్రంథములు వేదాంత విద్యార్థులందరికీ అవశ్య పఠనీయములు. అద్వైత తత్వబోధకులైన దీక్షితుల రు శ్రీవైష్ణవ, మధ్వ సంప్రదాయమునకు చెందిన పెక్కు గ్రంథములను రచించారు. వేదాంత దేశికుల యాదవాభ్యుదయముపై దీక్షితులు భాష్యము రచించారు. పాశుపత సంప్రదాయ ప్రవర్తకుడైన శ్రీకంఠుని రచనలపై 'నయమణిమాల' వ్యాఖ్యను, నయమంజరిలో అద్వైతతత్వ వైశిష్ట్యాన్ని, నయమయూఖ మాలికలో రామానుజుల మత తత్వాన్ని, న్యాయముక్తావళిలో మధ్వసిద్ధాంతాన్ని గురించి విపులంగా రచించారు.

మహాపండితులైన అప్పయ్య దీక్షితులు రసప్లావితములైన పెక్కు శ్లోకాలను రచించారు. దుర్గాచంద్ర కళాస్తుతి, ఆదిత్య స్తవరత్నము, వరదరాజస్తవము, ఆత్మార్పణస్తుతి ప్రసిద్ధమైనవి. ఆత్మార్పణస్తుతినే ఉన్మత్త పంచాశత్ అని వ్యవహరిస్తారు. ఉన్మాదావస్థలో రచించిన యాభై శ్లోకాలుగల 'ఉన్మత్త పంచాశత్' శ్లోకాల వెనుక స్వారస్యమైన ఒక కథ వుంది.

దీక్షితులు పరమాత్మపట్ల తమకున్న ప్రగాఢ విశ్వాసాన్ని పరీక్షించుకోదలచారు తమ మనస్సును అన్ని నియమ నిబంధనల కతీతంగా స్వేచ్ఛగా వుండనివ్వవలెనని భావించారు. ఉమ్మెత్త మొక్కరసానికి వున్మాదం కల్గించే శక్తి వుందని తెలిసిన దీక్షితులు శిష్యులను పిలిచి, తాము ఉమ్మెత్తరసాన్ని పూర్తిగా సేవించిన తర్వాత తమ చర్యల నన్నిటినీ గమనించవలసినదనీ, తమ నోట వెలువడే ప్రతి అక్షరాన్ని వ్రాసి వుంచవలసిందనీ ఆదేశించి ఉమ్మెత్త రసాన్ని త్రాగారు. కొంతసేపట్లోనే దీక్షితులకు చిత్త విభ్రమం కలిగింది. నిర్మలమైన వారి మనసు మాత్రం ఎట్టి వికారానికి గురికాలేదు. వారి నోటినుండి ఒక అపశబ్దము కాని, అపశృతి కాని వెలువడలేదు. సుమధుర గాత్రంతో రస నిష్యందములైన యాభై శ్లోకాలు ధారాపాతంగా వెలువడ్డాయి. అవే 'ఉన్మత్త పంచాశత్'అన బడే ఆత్మార్పణ శ్లోకాలు.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ప్రజాకవి

ఈమధ్య 'ప్రజాకవి' మాటమీద చర్చ జరుగుతోంది· సంతోషం. ఒకప్పుడు కామశాస్త్రం రాయాల్సివచ్చినా 'దేవుడి'ని తప్పించి రాయలేక పోయేవారని అనుకుంటే ఇప్పుడు చాలామంది తమ కవిత్వానికి గాని, విమర్శకి గాని 'ప్రజల' పేరుని ఆలంబనంగా వాడుకుంటున్నారు.

సాహిత్యంలో వస్తువుకి సంబంధించిన 'ఫాషన్'లు మారుతూ ఉంటాయని గుర్తుచేసుకోవటం మంచిది! అయినప్పటికీ ఒక విశ్వనాథ సత్యనారాయణగారో, ఒక కాజాన్ట్సాకిస్సో, ఒక (టి. ఎస్.)

ఎలియెట్స్, ఒక టాగూరో వాళ్ల 'దైవానుభూతి'లాంటి దానిని దేనినో గురించి ఇప్పటి కాలంలోనూ రాస్తూనే ఉంటారు. అవి వారి కవిత్వం గొప్పతనానికి అడ్డురావు.

ప్రస్తుతం రాజకీయ ప్రచారంలో బాగా వినిపించే కొన్ని భావాలని గురించి రాసినంత మాత్రాన అది కవిత్వం కాదు. కవిగ గుర్తింపబడిన వ్యక్తి ఇలాంటి వాటిని వస్తువుగా స్వీకరించినట్లయితే 'ప్రజాకవిత్వం' పుట్టినట్లు అనుకోవాలని కొందరి నమ్మకం అయి ఉండవచ్చు. అది కేవలం వారి నిర్వచనమే అని ఇతరులు వాదించినా ఎవరు కాదనగలరు?

"దేవుడికి దణ్ణం పెడితే రానివి రాజకీయ–ఆర్థిక సిద్ధాంతాలని కొన్నిటిని సృష్టించినవారి స్తుతితో రావచ్చు, కష్టపడేవారి కష్టాలని ఎత్తిచూపటమే ఒక గొప్పతనం," అనుకుంటే, అంటే పెద్దగా 'వ్యాఖ్యానించటం' కష్టమే. చర్చ కవిత్వాన్ని గురించికాక 'నీతి'మీదకి మళ్లిస్తున్నారని మాత్రం అనాలి.

కొంతకాలం కింద కొందరు చీనా పింగ్ పాంగ్ ఆటగాళ్లు పోటీలలో గెలిచి, తమ విజయానికి కారణం కీ. శే. మావ్ట్సె టుంగ్ సూక్తులు చదవటమే అన్నారుట. ఇంకెవరో సోషలిస్టు సమాజాలలో వాహనాల ప్రమాదాలే ఉండవన్నారుట. ఒక పెద్ద నియంత చనిపోయిన పిదప ఆయన శవాన్ని దర్శనంకోసం భద్రపరిచిన వారు అచిరకాలంలోనే శవాన్ని తొలగించారు. [శవంముందు పెళ్లిళ్లు చేసుకోవటం, శవానికి పుష్పాలు అర్పించటంవంటి పద్ధతులు మాత్రం ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి అక్కడ.] ఇలాంటివి ఎన్నో చెప్పవచ్చు. కాని, ఎవరో ఒకాయన జబ్బుచేస్తే దేవుడి దయ కావాలన్నంత మాత్రాన ఆయన 'ప్రజాకవి' కాడనటం బాగాలేదు!

ప్రజాకవులుగా పొగడబడేవారు [కొందరిచేతనే అయినా] స్విన్ బర్న్, పో, జెనె, రింబోలాంటి వాళ్లని మెచ్చుకుంటూ ఉంటారు. ఎందుకో!

కృష్ణశాస్త్రిగారి కవిత్వంకన్నా సుమతీశతకం నీతే కొందరికి ఇష్టంగా ఉంటుంది. అది అంతే! కాని, ఇదంతా చూస్తూఉంటే మా ఇంజనీరు స్నేహితుడు ఒకాయన అన్నమాటలు జ్ఞాపకం వస్తూ ఉంటాయి: "లలిత కళలవల్ల ఒరిగేదేమిటండీ! ఫాక్టరీలూ, ప్రాజెక్టులూ కావాలిగాని!" ఈయనే గుడికి వారానికి ఒక్కసారయినా వెడతాడు, జ్యోతిష్కుల అనుమతిలేనిదే ఏ పనీ చెయ్యడు.

*శ్రీ జి రామలింగం*

# పండితుడి మతము

నా వ్యాసాన్ని[1] "సొంతంగా శాంతంగాచదివి" శ్రీ ఒ. వి.[2] గారు "జవాబుగా కొంత" వ్రాశినందుకు కృతజ్ఞతాభివందనాలు. విమర్శ వల్లనే సత్యం నిగ్గు తేలుతుంది నేను కూడా "సొంతంగా శాంతంగా" చదివాను ఒకటికి రెండుసార్లు చదివాను. శ్రీ ఒ.వి. గారు నా వ్యాసాన్ని 'శాంతంగా' చదువలేదు. కనీసం 'సొంతంగా'నైనా చదువలేదు. చదివే ఉంటే చర్చ మరోతీరులో సాగి ఉండేది. ఇంతేకాదు వారు సత్యాన్వేషణ దృష్టితోకాక ఏదో దురభిమానం వల ఉత్తేజితులై వ్రాశారు. – ఇదీ నాకు కలిగిన అభిప్రాయం. ఈ తీర్చైన ఏమర్శ ఉత్తమ విమర్శకుని లక్షణం మాత్రం కాదని నా విశ్వాసం.

1) ప్రథమ ద్వితీయ ముద్రణల గూర్చి తిధి వార నక్షత్రాలు చూపుతూ శ్రమపడ్డారు. అనవసరం. నాలుగేండ్లు ముందైనా వెనుకైనా నేను ప్రస్తావించిన విషయానికి ఏ మాత్రం బాధాకరం కాదు.

2) శ్రీ ఒ. వి. గారిది తొందరపాటు స్వభావంలా ఉంది. ఎందుకంటే ముందూ వెనుకలు ఆలోచించకుండా బుద్ధికి తోచినట్లల్లా వ్రాశారు. విమర్శక చక్రవర్తులూ, పరిశోధక పరమేశ్వరులూ అయిన శ్రీనిడుదవోలు వెంకటరావుగారు[3] "పరిష్కర్తలకా సంప్రదాయములు తెలియకపోవుట చేత – నందును గొన్ని పొరపాటులు దొర్లినవి. ఒకప్పుడట్లున్నను నా గ్రంథములు పునర్ముద్రితము లైనపుడు వానిని సరిచేయుట తరువాతి వారు చేయదగినపని"[4] అని వ్రాసిన దానినే నేను యథాతథంగా 'ఇన్వర్టెడ్ కామాస్'లో ఎత్తిచూపి ఈవిధంగా వ్యాఖ్యానించాను. "పైవాక్యాలు శ్రీ రావుగారి పరిష్కరణ విధానాన్ని పట్టి చూపుతున్నాయి. శ్రీ కొమర్రాజువారు మొదలైనవారు శైవ సంప్రదాయములు తెలియనివారు. వారి వ్రాతలలో పొరపాటులు దొర్లినాయి. శ్రీ రావుగారిలాంటి తరువాతి విమర్శకులు వాటిని దిద్దవలసియున్నది. ఇంతవరకూ బాగానే ఉంది. కాని వారి వ్రాతలకూ చేతలకూ పొత్తు కుదరడం లేదు."[5] శ్రీ ఒ. వి. గారు ఇదంతా చదవలేదు. కనీసం క్రింద గీటుగల వాక్యాన్నైనా చూడలేదు. పైపెచ్చు నా వివరణలోని "శ్రీ కొమర్రాజు మొదలైనవారు శైవ సంప్రదాయములు తెలియనివారు" అన్న ఒక్క వాక్యాన్ని ఎత్తుకొని "తెలియని విషయాన్ని తెలిసినట్లుగా" వ్రాశానని ఆరోపించి తమ తెలియనితనాన్ని నిరూపించుకొన్నారు.

ఇదిలా ఉండగా శ్రీ కొమర్రాజు వారి ఆరాధ్యత్వం, వారికి పెద్దలిచ్చిన 'కితాబులు' నాకు తెలియవనుకొని కష్టపడి వివరించారు. నిజానికి తెలియనిది, తెలియవలసినది నాకుగాదు. శ్రీ ని.వే. గారికి.

3) "పై వ్యాసంలో వ్యాసకర్త ద్వితీయ ముద్రణ పీఠికా కర్త శ్రీ ని. వే. గారి వాక్యాలనుకొని ఎత్తి వ్రాస్తూ—" అని విమర్శించారు. నేననుకోవడం కాదు. అక్షరాలా అవి శ్రీ ని. వే. గారి వాక్యాలే. పీఠిక 86వ పుట తీసి చదివితే తెలుస్తుంది. చదవకుండా "ల. రా.[6] గారి వ్రాతలనే యథాతథంగా ఎత్తివ్రాసి చూపి అనుసరించిన ని. వే. గారు పెద్దలు కాలేదా ?" అంటూ దబాయింపు సెక్షన్ ప్రారంభించారు. ఇంతకూ శ్రీ ని. వే. గారు పెద్దలు కాదని నేనెప్పుడన్నాను ? ఎక్కడన్నాను ? నిజంగా ని. వే. గారు 'యధాతథంగా ఎత్తి వ్రాసి' తే 'ఇన్వర్టెడ్ కామాస్' లో

ఉంచాలి. నాకు తెలిసినంతవరకూ ఒకరివాక్యాలను మరొకరు 'ఎత్తి చూప' దలిస్తే ఇది సంప్రదాయం కాకపోతే అది గ్రంథ చౌర్య మౌతుంది. పీఠిక 86వ పుట చూడండి. పండితుడి వాక్యార్థాలకు తప్ప పండితుడ్ని గూర్చిన వాక్యాలకు ఎక్కడా 'ఇన్‌వర్టెడ్ కామాస్' లేవు. అలాంటప్పుడు అవి ని. వే. గారి వాక్యాలే అవుతాయి. వాటి నలాగే గ్రహించి విమర్శించాను. ఇంతకు ముందు నాది కాని అభిప్రాయాన్ని నాకు అంటగట్టారు. ఇప్పుడు ని వే. గారి వాక్యాలను వారివి కాదంటారు. అంటే ఏవి ఎవరివో గ్రహించే స్తోమత శ్రీ ఒ. వి. గారికి లేదన్నమాట అవి శ్రీ ల.రా. గారి వాక్యాలే అయితే వాటిని దొంగిలించి ''మసిబూసి మారేడుకాయ చేసి విద్వత్ ప్రపంచానికి చాటి చెప్పాలని'' తొలుత ప్రయత్నించినవారు శ్రీ ని. వే. గారు ద్వితీయులు వారిని బలపరచ జూచిన శ్రీ ఒ. వి. గారు. ఇంతాచేసి 'న్యాయమేనా ? సత్యాన్వేషణ ఇదేనా ?' అంటూ ప్రశ్నించారు. ఇదీ 'ఉల్టా చోర్ కొత్వాల్‌కో డాంటా'[7] అంటే.

అనుమానం అక్కరలేదు నిజంగానే నేను శ్రీ ల.రా. గారు పరిష్కరించిన ప్రథమ ముద్రణ చూడలేదు. చూడాలని కూడా అనుకోలేదు. ఇప్పటికీ అనుకోవడం లేదు. ఎందుకంటే నాకు శ్రీ ల.రా.గారితో పేచీలేదు. వారికి సంప్రదాయం తెలియదు. పొరపాట్లు చేశారు.[8] వాటిని సరిదిద్దేందుకు కంకణం కట్టుకొన్నారు సంప్రదాయం తెలిసిన శ్రీ ని. వే. గారు. తెలియనివారు చేసిన తప్పుకన్న తెలిసినవారు చేసిన తప్పు మరి ఘోరమైంది. శ్రీ ల. రా గారు పండితుడు ద్వైతియన్నారు అది తప్పు. అయితే దానినే తాము కూడా సమర్థిస్తున్నారు శ్రీ ని.వే గారు. కాబట్టి వారి వ్రాతలను పరామర్శించడమే నా ధ్యేయం.

4) పండితారాధ్య చరిత్రలోని ద్విపదను నేను బసవపురాణం లోనిదిగా ఉదహరించానని ఒక ఆరోపణ. నిజానికి అది శ్రీ ని వే. గారి పని.[9] వారి వాక్యాలను నావ్యాసంలో ఉద్ధరణ చిహ్నాల మధ్య వ్రాశాను. శ్రీ ఒ. వి. గారికి 'ఉద్ధరణ చిహ్నాలు' కనపడటం లేదు. కళ్ళద్దాలు మార్చుకోవాలి. లేదా వాటి అర్థం తెలియడం లేదు తెలిసినవారి నడిగి తెలుసుకోవాలి. అప్పుడు ''అవునా కాదా అనే జటిల సమస్యలను లేవనెత్తడానికి అర్హులు కారని చెప్పడానికి ఆగి'' ఉండేవారు.

5) చాలా దూరం వచ్చాక శాస్త్ర చర్చ ప్రారంభించారు. శుభం భవతు ! కాని ఇంతకు ముందే 'శంకర శాస్త్రిగారే కావాలి' అన్నారు. అంతలోకేమరచి తామే ప్రారంభించారు. రెండు 'పేరా'లు దాటకుండానే అర్హత ఊడి పడింది. అయితే వారు కాస్త 'ఆగి' తీరాలి. 'శివతత్త్వసారం — శివాద్వైత సంప్రదాయం' అనే పేర వ్యాసం వ్రాస్తున్నాను. దానిలో శ్రీ ఒ. వి.గారు సెలవిచ్చినట్లుగా 'శాస్త్ర చర్చ మరో తీరులో నడుస్తుంది. అది వ్యక్తి ప్రధానంగా కాకుండా యుక్తిప్రధానంగ ఉంటుంది.'[10]

పేరా కూడా పూర్తికాలేదు. అప్పుడే గాడి తప్పారు ఒ. వి. గారు. ''దీనినిబట్టే ల.రా గారు మల్లికార్జునుడు ద్వైతియని భావించారు ఇతరులు వారి భావాలను తర్కించకుండా తల ఊపారు'' అన్నారు. హతోస్మి! తల ఊపడం—అదీ తర్కించకుండా ఊపడం—గంగిరెద్దు లక్షణం. శ్రీ ల రా.గారి భావాల్ని అంగీకరించిన 'ఇతరులు' గంగిరెద్దులనే సాహసం నాకు లేదు. శ్రీ ఒ. వి గారి కున్నదేమో నాకు తెలియదు 'ఆల్‌రైట్ !' అంగీకరించినవారు గంగిరెద్దులు మరి ఒకసారి అంగీకరించి మరోమారు తిరస్కరించినవారో ?

6) శ్రీకంఠ భాష్యాన్ని గూర్చి శ్రీ ని. వే. గారు ఇలా వ్రాశారు ''బ్రహ్మ సూత్రములకు శ్రీ శంకరాచార్యులకు ముందే శ్రీ నీలకంఠ శివాచార్యులవారి శివాద్వైత భాష్యము ప్రఖ్యాతమై యుండుట చేతను — నది వ్యాప్తిలో నుండి పండితుని కాలములో ప్రామాణికమై వెలయుట చేతను—పండితుడు ద్వైతపరముగా వేద వాక్యముల కర్థము చెప్పవలసిన యావశ్యకత ఎంత మాత్రమును లేదు.''[11] దీనినిబట్టి శ్రీ శివాచార్యుల ప్రాచీనతను శ్రీ ని-వే. గారే అంగీకరించారు కదా! ఇక నాకు ''ఆరాధ్య సంప్రదాయంమీద ఉన్న అభిమానం సహజం'' కాబట్టి శ్రీ శివాచార్యుల ప్రాచీనతను అంగీకరించడంలో అసహజమేమీలేదు. అయినా శ్రీ శివాచార్యులవారి కాలాన్ని గూర్చి నేను ప్రస్తుతం చర్చించదలచుకోలేదు. వారు శ్రీ శంకరులకు పూర్వులైనా లేక శ్రీ శంకర రామానుజులకు నడిమి వారైనా నా కొట్టే ఇబ్బందిలేదు. ఇంతేకాదు — ఈమధ్య ఒక పండితుడు నన్నెచోడుడు అసలు పుట్టనేలేదని, కుమార సంభవం కావ్యాన్ని మానవల్లివారే రచించారని ఒక వాదం లేవదీశారు. అలాగే 'శ్రీ శివాచార్యులవారు వేరేలేరు — శ్రీ ఒ. వి. గారే శివాచార్యులు' అని ఎవరైనా వాదించినా ఈ వ్యాసానికి సంబంధించినంత వరకు నేను వాదించదలచుకోలేదు.

''శ్రీ ఎస్ ఎస్. సూర్యనారాయణ శాస్త్రిగారు దీన్ని వీర శైవ భాష్యమని కాని, ఆరాధ్యులకు ప్రామాణిక గ్రంథం అని కాని చెప్ప''లేదట. ఆయనెవడు? అవుననడానికి కాదనడానికి. ఇంత మంది ఆరాధ్యులు శిరసావహిస్తుంటే ఆయన ఒక్కడు కాదంటే మాత్రం చెల్లుతుందా ?

7) శివతత్త్వ సారం ''దేశకాల పరిస్థితులకు శైవమతం లోని విభిన్న శాఖలకు ఎంతవరకు సమన్వయమౌతుందో తేల్చి చెప్ప వలసిన పని చాలా ఉంది.'' అక్షరాల నిజం! 5వ పేరాలో చెప్పు కొన్నట్లుగా కొంత ఆ ప్రయత్నంలోనే ఉన్నాను.

8) ''పండితుడు చండాలుడు శివభక్తుడైతే నెత్తెక్కించు కొమ్మన్నాడు.'' ఇంకా చాలా చాలా అన్నాడు. కన్నులు పెరక మన్నాడు. ముక్కూ చెవులు తరగమన్నాడు. తలలు నరకమన్నాడు. మొగుడ్ని వదలమన్నాడు. మరి ''ఆరాధ్యులు ఇప్పుడా పనులు'' కూడా చేయడం లేదు.

9) ''వేంకటరావుగారికి స్థిరమైన అభిప్రాయాలు లేవని లేదా ఉండవని ఎట్లా'' అన్నానో తెలుసుకోవాలనుకుంటే 'పీఠిక' 'వ్యాసం' ప్రక్క ప్రక్కన పెట్టుకొని జాగ్రత్తగా చదవాలి. ఊరకే 'క్వశ్చన్ మార్కులు' పెడితే లాభంలేదు.

10) ఇంతకూ శ్రీ ని. వే. గారిపై నాకు గౌరవం లేక 'వ్యక్తి ప్రధానంగా' వ్రాశానని అనుకొని ఇదంతా వ్రాశారు శ్రీ ఒ. వి. గారు. శ్రీ ని. వే. గారిని గూర్చి నా అభిప్రాయమేమిటో నా వ్యాసం మొదటి పేరాలోనే స్పష్టం చేశాను. వారిపై నాకు చాలా గౌరవం ఉంది. అంతమాత్రాన వారేది చెప్పినా 'తర్కించకుండా తల ఊపడం' మాత్రం నావల్లకాదు. పెద్దల్ని గౌరవించడమంటే వారి అభిప్రాయాల్ని తర్కించడమే నంటారు కీ. శే. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు.[12] సరిగా నా అభిప్రాయం కూడా **అదే!**

11) ఈ వాదోపవాదాలకు మూలం ఒకటి 'పీఠిక', రెండు 'వ్యాసం'. మొదటి దానిలో శ్రీ ని. వే. గారు పండితుడు ద్వైతి యన్నారు. వారో దానిలో కాదన్నారు. ఏది నిజమనుకోవాలి? అందుకు ఆ వ్యాసం వ్రాశాను. శ్రీ ఒ. వి. గారు 'శివజ్యోతి' చదవకుండానే ప్రతి విమర్శకు పూనుకొన్నారు. పైగా "పుస్తకాలు చదివితే ఈ పొరపాటులు దొరలవు" అని సలహా ఇస్తున్నారు.

ఏమైనా ఇతరులను విమర్శించే ముందు తమను తాము విమర్శించుకోవడం విజ్ఞుల లక్షణం.

## అధోజ్ఞాపికలు

1 'పండితారాధ్యుడు ద్వైతియా ?'– భారతి–ఆగస్టు '79.

2 'పండితారాధ్యుడి మతము!' – భారతి – అక్టోబరు '79– కలగూర గంప.

3 ఇకముందు ని. వే. గా వ్యవహరిస్తాను.

4 శివతత్త్వసారం – ద్వితీయ ముద్రణ - పీఠిక– పుట–84. ఇకమీద 'పీఠిక' అనే వ్యవహరిస్తాను.

5 ఆగస్టు '79–భారతి పుట–58.

6 శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు.

7 ఉర్దూ సామెత. తెలుగులో సుమారుగా సమానార్థకం 'మొగుడ్ని కొట్టి మొగసాల కెక్కింది.' 'దొంగే దొరను గద్దించా'డని అర్థం.

8 ఇవి నా మాటలు కావు. శ్రీ ని. వే. గారు పలుమార్లు వ్యక్తం చేసిన అభిప్రాయాన్నే నేను నా మాటలలో అనువదిస్తున్నాను.

9 'శివజ్యోతి' ప్రథమ సంచిక–పుట. 36. 'ఆంధ్రదేశములో వర్ధిల్లిన ఆరాధ్య శైవము'–వ్యాసకర్త శ్రీ ని. వే. గారు. ఇది 'శివాద్వైత సంఘం'వారి వార్షిక సంచిక. సంపాదకులు శివశ్రీ నిర్మల శంకర శాస్త్రిగారు. 3 సంచికలు వెలువడ్డాయి ప్రాప్తిస్థానం· సర్వమంగళా సదనం, 184/ఎ, వెస్ట్ మారేడ్‌పల్లి, రోడ్డు నెం 6, సికింద్రాబాద్ ఇక ముందు 'వ్యాసం' అంటే 'శివజ్యోతి' వ్యాసం.

10 ఆదిలాబాద్‌లో ఉన్నాను ఇది మిన్నుల వడ్డ చోటు. అవసరానికి కావలసిన పుస్తకాలు కాని, సందేహం కల చోట్లలో తీర్చగల సంప్రదాయాభిజ్ఞులు కాని చాలా దూరంలో ఉంటారు అందువల్ల కొంత సమయం పడుతుంది.

11 'శివజ్యోతి' వ్యాసం–పుట 35.

12 చూడుడు : సారస్వతాలోకం - "ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథున కీయదగిన స్థానము"–పుట–121.

*శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్*

## అర్థంలేని పదం కాదు తమకు అర్థంకాని పదం

డాక్టర్ మురళీధర్‌గారు జూలై నెలలో భారతి పత్రికలో కలగూరగంప శీర్షికలో వ్రాసిన కొన్ని అభిప్రాయాలను వాటిలోగల సామంజస్యాన్ని ఇక్కడ పరామర్శిస్తున్నాను.

"ది పొయెట్ ఫీల్స్ వాట్ ఆల్ ఫీల్, బట్ హి సేస్ వాట్ ఆల్ కెనాట్ సే"- కాబట్టి ఏ కవి కూడా తాను చెప్పదలచుకొన్న దానిని అనుభవించవలసిన నియమం లేదంటాను. ఈ మేరకు మురళీధర్‌గారు కూడా నాతో ఏకీభవిస్తున్నారనే అనుకుంటున్నాను.

అయితే 'ప్రజాకవి' అనే పదానికి అర్థంలేదని అనడం సబబు కాదని నా అభిప్రాయం. "విశ్వశ్రేయః కావ్యం"అని నన్నయగారు ఊరికే చెప్పలేదు. అటువంటి కావ్యనిర్మాత ప్రజాకవి కాగలడు. "ఆంధ్రావళి మోదమునుంబొరయ" తిక్కనగారు మహాభారతాన్ని వినిర్మించారు. అందుకే ఆయన ప్రజాకవి అయ్యారు. ఇలాగ "ప్రజల సాంస్కృతిక, ఆధ్యాత్మిక, ఆర్థిక సామాజిక సమస్యలన్నిటిపైన జనహృదయంలో నిల్చే శ్రేయోభూతమైన కవిత్వం చెప్పేవాడే ప్రజాకవి"అని నా అభిప్రాయం. ఈ లక్షణాలు పూర్తిగా మనకు వేమనలో గోచరిస్తాయి. ఆయన స్పృశించని సమస్యలేదు. ఇక 'కన్యాశుల్కం' గురించి మురళీధర్‌గారు వ్రాసిన దానిని చర్చిస్తాను

"గురజాడ ప్రజాకవి ఎలా కాగలిగాడు"? అన్నది వీరి అనుమానమైతే "ఎందుకు కాకూడదు"? అన్నది నా ప్రశ్న. గురజాడ వలన రాజ్యాలకు వంత పాడారట! ఇది మన సాహిత్య చరిత్రలోలేని చోటెక్కడని అడుగుతున్నాను. అవసరార్థం శ్రీనాథుడు నానా రాజులనుఒకే నోటితో కీర్తించలేదా? (దీన్ని కాకాపట్టడం అంటాం మనం ఈ రోజుల్లో) పోతనగారుమాత్రం తన భోగినీ దండకాన్ని రాజాంకితం చెయ్యలేదా? తిక్కనగారు మాత్రం మనుమసిద్ధిగారి రాజవైభోగాలను అనుభవించలేదా? ప్రాచీన కవులెవరైనా రాజాశ్రయం లేకుండా వున్నవారేనా? అంతమాత్రంచేత వారి దార్శనికతకు భావుకతకు లోపం వచ్చిందంటారా? ఈనాడు అభ్యుదయ విప్లవ

రచయితలుగా ప్రసిద్ధి పొందిన సినారె, దాశరథి. శ్రీశ్రీలు మాత్రం చలన చిత్రాలకు గీతాలు సమకూర్చి ధనార్జన చేయటంలేదా? అంత మాత్రంచేత వారి వైష్ణవ్య సిద్ధాంతాలకు, అభ్యుదయ భావాలకు క్షతి కలుగుతున్నదని అనగలమా? అంతెందుకు ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనికోద్యమ ప్రభావం మన దేశ సాహిత్యంమీద ఎంతటి ప్రభావాన్ని చూపించిందో మురళీధర్‌గారికి తెలియనిదికాదు. అది వలస రాజ్య పౌరుల సాహిత్యంకాదా? ''మంచి గతమున కొంచెమేనోయ్'' ''సొంత లాభం కొంత మానుకు పొరుగు వాడికి తోడుపడవోయ్'' అనే వాక్యాలలో వలస రాజ్యాల వంతపాటలు వినిపిస్తున్నవా? గిరీశం చేత ''మనవాళ్లు ఒట్టి వెధవాయలోయ్'' అనిపించడంలో మన లోపాన్ని బైట పెట్టడమే ప్రధానోద్దేశ్యమని నా అభిప్రాయం. ''కన్ను వని వస్తుతత్త్వముగాంచ నేర్పరు లింగిరీజులు''అనడంలో, పరస్తుతికన్న ఆత్మనిందే ప్రముఖత నొందుతుందని నా భావన.

కన్యాశుల్క నాటకం ఏదో ఒక వర్గాన్ని బాధించే సమస్య మీద రచింపబడిందని మురళీధర్‌గారు అంటారు.

'కన్యాశుల్కం' ఏ ఒక్క వర్గానికో ప్రతీకకాదు. సమకాలీన సమాజంలోని అన్ని వర్గాలవాళ్లు ప్రాతినిధ్యం వహిస్తున్నారు జాతి మత తత్త్వాలు, సమాజంలోని మూఢఛాందసాలు, ఘోర దురాచారాలు విమర్శింపబడ్డాయి. అనేక సాంఘిక సమస్యలు ప్రస్తావించబడ్డాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే భాషాపరంగా సామాజికంగా చైతన్యాన్ని రగిలించింది కన్యాశుల్క నాటకం.

రామప్పపంతులులాంటి పెత్తందార్లు లుబ్ధావధాన్లులాంటి ధనస్వాములు, అగ్నిహోత్రావధాన్లులాంటి దురాశాపరులు గిరీశంలాంటి అవకాశవాదులు బుచ్చమ్మలాంటి అమాయక బలిపశువులు, మధురవాణి, సౌజన్యారావులవంటి అభ్యుదయగాములు ఆనాటి సమాజ స్వరూపానికి దర్పణం పట్టారంటే అది అతిశయోక్తి కానేకాదు. కన్యాశుల్క పిశాచానికి బలైపోయిన వితంతువైన బుచ్చమ్మలాంటి పాత్ర విశ్వనాథవారి కావ్యాల్లోగాని కథల్లోగాని ఎక్కడైనా కనిపిస్తుందా? గిరీశంలాంటి విదూషకుడు విశ్వనాథవారి సాహిత్యంలో దర్శనమిస్తాడా? విశ్వనాథవారి పాత్రలు గురజాడవారి పాత్రలు తీసుకుంటే వీనిలో ప్రజాబాహుళ్యానికి ప్రజాహృదయాలకు ఏవి దగ్గరగా వున్నాయి? 'వేయిపడగలు'లోని 'ధర్మారావు' అంటే ఎక్కువమందికి తెలుసో, 'కన్యాశుల్కం'లోని 'గిరీశం' అంటే ఎక్కువ మందికి తెలుసో, అలాగే పూర్ణమ్మ, ఏకవీరలను గూర్చి పదిమందిని ప్రశ్నిస్తే 'మెజార్టీ' తేలిపోతుంది.

'సోషల్ రిఫారమ్' తన కవితా ప్రయోజనం అని గిరీశంచేత బుచ్చమ్మ కిప్పించిన ఉపన్యాసాలలో నిరూపిస్తాడు అప్పారావు దయ్యాలు భూతాలు మోసాలని, అమాయక ప్రజల దగ్గర ఆడే నాటకాలని పూజారి గవరయ్య పాత్రద్వారా తెలియజేస్తాడు గురజాడ. ఛాందసత్వమే తన కవితా ప్రయోజనమని, మూఢనమ్మకాలే భారతీయ సంస్కృతి అనీ వేయిపడగలులోని గణాచారి పాత్రద్వారా మారిపోస్తాడు విశ్వనాథ సత్యనారాయణ. వీరిద్దరిలో ఎవరిది శాస్త్రీయ దృక్పథం? కవిత్వం అంటే సైన్సు పాఠంలా కేవలం చెప్పెయ్యడంతోనే సరిపోదు. 'ప్రాక్టికల్' అనేది అత్యంత అవసరం. అది విశ్వనాథలో మృగ్యం. ఇప్పుడు చెప్పండి ఎవరు ప్రజాకవి? విశ్వనాథ? గురజాడా?

''విదేశ సాంస్కృతిక బానిసత్వంనుండి బయల్పడాలని అకుంఠిత దీక్షతో పోరాడిన వ్యక్తి విశ్వనాథ'' అని మురళీధర్‌గారంటారు. నిజమే కావచ్చు కాని స్వార్థమైన, లోపభూయిష్టమైన, అశాస్త్రీయమైన, దురాచార సంపన్నమైన ఏ సంస్కృతినీ గుడ్డిగా అనుసరించే వ్యక్తికాదు గురజాడ. అతడు విశ్వమానవ సమానతను వాంఛించాడు.

'ఎల్లలోకము ఒక్క యిల్లై'
వర్ణభేదములెల్ల కల్లై''— ఇత్యాదిగ ఆశించాడు.

హిందూమత సంప్రదాయాను గమియైన జ్ఞాన వాశిష్ఠము నుండి 'లవణరాజుకల' ఇతివృత్తాన్ని సమకాలీన సమాజం చైతన్యవంతం కావడాని కనుగుణం తీర్చిదిద్దిన గురజాడ ప్రజాకవి ఎందుకాడని ప్రశ్నిస్తున్నాను?

ఛందోసర్ప పరిష్వంగంలో బందీయైన భారతిని, సంకెళ్లు విడగొట్టి ముత్యాల సరాలతో అలంకరించిన గురజాడ ఎందుకు ప్రజాకవి కాకూడదు?

కన్యాశుల్కం, బాల్యవివాహం, వితంతువివాహం, వేశ్యావృత్తి మొదలగు సాంఘిక సమస్యలకోసం కవితాశక్తిని అంకితంచేసిన గురజాడ ఎందుకు ప్రజాకవి కాకూడదు?

గురజాడ ఎవరి ఆశ్రయంలో వుంటేనేం, ఎవరికి వంతపాడితేనేం విశ్వమానవ సమానత్వాన్ని సామాజిక చైతన్యాన్ని ఆశించలేదా?!

*శ్రీ నందిగాం వీరవెంకటరమణజోగారావు*

# లేఖలు

## లంజియా!

1979 జూలై 'భారతి'లో శ్రీ సర్దేశాయి తిరుమలరావు గారు'గురజాడకు అర్థమయిన భారతీయ సంస్కృతి'అను వ్యాసంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'శ్రీ మద్రామాయణ కల్పవృక్షము' లోని 'మేనకా విశ్వామిత్రుల ప్రేమఘట్టం'లో మేనకను విశ్వామిత్రుడు 'లంజియా!' అని సంబోధించాడనీ, ఆ సంబోధనవల్ల విశ్వామిత్రుడు మేనకనేకాక ఆమెకు పుట్టబోయే శకుంతల కుమారుడైన భరతునిపేరిట పిలువబడుతున్న మన జాతినీ, మన దేశాన్నీ తిట్టినట్లయిందనీ, 'తిట్టు అంటే ఇట్లుండవలె' అనీ వెక్కిరిస్తూ, వక్రం వ్యాఖ్యానించారు; తద్వారా తెలుగునాట వెలుగుల రవ్వల జడులలాంటి విలువ కట్టుటకు వీలుకాని వివిధ రచన

లను చేసిన కవితా విశ్వనాథుడైన విశ్వనాథనూ, భారతీయ జ్ఞాన పీఠ బహుమతిని పొందిన ఆయనగారి మాగ్నమ్ ఓపస్ అయిన 'కల్ప వృక్షాన్నీ' తమ స్వల్పబుద్ధితో హేళన చేశారు.

వాస్తవానికి 'కల్పవృక్షం'లోని విశ్వామిత్రునికి మేనకపైన కాసంతకూడా కోపంలేదు. ఈ సంగతి మేనకా విశ్వామిత్రుల ప్రేమఘట్టము'ను సహృదయతతో పఠించిన వాళ్ళకందరికీ చాలా సులభం అర్థమవుతుంది. అందులో విశ్వామిత్రుడు మేనకను 'ఓసీ! అచ్చర!','తన్వి!','మేనా!', 'బేలా', 'వనితా','మధుమూర్తీ!', 'అచ్చరా!' 'బాలికా!', 'నీరజాక్షి!' అంటూ వివిధ పద్ధతుల్లో సంబోధించాడు. తరువాత 'లంజియా!' అని కూడా సంబోధించాడు. 'మౌని వౌనికాదు, మమతచే వాచాల సార్వభౌముడయ్యె'నని విశ్వనాథ గారే చెప్పారు. ఈ మమతయే విశ్వామిత్రునిచేత మేనకను వీడ్కొను సమయమున అన్ని మాటలను మాటలాడించింది. పైన పేర్కొన బడిన సంబోధనలన్నీ విశ్వామిత్రుని ప్రేమార్ద్ర హృదయాన్ని ఆవిష్కరిస్తాయే కానీ వేరు పని చేయవు. 'లంజియా!' అను సంబోధన తిట్టే అయి ఉంటే మేనకలో ఆ మాట విన్నంతనే ప్రతిక్రియ కనబడి ఉండేది. అట్టి ప్రతి క్రియ అక్కడ లేదు కాన ఆ సంబోధన తిట్టుకాదని మనం గట్టిగ చెప్పవచ్చు. నాచన సోమనాథుని 'ఉత్తర హరివంశము'లో నరకాసురుడు ఊర్వశి మాటలను 'లంజె మాటలు' అంటాడు. ఆమెకు కోపం వస్తుంది. 'లంజియ నాదు నేను' అని కోపమును ప్రకటించడంచేత ప్రతిక్రియ చూపింది. కాన నరకుని 'లంజ' అన్నమాట తిట్టు అయిందని మనకు తెలుస్తుంది విశ్వనాథ విశ్వామిత్రుడు మేనకను 'వేశ్యా!' అని పిలవడానికి బదులుగా తేటతెలుగులో 'లంజియా!' అని సంబోధించాడు. అప్సరసలు స్వర్వేశ్యలు. వారి వృత్తికూడా వేశ్యావృత్తియే. తమ సౌందర్యంతో ధనవంతుల నాకర్షించి, వాళ్ళ ధనాన్ని అపహరించడం వేశ్యల ఉద్దేశ్యం. ఇక్కడ మేనక విశ్వామిత్రుని తపోధనాన్ని హరించి, అతనిని పతితుణ్ణి చేయడానికి ప్రయత్నించింది. పైకి పోతూన్న విశ్వామిత్రుడిని క్రిందికి గుంజింది. అయినా విశ్వామిత్రునికి ఆమె పట్ల కించిత్తుకూడా కోపంలేదు. ఎందుకంటే 'కూలికి' వచ్చినప్పటికీ మేనక విశ్వామిత్రునికి తన 'ఎడద లోతులు' ఇచ్చింది. అతనికి 'మధుమూర్తి' అయింది. అతనికి 'ఘనంబగు మేలు' ఒనరించింది. ఆమె 'కృపావేశము'చేత అతనికి కోశిల ఏమిటో అర్థమయింది. అందుచేత విశ్వనాథ విశ్వామిత్రుడు 'లంజియా!' సంబోధనను బుజ్జగింపుగ, ముద్దుముద్దుగ, మీసాలలో మొలకనవ్వులు చిలుకరిస్తూ, మేనక చివురు చెక్కిలిని కొడుతూ చేసి ఉంటాడని అనుకోవలసిందేతప్ప, కోపంతో చేశాడని అనుకోవడానికి ఆవంత కూడా ఆస్కారంలేదు. అతని సంబోధనలో అల్టీరియర్ మోటివ్ ఏమీలేదు; నిండు గుండెలోని నిష్కల్మష ప్రేమతప్ప! మేనక అనుకున్నది విశ్వామిత్రుణ్ణి పతితుణ్ణి చేయాలని కాని జరిగిందిమాత్రం విశ్వామిత్రునికి మేనక పొందువలన ఒక విధమైన జ్ఞానోదయం! మేనక విశ్వామిత్రునికి 'కోరి ప్రత్యక్ష మన్మథ గురువు' అయింది, కోరక పరోక్ష వైరాగ్య గురువు' అయింది. కావున మేనక అంటే విశ్వామిత్రునికి 'గురుభావం' ఉందన్నమాట. జ్ఞానోదయం కలిగించిన గురువుపట్ల ఎలాంటి నీచునికి కూడా కృతజ్ఞతా భావమే ఉంటుంది కానీ కోపభావం ఉండదు. అలాంటప్పుడు విశ్వామిత్ర ఋషికి మేనకపట్ల కోపభావం ఉంటుందని ఊహించడం అసమంజసం; అర్థరహితం. కాన 'లంజియా!' సంబోధన సుతరామూ నింద కాదు; నిజంగా ఒక విధమైన నిందారూపములో ఉన్నట్టు అగుపించే స్తుతి! ఈ సంబోధన మేనక మనస్సుకు గిలిగింతలు పెట్టి, ఆమె మధురాధరంమీద మృదుల మందహాస కౌముదులను విరజిమ్మించి ఉంటుంది తప్పకుండా. అంతేకాదు. ఈ సంబోధన మేనకకూ విశ్వామిత్రునికీ మధ్యఉన్న చనువునూ, విశ్వామిత్రునికి మేనకపట్ల ఉండిన ప్రగాఢ ప్రణయ భావపు పరాకాష్ఠనూ వ్యంగ్యంగా వ్యక్తం చేస్తుంది. అందువల్ల 'లంజియా!' సంబోధన నిందకాదు; అభినందన!

శ్రీ తిరుమలరావు గారు భారతీయులచేత మందసాల్లో పెట్టి పూజింపబడే రామాయణాలలాంటి పవిత్ర గ్రంథాలలో 'లంజియా!' లాంటి సంబోధనలుండడం ఔచిత్య రాహిత్యమనీ, అందువలన కావ్యపు పవిత్రత తగ్గుతుందనీ అంటారు. ఈ కావ్యాన్ని పురాణంగా చెప్పే 'డేంజరు' ఉంది కాన ఈ ఘట్టంలో ఈ సంబోధనను వినువారి 'జీవుని వేదన' ఎక్కువవుతుంది అంటారు. శ్రీ మద్వాల్మీకి రామాయణంలో 'అహల్యా సంక్రందన ప్రేమఘట్టము' ఉంది. అదేమంత పవిత్రమైన ఘట్టం? ఆ ఘట్టం పురాణం చెప్పబడేటప్పుడు వినువారి 'జీవుని వేదన' ఎక్కువ కాదా? అలాంటి 'రంకు పురాణం' ఉందని భారతీయులు శ్రీమద్వాల్మీకి రామాయణాన్ని పురాణం చెప్పించుకోవడం కానీ, పూజించడం కానీ మానుకున్నారా? కాన 'లంజియా!' సంబోధనవల్ల విశ్వనాథగారి 'కల్పవృక్షము'నకు ఎలాంటి కళంకమూ ఏర్పడదు. 'మేనకా విశ్వామిత్రుల ప్రేమ ఘట్టము'ను వినువారి 'జీవుని వేదన' ఏ విధంగానూ ఎక్కువకాదు!

శ్రీ తిరుమలరావు గారు అక్కడక్కడ కొన్ని దోషము లున్నవని (అవి దోషములు కాకపోయినను కూడ) విశ్వనాథగారి 'కల్పవృక్షా'న్ని అల్పకావ్యాన్ని దుయ్యబట్టినవిధంగా దుయ్యబడుతున్నారు. శ్రీ రావుగారి 'సాహిత్యతత్త్వము–శివభారత దర్శనము'లో కూడా ఒకచోట 'కల్పవృక్షపు' బాలకాండలోని ''తానో'లాములు' తండ్రి పేరెవరయా? 'దాచాత వాలాలు'......'' పద్యాన్ని ఉటంకించి విశ్వనాథను ఎత్తి పొడిచారు. శ్రీ రావుగారికి కొందరు కవులంటే సరిపోనట్లు అగుపిస్తుంది. వారిలో విశ్వనాథ ఒకడు. శ్రీ రావుగారు విశ్వనాథ 'కల్పవృక్షము'లో ఔచిత్యం పృగ్యం అనే ధోరణిలో వ్రాస్తారు. శ్రీ రావుగారికి నచ్చనంతమాత్రాన మహాకావ్యాలనూ, మహా కవులనూ కించపరచడం వారికి తగనిపని. శ్రీ రావుగారికి సాహిత్య విమర్శ ఒక ఐచ్ఛికవృత్తి. అందువలన వారు నిష్పాక్షికంగా, నిర్లిప్తంగా, నిండుకుండలా, సంయమనంతో విమర్శలు వ్రాస్తే చాలా బాగుంటుంది. విమర్శకుని పని తప్పులు పట్టడమని వారు ఒకసారి అనంతపురంలో ఒక సభలో అన్నప్పుడు విన్నాను. రంధ్రాన్వేషణమే వారి చొప్పున విమర్శ పరమావధి అయితే శ్రీ రావుగారు

తప్పకుండా విమర్శ పేరిట ఆత్మవంచన చేసుకుంటున్నారని చెప్ప వలసి వస్తుంది. విమర్శ గుణశోధన కావాలేకాని దోష దూషణ కారాదు; కాకూడదు. 'శ్రీమద్రామాయణకల్పవృక్షము'లో దోషాలు లేవని ఎవడూ అనడు. ఎందుకంటే ఎంతటి ప్రతిభావంతు డైనా మానవ మాత్రుడు దోషరహితమైన సృష్టిని చేయలేడు. అంతమాత్రంచేత 'కల్పవృక్షము' నట్టి తప్పుల పుట్టా, చెత్తబుట్టా కాదని దానిని సవ్యంగా, సానుభూతితో, సహృదయతతో చదివిన వారికందరికీ బోధపడుతుంది. 'నా సకలోహవైభవ నాథము నాథ కథన్ రచించెదన్'అని విశ్వనాథవారు తమ సమస్త కవితా శక్తులనూ నిక్షిప్తంచేసి సృష్టించిన కవితాశిల్ప వృక్షమైన 'కల్పవృక్షం'లో ఉన్న అల్పదోషాలు అందులో ఉన్న అనల్ప గుణగణాల్లో అణగిపోతాయి 'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి' అన్నట్లుగా! అంతేకాదు. ఆ అల్పదోషాలే అందాల రాణియైన విశ్వనాథవారి ఆంధ్రవాణికి అలంకార హేతువు లవుతాయి 'మలినమపి హిమాంశోః లక్ష్మ లక్ష్మీంతనోతి' అన్నట్లు! 'తప్పు కలిగినచోటనే ఒప్పు కలుగు, సరస కవితా వశో క్తుల సరణియందు' అనికదా రామకృష్ణుని రమ్యసూక్తి!

*శ్రీ శారంగంటి రంగాచార్యులు*

# అశ్వత్థామ

1979 సం॥ము ఏప్రిల్ నెల భారతిలో 'అశ్వత్థామపై అభాండము' అను శీర్షికతో శ్రీ వింజమూరి విశ్వనాథమయ్యగారు వ్రాసిన లేఖ ప్రకటింపబడినది. ఆ లేఖలో వారు 'అశ్వత్థామ ద్రౌప దేయుల శిరంబులు తెచ్చి సమర్పించడం, వారేమో నిద్రాసక్తులై ఉండి శస్త్రధరులే కాకపోవడం మొదలైనవన్నీ పోతన్నగారి అతిశ యోక్తి విన్యాసాలని వ్రాసిరి.

మహాభారత యుద్ధము 18 దినములు జరిగినది. ఈ 18 రోజులలో సైన్యాధిపత్యము వహించిన భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యుల పేర్లు మహాభారతములో 6, 7, 8, 9 పర్వముల కొసంగబడెను. ఆ నల్వురు 18 దినముల యుద్ధములో మరణించిరి భీముని గదా ఘాతములచే దుర్యోధనుడు తొడలు విరిగిపడెను. ఇట్టి అవసాన స్థితిలో దుర్యోధనుఁడు అశ్వత్థామను వేడగా అతనికి సైన్యాధిపత్య మొసగెను. కాని సేనాధిపతి అశ్వత్థామ పేరు భారత లో 10వ పర్వమునకు ఒసగబడలేదు. దానికి సౌప్తికపర్వమని పేరిడిరి. సుప్తి యనగా నిద్ర; సౌప్తికమనగా నిద్రించుట లోనగు సమయములందు శత్రువులపై బడి చంపుట. ఈ పర్వములో అశ్వత్థామచే చంప బడిన ధృష్టద్యుమ్న, యుధామన్య, శిఖండి, ద్రౌపదేయులు మొద లైన వారందరు, అప్పటికే 18 దినములు జరిగిన యుద్ధము వలని శ్రమ భీతి, అలసట వలన నిద్రపోవుచుండిన వారే. అయితే అశ్వ త్థామ నిద్రామత్తులో ఉన్నవారిని చంపలేదు. ధృష్టద్యుమ్నుని కాలితో తన్ని లేపి వింటినారితో కంఠమున ఉరి బిగించి చంపి, రథముపై నెక్కి వెడలిపోయెను. రక్షకులీ విషయమును గ్రహించి శవమై పడియున్న ధృష్టద్యుమ్నుని చూచి యేడ్చి, కేకలు వేసిరి. అప్పుడు కలకలము పుట్టెను. అందఱును నిద్ర నుండి లేచిరి. రక్కసుడో మనుష్యుడో యెవ్వరో చంపినవాడా కలకలములో తెలియ లేదు. శిఖండి కూడ చంపబడిన తరువాత చంపినవా డశ్వత్థామ యని అంగటికిని తెలిసెను. (సౌప్తిక-1-193)

ఇది యంతయు 18వ రోజు రాత్రి వేకువకాకముందే రెండు జాములలో సమితింజయుడైన అశ్వత్థామ యొనర్చిన సంరంభము, సంహారము, వీరవిహారము, రాజభక్తి. అందుచేతనే పోతన్నగారు 'చీకటిన్' అను పదమును వాడెను (1-161). ద్రౌపదేయులు ధృష్టద్యుమ్నుని హత్యానంతరము జనించిన కలకలమువిని, ఆరాత్రి సమయములో ఆశ్చర్య సంభ్రమములు ముప్పిరిగొన లేచిరి; లేచినను నిద్రమత్తు పోలేదు. ఆ నిద్ర మత్తులోనే వారు హడావిడిగా శస్త్ర ములను ధరించిరి. అంతియేకాని పగలు, యుద్ధసన్నాహులై శస్త్రా స్త్రముల ధరించి, యుయుత్సువులై, జయచికీర్షులై, అశ్వత్థామ నెదుర్కొనలేదు. అందుచేతనే పోతన్నగారు 'నిద్రామత్తుల' అని ప్రయోగింపక నిద్రాసక్తులను సమాసమును వాడెను. నిద్రాసక్తు లన్నపదము భారతములో తిక్కన్నగారు వాడినదే (10-1-193). కావున పోతన్నగారు 'నిద్రాసక్తుల'ని వ్రాయుటలో అతిశయోక్తి కానరాదు. కాని అశ్వత్థామ పాంచాలురను పగలు చంపలేదు, రాత్రి చంపెను; యుద్ధభూమిలో చంపలేదు, శిబిరములో చంపెను; ఇది హత్యాకాండ, మారణహోమము; సైన్యాధిపత్యము వహించిన నాడొన రించ వలసిన పనిగాదు. అందుచే అశ్వత్థామకిది తీరని కళంకమునా గోచరించుచున్నది. అతడు చిరంజీవులలో కృతవర్మతోపాటెట్లు పరిగణింపబడుచున్నాడో? అయినను అది శివునియాజ్ఞ. శివుని యాజ్ఞలేక చీమైన కుట్టదని లోకోక్తి కదా!

18 దినముల యుద్ధశ్రమవలన 18వ రోజు రాత్రి అంద ఱును 'డప్పిగూరి కొండొక సేపునకు మహీతలంబున మేనులువైచి వందురు చుండి రందు కృప, కృతవర్మలు నిద్ర వొందిరి క్రోధాతి శయముచేత అశ్వత్థామకు నిద్రరాలేదు. అక్కడ ఉన్న మఱ్ఱిచెట్టు శాఖోపశాఖలపై పలుకాకులు నిద్రించుచుండగా గ్రుడ్లగూబయొకటి వరుసగా కాకులను చంపుట అశ్వత్థామ గమనించెను. అది ఉపదేశ ముగా గొని అశ్వత్థామ నిద్ర పోవు శత్రువుల సంహరించుటకు నిశ్చ యించుకొనెను (10 1-20). నిద్రా వివశంబైన పాండవ శిబి రంబు డగ్గఱెను (10-1-92) అట్టి సమయములో శివుడు భూతాకృతిలో కనిపించెను. అశ్వత్థామ ఆత్మోపహారమిచ్చి శివుని మెప్పించెను. శివుడు ఖడ్గము ప్రసాదించెను; పాంచాలురకు కాల మాసన్నమైనదని కూడ చెప్పెను (10-1-134). శివుడు ఖడ్గము ప్రసాదించి యుండనిచో అశ్వత్థామ ఆరాత్రి అంత హత్యా కాండ మొనరించి యుండలేడు. కావున అది శివుని యాజ్ఞగా గొన వలయును. అందుచేత అశ్వత్థామ నిమిత్తమాత్రుడనిభావింపవలెను.

2. శ్రీ విశ్వనాథమయ్యగారు 'ఉద్రేకంబున రారు శస్త్ర ధరులై' అని ద్రౌపది పల్కడం సమంజసమా? యను అనుమాన

ముతో మూలం చూచినట్లు, అసలీ పద్య భావమే అందులో లేదని వ్రాసిరి. ఆత్మజుల మరణవార్త వినగానే ధర్మజుడు 'శోక వేగ సంతప్తుడై సొలసి నేలవ్రాలిపోయెను, "ద్రౌపది యీ వార్త వినగానే మూర్ఛ మునుంగు నెమ్మనంబునను, నవశంపు మేను నయి భూస్థలిఁ ద్రెళ్ళుక యున్నె? తేఱనేనియు బటు శోకవేగమున నిర్భర వేదనఁ జెందకుండునే ?" మున్నిట్టి తెఱగున శోకం బెన్నఁడుఁ దా ననుభవించి యెఱుఁగదకట నే డన్నెలత పెల్లున నెన్ని యవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో' అని వగలం బొగిలెను. ఉపప్లావ్యము నుండి అప్పుడు రావింపబడిన ద్రౌపది స్థితిని 'అశ్వత్థామోద్దామ మరణకరణ స్మరణంబుదన మనం బుత్తల పెట్టఁ గోపంబు దీపించినట్లు' తిక్కన్నగారు వ్రాసిరి (10-2-31). అప్పుడామె యిట్లు ప్రతిజ్ఞ చేసినది !

'భూదేవి గాఢ నిద్రలో గూరిన యట్టిసమయములో చుట్టు ముట్టడించి నా సుతులను అక్రమ లీలతో పాపారంభు డశ్వత్థామ క్రూరముగా చంపెను. అది ఆఱని కార్చిచ్చై నా మనస్సును కాల్చి వేయుచున్నది. దీనిని మాన్పుటకు ఆ క్రూరుని చుట్టుముట్టడించి వాని పేరు అడగించుట తక్క వేరొం డుపాయము లేదు. ధర్మరాజుతో వెంటనే భీముని పంపించి ఆ విధముగా చేయనిచో నేను ప్రాయోపవేశము చేసి యీ శరీరమును త్యజింతును' అని పరుషాక్షరముగ పలికెను (10-2-36) అంతటితో ఆగక భీముని చేయి పట్టుకొని 'పాపాత్ముడైన అశ్వత్థామను చుట్టుముట్టడించి చంపుమని తనమనస్సులో కనలుచున్న నడలను ఉడిగించి కావు'మని వేడుకొనెను. 'మనల గెలిచితినని గర్వపడుచున్న అశ్వత్థామను గీటడగింపుమని ప్రార్థించెను.

జాగ్రత్తగా చూచిన, ఈ భావమే పోతన్నగారి 'ఉద్రేకంబున రారు ..' అను పద్య భావము. ఈ భావమూలము పైన చూపిన విధముగా భారతములోనే ఉన్నది.

భాగవతము ప్రకారము, ద్రౌపది

'ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి, యలంగి యోరువం జాలక, బాష్పతోయ కణ జాలము చెక్కులరాలనేడ్చి పాంచాల తనూజ నేలబడి, జాలిపడెను ... అట్టి దుర్భర పరిస్థితిని చూచి అర్జునుడు ద్రౌపదిని లేవనెత్తి, వాచాలతఁ జూపుచు, చికుర జాలము దువ్వుచు 'ఈ రోజుననే అశ్వత్థామ శిరము ఖండించి తెచ్చెదను, నీవా శిరమున త్రొక్కి యిచ్చటనే, శీతాంశు బింబాననా, జలకములాడుము'ని ప్రతిజ్ఞచేసి యోదార్చి తన సారథియైన కృష్ణుడు నేలు మేలనుచుండగా గాండీవము ధరించి అశ్వత్థామను పట్టి తెచ్చుటకు రథారూఢుడై వేగిరముగా వెళ్ళెను. ఈ విషయము భారతములో లేదు. సంస్కృత మూలమున నెట్లున్నదో ?

3. విశ్వనాథమయ్యగారు 'తెలుగుభాగవతములోవలె ద్రౌపది అశ్వత్థామను అధిక్షేపించడం కూడ మూలంలో లేద'ని వ్రాసిరి. భీముడు అశ్వత్థామను వెదకి వెదకి భాగీరథీ తీరమున కనుగొని 'ఓరీ! ధాత్రీ సురాధమా ! పోయిన రాత్రి అత్యంత కల్మషాభియుక్త మహోగ్ర వృత్తిలో తగులుకొని, క్రూరాత్ముడా! కపట ధార్మికుడా! ఎంత వేగిరముగా తపసి వైతివని అధిక్షేపించెను (10-2-59). మానధనుడైన వానికి పరుషపు మాటలు చాలవా ? ఈ ఆక్షేపణ దృష్టిలో నిడికొని పోతన్నగారు 'నిద్రాసక్తుల సంహరింప నకటా ! నీ చేతులెట్లాడెనో' అని ద్రౌపది అనినట్లు వ్రాసెను. నిద్రాసక్తులనుటలో అతిశయోక్తి లేదు.

ఐనను భాగవత పురాణమెట్లు వెలువడెను ? — పరీక్షిన్మహారాజును 7 రోజులలో సర్పదష్టుడవై మరణింపుమని శృంగి శపింపగా ఆ యేడు దినములలో పరీక్షితునకు శుకమహర్షి భాగవతము చెప్పెనని పురాణ కథ. కాని, భారతములో ఈ ప్రసక్తి లేదు. తక్షకుడు పరీక్షితుని కఱచిన వెంటనే పరీక్షితుడు తాను నిర్మించుకొన్న యేకస్తంభ హర్మ్యంబులో తక్షకు విషాగ్ని దగ్ధుండయ్యెనని భారత కథనము (ఆదిపర్వము-2-201). కావున, భాగవత పురాణమంతయు వ్యాసుని పేర వ్రాయబడి నస్వకపోల కల్పితమనవచ్చును. అట్టి భాగవతమేకాక దేవగిరి యాదవ వంశపు రాజైన రామదేవుని (1271-1309 A. D.) యొద్ద విద్వాంసుడైన బోపదేవుడు (Vopa Deva) 13వ శతాబ్దములో భాగవత పురాణము నొకటి వ్రాసెను. అదిగాక జైమినీకృత భారతమొకటి యున్నది. వాటి నన్నింటిని విపులముగా పరిశీలించిన తరువాత కాని ఆంధ్ర మహాభాగవతములో ఉన్నవి అతిశయోక్తులని భావించుట సమంజసము కావోపదు.

శ్రీ కె. విశ్వేశ్వరరావు

## సైదాపురం జినశాసనం

1979 ఆగస్టు భారతిలో శ్రీ సుందరేశ్వరరావుగారు 1979 జూన్ భారతిలో పడిన నా వ్యాసముపై వ్రాసిన ప్రత్యుత్తరము చూచి నా వ్యాసముపై ఇంకొంత వివరణ ఇవ్వటం మంచిదని తలంచి వ్రాస్తున్నాను. మొదటగ శ్రీ సుందరేశ్వరరావుగారు వైద్య శాస్త్రము, వైద్యపండితులను తెలిపే శాసనాలు మన రాష్ట్రంలో లభ్యమైనవని, వాటి ఉనికిని తెలిపినందుకు వారికి నా ధన్యవాదాలు. నిజంగ యీ అనంతమైన చరిత్ర పరిశోధనలో నేనింకా ప్రారంభ దశలోనే ఉంటిని. అయిన యీ సైదాపురం జినశాసనం వైద్య శాస్త్ర ప్రాముఖ్యలను తెలిపే శాసనాలలో ఒకటి గ్రహింపవచ్చును

కీ. శే. డా. నేలటూరి వెంకటరమణయ్య, డా॥ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారలవద్దనే అసలు నేను ఆంధ్ర చారిత్రిక పరిశోధనాభ్యాసం చేసినది వారు నాకు పూజ్యులు, చిరస్మరణీయులు ఇక సైదాపురం జిన శాసనపు ఉనికిని డా॥ పరబ్రహ్మశాస్త్రిగారే నాకు తెలియపరచిరి. వారి సహకారంతోనే నేను దానిపై వివరణ ఆంగ్లములో వ్రాసి 1977 జనవరిలో మద్రాసులో జరిగిన శాసన పరిశోధకుల గోష్ఠిలో చదివితిని. నా ఆంగ్లవ్యాసము వారి రాబోవు జర్నల్‌లో ప్రచురింపబడుచున్నది వాటి శాసన పరిశోధకులు నా దృష్టిని శ్రీ సుందరేశ్వరరావుగారు తెలిపిన శాసనాలపైమరల్చ

లేదు. లేకచో నా వ్యాసంలో ముగింపునాడే మార్చుకొని ఉండెడివాడను. డా॥ పర్బ్రహ్మశాస్త్రి గారు సైదాపురం జిన శాసన సారాంశాన్ని సూక్ష్మీకరించి బులెటిన్ ఆఫ్ ది ఇన్స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్ కు పంపినట్లు వారే నాకు తరువాత తెలిపిరి. కావున శ్రీ సుందరేశ్వరరావుగారు వ్రాసినట్లు నేను డా॥ పర్బ్రహ్మశాస్త్రిగారు వ్రాసిన ఆంగ్ల వ్యాసమును జూడలేదనుట సబబుగాదు. అది నా ఆంగ్లవ్యాసమును సంక్షేపించి వ్రాసినదే. అసలు నా వ్యాసం భారతికి పంపే సమయంలోనే ఇది '1977 జనవరి నెలలో మద్రాసులో జరిపిన శాసన పరిశోధకుల గోష్ఠిలో చదివిన ఆంగ్లవ్యాసమునకు ఆంధ్రానువాద'మని వ్రాయకపోవుట నిజంగా నా పొరబాటు.

డా. ఘంటా జవహరలాలు

# ఆ నాటి వీధి బళ్లు

ఫిబ్రవరి 1979 భారతిలో డా. జి. వి. రత్నంగారి ''హంస వింశతి వీధిబళ్ల తీరుతెన్నులు'' చాలా ఆసక్తికరంగా, పఠనీయంగా వుంది.

ఇది చదివిన తర్వాత చిననాటి అనుభవాలు నెమ్మనకు వచ్చినై. తేహినో దివసాః గతాః అని శ్రీరామునిచే భవభూతి ఊరికే అనిపించినాడా?

హంసవింశతిలో వర్ణించబడ్డ వీధిబళ్లు ఏ ప్రాంతంలోనివో తెలియదు. పరిభాషలో కొన్ని తేడాలు కన్పిస్తున్నాయి. ఏబది ఏండ్ల క్రితం నేటి కర్నూలు జిల్లా (నాటి బళ్లారి జిల్లా), ఆలూరు తాలూకా, జొహరాపురం గ్రామం (ఇది ''వేయి పడగలు''లోని ''సుబ్బన్నపేట''వలె నేడు తయారయింది లెండి)—ఇది మా వూరు లోని వీధిబడి గురించి వ్రాస్తాను.

## బడి – గుడి

బడిని చింతచెట్టు కిందకాక,దేవుని గుడిలో నడిపేవారు. మా వూళ్లో మధ్య చెప్పాలండవుగా! కాబట్టి బడిని గుడి అనేవారు. వాడు గుడికిపోడు అంటే వాడు బడికిపోడు అని అర్థంగా ఉండేది.

## బండకొయ్య

''కోదండం'' (అంటే పిల్లవాని వీపు నేల కానుకొనునట్లు పడవేసి, ఒక మోకాలు వంచి పైకెత్తి దాని చుట్టూ వచ్చేటట్లు చేతులను చేర్చికట్టి, వానిని పైకి తీసికొనేందుకు వీలులేకుండా, చేతులమీదుగా మోకాలు సందులోనుంచి ఒక పొడుగాటి కర్ర దూర్చుట) అని దేన్నయితే జి వి రత్నంగారు వర్ణించినారో దానిని 'బండకొయ్య'' అనేవారు.

## కోదండం

ఇక ''రెట్టలెగబట్టు పట్టించుట'' అని జి వి రత్నంగారు దేన్ని పిలిచినారో, దాన్ని మా ప్రాంతంలో ''కోదండం'' ఎక్కించుట అనేవారు. పై కప్పుకు ఒక పగ్గాన్ని లూప్ అగునట్లుగా కడతారు. బాలుని పైకెత్తి దాన్ని పట్టుకోమంటారు. వాడు దాన్ని వేళ్లు పెనవేసికొని పట్టుకొని వేలాడవలెను. పగ్గంను బిగబట్టినప్పుడు వింటి నారిని సాగదీసినట్లుంటుంది కాబట్టి దీన్ని కోదండం అని వుంటారని నా వూహ. వ్రేలాడే బాలుని పృష్ఠంమీద ఈతబెత్తంతో రెండంటిస్తాడు అయ్యవారు. వ్రేలాడే వానికింద ఇంకొక పిల్లవాని పలక వుంచుతారు. వాడు క్రిందికి దుముకుతాడో, పలక ''పలిగి'' పోతుంది. దానికి దుడ్లు కట్టేయవలసి వస్తుంది. పైకముడిగితే అప్ప తంతాడు. క్రింద ముళ్లకంప వుంచుట వుండేది.

## ముంత పొగ

ఒక మంటి ముంతలో కాలే ఎండు మిరపకాయలు వేసి ఆ ముంతను వ్రేలాడే బాలుని కాళ్లకింద వుంచేవారు ఘాటు పొగ వానిపై ప్రసరించేది. వాని బాధ వానికే తెలుసు.

## కుర్చీ

పిల్లవాడు నడుమువంచి తల మోకాళ్లకు తగిలేటట్లు నిలబడి చాలాసేపు ఉండవలెను. దీనిని కుర్చీ వేయుట, కుర్చీ కూర్చుండుట అనేవారు.

## గోడ కుర్చీ

మోకాళ్లను 90 డిగ్రీలు వంచి బొందె నిటారుగా వుండేటట్లు, అంటే మనం కుర్చీలో కూర్చునే స్థితి, నిలబడి వుండుట (ఉత్కటాసనంలో వలె) ఇంకొక శిక్ష.

## సున్నామానం

'శ్రీ—చుక్క' పద్ధతినే సున్నా (శూన్య) మానం అనేవారు. చుక్క సున్న అయింది.

## అయ్య

ఉపాధ్యాయుణ్ణి ''అయ్య'' అనేవారు. ''ఐవారు'' అనే పదం వైశ్యులు బ్రాహ్మణ్ణి పిలిచేది.

## పెద్దబాలశిక్ష

హంసవింశతి కాలంలో లేదు కాని పందొమ్మిదవ శతాబ్దంలో ''పెద్దబాలశిక్ష'' అచ్చయింది. ఇదొక మినీ విజ్ఞాన సర్వస్వం. ఇది చదివే స్థితికి వచ్చిన పిల్లవానికి అన్నీ వచ్చినట్లే లెక్క. తర్వాత పోతన భాగవత పఠనం, ''అమరం'' (అమరకోశం) కంఠాపాఠం చేయుట. ఆ తర్వాత సెలగోలు, కాడి బుజాన వేసికొని సేద్యానికి పోవుట. కట్టకడపటిదాన్ని నాలాంటివారు కొందరు తప్పించుకొని పల్లెలకు దూరమైనారు. ''జనారణ్యా''లలో పోగొట్టుకొని పోయినాము.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

## వర్తమానమో ? భవిష్యత్తో?

భారతి—మే '79—గ్రంథవిమర్శలు—"జననం" కవిత—'ప్రవేశిస్తోంది' ప్రయోగం గూర్చి వివరణ :

బి. నరసింగరావుగారి కవితను సమీక్షిస్తూ శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి ఒక ఆక్షేపణ లేవనెత్తారు.

"పేదరికం ప్రతి తలుపు తట్టి ప్రవేశిస్తోంది; ఈ గ్రామాలలో ప్రజల కదీ తోబుట్టువైంది."

పై వాక్యంలోని "ప్రవేశిస్తోంది" అనే మాటమీద ఈ వ్యాఖ్యానం ఇట్లా కుండలీకృతమై యుంది :

(ఈ కోవ వ్రాతగాండ్ర రచనలో ఈ వస్తోంది అన్నది వర్తమానమో భవిష్యత్తో ప్రస్ఫుటంగా తోచదు.)

మ కో రె గారి వ్యావహారిక భాషాజ్ఞానానికి పై వ్యాఖ్యానం నిలువుటద్దం.

"ప్రవేశిస్తోంది" అనే క్రియ అసలు ఎట్లేర్పడుతున్నదో పరిశీలిద్దాము —

ప్రవేశించుచున్నది—గ్రాంథికరూపం—తాత్కాలిక వర్తమాన కాలం—present continuous tense తెలుపుతున్నది. దీని రూప పరిణామం —

1. ప్రవేశించు చున్నది→ప్రవేశించుతున్నది→ప్రవేశింసుతున్నది (వాడుకలో లేదు)→ప్రవేశింస్తున్నది (వాడుకలోలేదు)→ప్రవేశిస్తున్నది→ప్రవేశిస్తుంది=ప్రవేశిస్తోన్నది, ప్రవేశిస్తోంది. ప్రవేశిస్తున్నాయి, ప్రవేశిస్తోన్నాయి (బహువచన రూపాలు).

2. "ప్రవేశిస్తు" అనే శత్రర్థక రూపాన్ని మా వైపు (నెల్లూరు జిల్లా) "ప్రవేశిస్తా" అని వాడుతాము. (ప్రవేశిస్తా ఉండాడు. మొ.) ప్రవేశిస్తా + ఉన్నది=ప్రవేశిస్తోన్నది,ప్రవేశిస్తోంది (గుణసంధి పద్ధతితో ఏర్పడిన రూపం.)

పై పరిశీలననుబట్టి 'ప్రవేశిస్తోంది" వర్తమానకాలాన్ని మాత్రమే తెలుపుతుంది. భవిష్యత్తు అసలు తోచదు. మ కో రె చెప్పిన "వస్తోంది" కూడా వర్తమానమే, భవిష్యత్తు కాజాలదు. భవిష్యత్కాల స్ఫురణ కలిగే "వస్తోంది" వాడబడ్డ వాక్యం ఒకటి మ కో రె చూపగలిగితే వారి వ్యాఖ్యానం పునఃపరిశీలనార్హం కావచ్చును.

ప్రవేశిస్తుంది, వస్తుంది—వంటి రూపాలలో భవిష్యత్కాల సూచన తోస్తుంది. ఈ రూపాలలో వర్తమానం, తద్ధర్మం, భవిష్యత్తు—సందర్భానుగుణంగా గోచరిస్తుంది.

పై భారతి సంచికలోనే—70వ పేజీ—సి. ఎ పి. శాస్త్రి గారు "అంతమవుతోంది", "కనిపిస్తోంది" అని వ్రాసి ఉన్నారు. 25వ పేజీలో "ఆంధ్రపత్రిక" ప్రకటన వాక్యం చూడండి... "ఏడు దశాబ్దాలుగా తెలుగువారికి సేవ చేస్తోంది." వీటి బహువచన రూపాలు 14వ పేజీలో శ్రీ యన్నంరెడ్డి వెంకటరెడ్డి ప్రయోగించారు—తేస్తోన్నాయి, వస్తోన్నాయి. కీ. శే. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వాక్యాలు 8వ పేజీలో గమనించండి—జరుగుతోంది, కుదురుతోందే.

1979 జనవరి భారతి 'స్వ విషయం'లో "అనిపిస్తోంది" వాడబడింది నిశ్శబ్ద సంగీతం—సంఘమిత్ర — అన్వేషిస్తోంది, అంటోంది. జీవన సంధ్య యర్రమిల్లి చలపతిరావు —నిష్క్రమిస్తోంది, ప్రగల్భిస్తోంది. తెల్లని పక్షి—మల్లెల — పెనుగులాడుతోంది, పోతోంది. భావవిహంగాలు — పి. నరసింహారెడ్డి—కొట్లాడుతోంది. 68 పేజీ—పుటిచెర్ల సాంబశివరావు నిలుస్తోంది.

'79 ఫిబ్రవరి, భారతి-కాంతికత్తులు-దాట్ల నారాయణమూర్తిరాజు — తళతళ లాడుతోంది, చేస్తోంది, రాలుస్తోంది. దూరంగా పారిపో—కాసల నాగభూషణం—కురుస్తోంది, ప్రాకుతోంది.

మార్చి భారతి - 7 పేజీ—డాక్టర్ చెళ్లపిళ్ల సూర్యనారాయణమూర్తి—చేస్తోంది. 28 పేజీ—మల్లాప్రగడ రామారావు—నిమురుతోంది.

ఏప్రిల్ భారతి—11 పే—సాంధ్యశ్రీ — ఆవులిస్తోంది, ఆరగిస్తోంది. 47 పే—మహేంద్ర—పోతోంది, తింటోంది, 48 పే—పలుకుతోంది, సమీపిస్తోంది.

ఈనాటి తెలుగు వ్యావహారికం గుర్తిస్తున్న వారెవరూ 'వస్తోంది' వంటి రూపాలతో భవిష్యత్కాల సూచన గోచరిస్తుందని అనుకోరు. సినిమాల పత్రికల భాష అలెర్జిక్‌గా ఫీలయ్యే డాబుసరి పండితులు వ్యావహారిక వచన కవితా సంకలనాలు సమీక్షించడం, కంబళిలో అన్నం తింటూ వెంట్రుకలేరి పారేస్తున్నట్టుంటుంది.

శ్రీ మరుపూరు అంగీకరించకపోతే చింతలేదు; యువ రచయితలు వీటిని స్పష్టంగా గుర్తిస్తారని ఇలా చర్చ చేశాను.

*శ్రీ బండి నాగరాజు*

## ప్రశ్నే ప్రగతి పై సమీక్ష ?

'ప్రశ్నే ప్రగతి' అనే కావ్యాన్ని సమీక్షిస్తూ "ప్రశ్నే ప్రగతి—ఔను!...... అడగడాన్ని గద్దెపై కూర్చుండబెట్టినారు" అన్నారు. ఒకరు కూర్చుండ బెడితే కూర్చునే విషయం కాదది, దానికి సహజంగా కూర్చునే అర్హత, సామర్థ్యమూ మానవ జీవితంలో ఉంది. ఆ సామర్థ్యమే దానికి జీవితంలో, సాహిత్యంలో, సైన్సులో అగ్రసనాధిపత్యం కలిగించింది.

"ప్రశ్నించండి ప్రశ్నించండి
ప్రశ్నించకనే జ్ఞానం ఏదీ ?

భూమ్యాకర్షణ శక్తిని న్యూటన్
కనుగొందెట్లాది ఇట్లే కాదా?''

అని రచయిత విజ్ఞానం కోసం ప్రశ్నించమన్నాడు. దాన్ని గమనించకుండానే, సమీక్షాకారుడు 'ప్రగతినే కాదు విజ్ఞానాన్ని వెలికితీయగల ప్రశ్నలు గొప్పవ'ని దానిపై ఏదో దోషాన్ని ఆరోపించబోతాడు.

''కావాలని కూర్చొని రాసే కవితేం కవితోయ్?! జీవన రగడలో తేలిన రసగుళికే కవితోయ్''అని ఉన్న రెండు పాదాలగేయాన్ని తుంచి కేవలం మొదటి పాదం మాత్రమే ఉటంకించి 'అర్థంలేని ఆవేశం . సుఖ దుఃఖాలు రెండూ రసస్ఫూర్తి కలిగిన కవిత్వాన్ని పుట్టించుతవ'ని దానిపై దుమ్ము చల్లబోతాడు సమీక్షాకారుడు. 'జీవనరగడ'—అంటే అనుభూతి ఒక్క మాటలో. అదైనా 'రసానుభూతి' అయితేనే 'కవిత్వం' ఐద్ది. అది కానిది మిగతా ఏ వచన రచనాసాహిత్య ప్రక్రియ ఐనా ఐతుంది. శృంగార కవితకూడా 'విరహతాపాన్ని' అనుభవించిన సహృదయుడైన రచయితమాత్రమే లోకోపయుక్తమైనదిగా రాయగలుగుతాడు. అసలు పెళ్ళి చేసుకోవాల్సనే సుఖలాలిత్యం 'వయసు ఒరపిడికి' తట్టుకోలేకనే! 'అనుభూతి' అనేది కేవలం దుఃఖాత్మకంగానే ఉండదూ, సుఖాత్మకంగా కూడా ఉంటుందని సమీక్షాకారుడు తెలిసికోవడం మంచిది. జీవితంలో ఏ రగడ కలక్కుండానే అది సుఖాత్మకమైనదైనా దుఃఖాత్మకమైనదైనా మనిషికి, అందులోనూ రచయితకి అనుభవం గానీ రచనగానీ పుడుతుందేమో సహేతుకంగా నిరూపించమనండి చూద్దాం! ఎలా నిరూపిస్తాడో!!

'సరుకు మామూలుదైనా' అనడంలో కూడా అర్థం లేదు. కవి నిత్యజీవితంలోని సంఘటల్నే కవితగా మలుస్తాడు. అవి వేమన ఆటవెలదుల్లాంటి కొద్ది కవితలే కావొచ్చు, గురజాడ కన్యక, పూర్ణమ్మలాంటి పెద్ద కవితలే కావొచ్చు. సమీక్షాకారుడు ఏది పొగరో, ఏది పౌరుషమో గుర్తించకుండానే 'ఎగు పొగురు' అని అబద్దానికి పాలుపడ్డాడు. ముసలివాళ్ళను, పిల్లవాళ్ళను లేదా పేదవాళ్ళను సవాల్‌చేస్తే అది పొగరైతుంది. దుండగుణ్ణి, మదాంధుణ్ణి, మూర్ఖుల్నీ సవాల్‌చేస్తే అది పౌరుషం ఐతుంది. ప్రశ్నే ప్రగతిలోని ప్రతికవితా రెండో విధంగా నడిచిందే! ఏవో కొన్ని పరిశీలనాత్మక కవితలు మిగిల్చ. భాష గూర్చి చెప్పిన మాట ఆలోచనాత్మకమైంది.

సమీక్ష ఓ విధమైన విమర్శే! విమర్శ అన్నపుడు మంచి కొంతా చెడు కొంతా చూపాలిగదా అని లేని చెడును సృష్టించి, ఉన్న మంచిని ఏ తలాతోకా ఆధారం లేకుండానే ఆరామడకోమాటా రాసూపోతే సరైంది కాదు. ఉన్న చెడుకు సరైన ఆధారం, ఉన్న మంచికి సరైన ఆధారం చూపూ చేసిన సమీక్షలవల్ల రచయితలు సంస్కారవంతులౌతారు లేకపోతే ఏది మంచో ఏది చెడో తెలియక గందరగోళంలో పడతారు.

శ్రీ పాటి దశరథరెడ్డి

## వ్యాసుడు: గ్రన్థ చౌర్యమా!

అక్టోబరు నెలలోని శ్రీ పెద్దాడ నారాయణ శాస్త్రిగారి వ్యాసం 'భారతి' పత్రిక ద్వారా 'వ్యాసుడు: గ్రన్థ చౌర్యమా' అనే చర్చనీయాంశను పాఠకుల ముందు విలబెట్టినది.

భారతిలోని 41 వ పుట 3 వ పేరాలో శ్రీ శాస్త్రిగారు తమ అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చినారు.

''వ్యాస వాల్మీకు లిరువురు మునిపుంగవులు, తపశ్శాలురు, స్వార్థరహితులు, త్రికాలవేత్తలు, ఉత్తమ రచయితలు, ధర్మమార్గదర్శకులు, లోక కళ్యాణ కారులు. అట్టియెడ వేదవ్యాసుడు వాల్మీకి కవనమును గ్రన్థస్థ మొనరించుకొనుటలో నాతనిపై యాదరమున శ్లోకములను, భావములను, పాత్రచిత్రీకరణములాది యాతని రచనా పటిష్ఠతను విడువక సంతరించుకొనెనేమో!''

శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు ''వ్యాసుడు ద్వాపరయుగావసాన కాలమున వేద విభజన, అష్టాదశ పురాణ రచనలతోబాటు భారతేతిహాసము గూడ రచించెననియు గ్రంథములు తెలుపుతున్నవి.''

శ్రీ వేద వ్యాసులవారు వాల్మీకి తరువాతివారు. వాల్మీకి 'రామాయణం' చదువు భాగ్యం శ్రీ వ్యాసులవారికి దొరికివుండినది. వేదము లన్నియు చదివి, పంచమ వేదమగు భారతమును వ్యాసులవారు రచించిరి.

రామాయణ కథకు — నల దమయంతి కథకు చాల సన్నిహిత పోకడలు కలవు. దానిని శ్రీ శాస్త్రిగారు నిరూపించినారు.

అట్టి సమయమందు శ్రీ వ్యాసులవారు తమకు తెలియకుండగనే వాల్మీకి రామాయణములోని శ్లోకములను భారత మందలి 'నలచరిత్రలో' గ్రన్థస్థ మొనరించి యుండును. శ్రీవ్యాసుల వారికి గ్రన్థ చౌర్యముచేయు నుద్దేశ్యము వుండియుండదు. ఒకవేళ అట్టి సంఘటన కాకతాళీయంగా ఎందుకు జరిగియుండరాదు.

''వ్యాసుడు: గ్రన్థ చౌర్యమా! కాదా! యన్నది చదువరులకు విడిచితిని. మహర్షుల విమర్శింప మనబోంట్లకు తగదుకదా!'' అని చెప్పి శ్రీ శాస్త్రిగారు తమ నిరహంకారమును ప్రదర్శించి యున్నారు. మహాభారతంలో 'అ, ఆ, ఇ, ఈ' తెలియని నా వంటి చదువరి చెప్పు విషయంలో అర్థం కొంతైనా వుంటుందనే సాహసంతో నాల్గు మాటలు చెప్పాలనుకొన్నాను.

(1) కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడని వ్యాసులవారు గ్రన్థ చౌర్యము చేయజాలరు.

(2) వాల్మీకి రామాయణమును చదివిన వ్యాసుల వారు తమకు తెలియకుండగనే రామాయణ శ్లోకములను, నలచరిత్రలో వ్రాసియుండవచ్చును. (అట్లు సంభవించు అవకాశము కలదు.)

(3) వ్యాసుల వారికి గ్రన్థ చౌర్య మంటగట్టుట కేవలము మూర్ఖత్వమే అని చెప్పవచ్చును.

(4) రామాయణంలోని కొన్ని శ్లోకాలు — నల చరిత్రలోని శ్లోకాలకు సన్నిహిత సారూప్యాలున్నచో, అదియూ కాకతాళీయంగా జరిగి వుండవచ్చును

శ్రీ హెచ్. హరిశ్చంద్రారెడ్డి

శ్రీ పెద్దాడ నారాయణశాస్త్రిగారు పై శీర్షిక క్రింద నొక విమర్శనా పూర్వకమగు వ్యాసము ప్రకటింపజేసిరి. (భారతి అక్టోబరు సంచిక) నాకు తోచిన కొన్ని విషయములీ క్రిందివిధముగా వివరిస్తున్నాను.

శ్రీ శాస్త్రిగారు భారతరామాయణములు అమరభాషలో వేర్వేరు కవులగు వ్యాస వాల్మీకు లిరువురు రచించిన కావ్యములుగా గన్పడినను, వానిలో పోలికలు గన్పించుచున్నవి. పైదు మిక్కిలి ఒకే శైలిలో గన్పట్టుచున్నవని నాలుగు శ్లోకము లుదాహరించిరి. రామ భక్తుడగు వాల్మీకి కవి విరచిత రామాయణ కావ్యమును వ్యాసుడనుకరించిన యనుకరింపవచ్చును లేదా యది యమ్మహాత్ముని స్వతంత్ర రచననే యగునేమో. ఒకే రీతిలోనున్న వేర్వేరు కథలు ఒకే ఫక్కిలో నడచినను రచనలో సామ్యము గన్పించుట చౌర్యముగా నెట్లు చెప్పబడును? అదే వర్ణనము రెండిటిలో పొసగినది. పొసగక పోయి యర్థమున తప్పు గన్పట్టిన కేవలానుకృత రచన యన వచ్చును. అనుకరించినను మహాకవియగు వాల్మీకి ననుసరించిన నది గ్రంథచౌర్య దోషమునకు పాల్పడదని చెప్పవచ్చును. ఈ నాడును కవులు—పోతన శ్రీనాథాది కవుల మార్గమవలంబించి వారి రచన లోని రీతిని యథాతథముగను మాత్ర మనుకరించుట నొక ప్రత్యేక సందర్భమున గ్రంథచౌర్యమే కాబోదు. అసమర్థుడైన కవి తనకు చేతగాక నొక కవి ననుకరించి—తన రచనమేయని బొంకువాడు గ్రంథ చౌర్య క్రియానిందకు తగినవాడు (పాత్రుడు). ఎట్లు వ్రాసినను వ్యాసమహర్షి సామర్థ్యమునే పురాణమున తడివి చూచినను గోచరమగును. ఒక్క భారతమున తలచిన, వ్యాసునకు వాల్మీకి భాష వాడిన మాత్రమున సందర్భోచితి, పాత్రోచితి, కథాగమనమున కనుకూలించునటుల వాల్మీకి ననుసరించుట వ్యాసునికి గ్రంథ చౌర్యమేయను భావము తట్టకుండినదా? అతడంతటి తక్కువబుద్ధి గలవాడా?

''శ్లో: అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరోహరిః। అఫాల లోచనశ్శంభుర్భగవాన్ పాదరాయణః'' వేదవ్యాసం సరస్వత్యావాసం వ్యాసమ్ నమామ్య హమ్ అని సంప్రదాయానూచానముగా ఆయన స్తుతి పాడెడు పౌరాణికులు గలిగిన యీనాడు శాస్త్రిగారు వ్యాసుని లోపముల నెత్తుచున్నప్పుడు పండితులగు వారూరకుందురా! ఇంకను వ్యాసరచనలు పరిశోధింపబడవలెను. ''వ్యాసోనారాయణోహరిః. అష్టాదశపురాణములు వ్యాసప్రోక్తములు గణేశ్వరలిఖితములను విష యము నిర్వివాదముగా జగద్విదితము. వ్యాసయనునది బిరుదని, వేర్వేరు వ్యక్తులు వ్యాసులై పురాణముల నెక్కు రచింతురని యుండుటచే నెవ్వవ వ్యాసుడు యీ భారతమును వ్రాసినాడో యను నది వివాదాంశమే'' యని రచయిత వ్యాసమున వ్రాసిరి. ఇదియొక యూహామాత్రమే యని చెప్ప సాధ్యమగుచున్నది కాని దీని కాధారమగు సాక్ష్యమెద్దియు గలదేని శాస్త్రిగారు తెలిపిన సంతసింతును. కాళిదాస మహాకవి శివపురాణము (వ్యాసకృతము) నాధారముగా గొని కుమార సంభవమును వ్రాసినాడని సాక్ష్యముగ మొదటి శ్లోకము గన్పించును. 41వ పేజీ భారతిలో 3వ పేరాలో రచయిత వ్రాసినదే వారి సందేహమునకు సమాధానము పలుకుచున్నది. ''మహాకవిత్వాత్పాదృశ్యాత్. తనకంటె పూర్వుడగుకవి కవిత తప్పక యనుకరింప వచ్చును గదా !''. పూర్వ కవీశ్వర వాక్ప్రయోగ దక్షుడు కవిగా చెప్పబడినాడు. ఇది లాక్షణికతకాకపోదు. అయినను ఈనాడు కవులు పెద్దన వ్రాసిన సమాసము తనదిగా వాడుచుండగ ఆనాడు వాల్మీకి యడుగుజాడ వ్యాసునకు ఆదర్శము కాదా! వారిరువురు భగవత్ప్రసాద లబ్ధ కవిత మనకందించిరి యనుట నిస్సందేహము. ఈనాడు శాస్త్రిగారి దృష్టిలో నీ విషయము బయల్పడిన వ్యాసుని కపఖ్యాతి కలుగదనుకొందును. ఇరువురి యందుగల శారద యొకటియే యని శాస్త్రిగారు నమ్ముటలో యీ భావము మాసిపోగలదు. రామాయణము గంగగా చెప్పబడినది మరియు గంగా వాహిని సముద్రము వంటి వ్యాసరచనమున ప్రవేశించిన యది నిసర్గరమణీయము సాధారణ విషయమే! అపారమగు పురాణ సాహిత్యమును తనకల్పనా చమత్కృతితో నవరసోదయముగ వ్రాసిన వ్యాసమహర్షివలె వాల్మీకియు వ్రాసినచో నతని క్రింద దివిటీ క్రింది దీపమువలె వ్యాసుడు ప్రకాశము గోల్పోవువాడే గదా! శ్రీమద్భాగవత దేవీ భాగవతాది పురాణములు రచయిత చదివియుండవచ్చును; అవి వ్యాస ప్రతిభా వ్యుత్పత్తులకు సాక్ష్యములు కావా! ''ఆసీత్ దశరథో నామ'' యను వాల్మీకి శ్లోకము ''ఆసీత్ రాజా నలో నామ'' యను వ్యాసుని శ్లోకమును నొకేరీతిగ గన్పడి నంతనే 'గ్రంథచోర' బిరుదము వ్యాసుడు పొందుట శ్రీ శాస్త్రిగారి నిందాత్మక వచో వైఖరి కొంత విస్మయము గలుగజేయును. వాల్మీకిని వ్యాసు డనుకరించినను అది తప్పు అనువాదము జేసిన వారింతవఱకు శాస్త్రిగారేనని వెల్లడియైనది. శ్రమపడి వారు కొన్ని సంగతులు వ్యాసమున ప్రకటించిరి. పండితులగు వారీవిషయమును కూలంకషమగు చర్చ చేయవచ్చును.

కవులు నిరాధారముగా యేమియు వ్రాయరు. ప్రతి రచయిత మరొక రచయిత వస్తువుపై యాధారపడక తప్పదు. ''Poetry is communication of vision great poetry is great vision'' అని కీ. శే. సర్వేపల్లి రాధాకృష్ణ యొక స్వీయవ్యాసమున నభిప్రాయపడిరి. వ్యాస కవిత యొక మహాకవిత. భగవద్గీతాది దుర్గమమగు వేదాంత పారిభాషిక కవిత వ్యాసుని సొమ్ము. ఒక రామాయణ షట్కాండములు వాల్మీకి వ్రాసెను. ''క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి.'' ఒక భారతమున, నదియు నలోపాఖ్యానమును చూచి శాస్త్రిగారు వ్యాసునిపై నపోహపడిరి. వాక్సుద్ధిగల యిరువురి వాణి యొకటియైనను నగుచో సందియమున కెక్కువగా వాదనమేల ? వ్యాసుడు వాల్మీకి నుండి గ్రంథ చౌర్యము జేసినట్లు రచయిత సందేహించిరి. ఒక విధముగ నొకానొక రచయిత రచనపై యాధారపడని స్వతంత్రములగు రచ

నములే నేడు గన్పింపవు. వ్యాసునిపై యీ భావముగల శాస్త్రిగారు తానుగాని లేక ఇంకొక రచయితచే గాని గ్రంథ చౌర్య మనునట్టి దుర్భావన గన్పింపని రీతిలో స్వీయరచన వ్రాసి వ్యాస ప్రతిభకు మచ్చ పెట్టవచ్చును. సమర్థులు దొంగతనము చేసినను శిక్షలుండవు ఈనాటి లీడర్లలాగా. ఒక వ్యాసుడు మీవల్ల నింద పైగొనెను. కవి త్రయము ఆంధ్ర భారతమును వ్రాసినట్లు మలొక ఆధునిక అమర భాషాకవి శ్రీ వరదాచార్యులు, సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారువంటి మహాకవులు ఆ ఘట్టమును వ్రాసి కీర్తికాంతకు పతులైన మంచిది. అది వ్యాసునిపై దెబ్బ తీసినట్లు అనుకరణా రహితమగు స్వతంత్ర భాష గలిగియున్న చాలును.

"వివాదగ్రస్థమైన ప్రతియంశము గురించి అనంతముగా చర్చించడం శుద్ధ అవివేకము"అని విలియమ్ పెన్ అను పాశ్చాత్య తాత్వికుని వచనము గలదు. వ్యాసుడు బ్రహ్మ సూత్రములను వ్రాసి నాడు. అతనికిగల స్థానము గొప్పది. 'బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వమ్' అని బాణ మహాకవి ప్రశంసిగలదు. అటులనే పురాణములు వ్రాసిన వ్యాసుడు గ్రంథ చౌర్య నేరమున కర్హుడగుచున్నాడా! అను చర్చ "విద్యా వివాదాయ ధనం మదాయ" అని చెప్పిన రీతిగా విరమింప వలసినదే!

*శ్రీ దేశపతి గోపాలకృష్ణ*

## కలగూర గంపలో కుళ్లిపోతున్న కూర (కుర్ర) గాయలు

నందిని సిధారెడ్డిగారు, కె. అంజయ్యగారు అనే "సాహితీ మూర్తులు" ఏ కాఫీ హోటల్లోనో, రచ్చబండ కాడో చుట్ట కాల్చుకుంటూ చెప్పుకోవలసిన కబుర్లను 'భారతి'లో పెద్ద చారిత్ర కాంశాలుగా చర్చించుకోవడం కోతికొమ్మచ్చి ఆడినట్లుంది. (వాళ్ల వయస్సు ఎంతో?) ఇకనైనా ఆటలు ఆపేస్తే 'భారతి'లో 'స్పేస్' ఓ మంచి పనికి ఉపయోగపడుతుంది; అయ్యలూ!!...

బుజ్జీ!! సిధారెడ్డి, నీవు ఇంగ్లీషు పదాలు వాడడంతోపాటు తెలుగు పదాలు కూడా వాడడం నేర్చుకో ... నాయనా.

చిట్టీ!! అంజయ్యా, నీవు గుణితంతో పాటు తెలుగు వ్రాయడం నేర్చుకో...తండ్రీ.

పనికిమాలిన సంగతులు నానినా, ముదిరినా పాఠకులు ప్రాణా యామం చెయ్యాల్సి వస్తుంది మరి.

*శ్రీమతి భాగవతుల శారద*

## క్షమాపణ చెప్పుకోవాలి

'79 అక్టోబరు భారతిలో నందిని సిధారెడ్డిగారి పిచ్చి కుది రిందిట! రోకలి తలకు చుట్టాలిట!! గురించి –

సిధారెడ్డిగారు ముందుగానే 'భారతి'కీ పాఠకులకీ క్షమాపణ చెప్పుకున్నారు. కనుక ఇంక వారిని ఆక్షేపించవలసిన అవసరం లేదు. కాని ఇలాంటి చెత్త కరస్పాండెన్సుతో పేజీలు నింపినందుకు 'భారతి' సంపాదకులు పాఠకులకు క్షమాపణ చెప్పుకోవలసి ఉన్నది.

*డా. చన్నాప్రగడ తిరుపతిరావు*

## భారతీ - పాఠకులూ - క్షమించరు

ఈమధ్య 'భారతి'లోని కలగూరగంపలో కనిపించే ఇద్దరు మిత్రులను అదే ఇంటి పేరున పిలవాలి అనిపిస్తుంది. వారు శ్రీ కలగూరగంప సిధారెడ్డిగారు, శ్రీ కలగూరగంప అంజయ్యగారు.

'భారతి' పాఠకులకు మీ విజ్ఞానం తెలుపుకోవడం కోసమే అయితే స్వీయ చరిత్రలు వ్రాసుకోండి.

ఇలాంటి ఊకదంపుడు వ్యర్థపు వ్యాయామం అనారోగ్యకరం.

*శ్రీ నాళేశ్వరం పెంచలయ్య*

## స వ ర ణ లు

అక్టోబరు భారతిలో ప్రచురింపబడినది 'కాకతీయ యుగ మున న్యాయపాలన' అను నా వ్యాసమున ఈ క్రింది దోషములున్నవి. అవి సవరించుకొని చదువుకొనవలసినదిగా పాఠకులకు వినతి.

1 పుట52లో అనుకూల్యతా అనుపదమునకు(adaptability) అని ఉండవలెను పొరబాటున (flexibility) అని పడినది.

2 పుట 56 లో అధోజ్ఞాపిక 5 నందు పింగన, పద్యము 974 అని యుండవలెను· పొరబాటున బంగన అని అచ్చయినది.

*చలిచం సీత*

## వి జ్ఞ ప్తి

ట్వంటీఫస్ట్ సెంచరీ రైటర్స్ అను పదకొండవ ప్రచుర ణగా ఇంగ్లీషులో వెర్స్ ప్రచురిస్తారు. దీనికి ప్రపంచంలో ఎవరైనా రచనలు పంపవచ్చును. హాస్యం, వ్యంగ్యం, రియలిజం ప్రతిబిం బించే వెర్స్ పంపడం మంచిది. రచనలు కాగితానికి ఒక పక్క పైపు కొట్టించి పంపాలి. ఇదివరకు ఏ విధంగానూ ప్రచురింపబడలేదని హామీ జత పరచాలి. సరిపడిన స్టాంపులు అంటించిన కవరుపంపాలి.

*శ్రీ నిష్టల వెంకటరావు*

సంకలనకర్త

21స్ట్ సెంచరీ రైటర్స్,
26–3–22 దాసన్నపేట,
విజయనగరం – 531 202.

# గ్రంథ విమర్శలు

## రెండు సాహిత్యశాస్త్ర గ్రంథాలు

### కావ్యాలంకారః

[బాలానందిని అను ఆంధ్ర వ్యాఖ్యతో కూడినది. వ్యాఖ్యాత: డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, క్రౌన్ సైజు 10+216 పేజీలు, వెల : 8 రూ, సుర భారతీ సమితి ప్రచురణ. ప్రతులకు : కార్యదర్శి, సుర భారతీ సమితి, ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు – 500 007.]

కొన్ని యేండ్ల క్రిందట హైదరాబాదులో స్థాపించబడిన సుర భారతీ సమితి సంస్కృత భాషా వ్యాప్తికి ఎంతో పాటుపడుతున్నది. ఆ సమితి ప్రకటించిన వార్షిక సంచికలు అమూల్యాలైన వ్యాసాలు పెద్ద పండితులకు కూడా ఎంతో ఆశ్చర్యానందాలను కలిగిస్తున్నాయి. సంస్కృతంలోవున్న శాస్త్రీయవిషయాలను ఈనాడు ప్రచారం చేయ్యవలెనంటే భాషాంతరాల మూలంగానే చెయ్యవలసి వుంటుందని గ్రహించి, ఆ సమితి మూల సంస్కృత కృతులకు భాషాంతరాల్లో చక్కని వ్యాఖ్యలు ప్రకటించాలని నిశ్చయించి తొలిసారిగా భామహుని 'కావ్యాలంకా'రాన్ని చక్కని వ్యాఖ్యతో ప్రకటించింది.

వ్యాఖ్యాత సంస్కృతాంధ్రాంగ్ల ప్రాకృత భాషల్లో సమర్థులైన విద్వాంసులు, బహు గ్రంథకర్తలు, కవులు. వారి రచనలు విద్వాంసులకు శిరోధార్యాలు. ఆయనకు సాహిత్య శాస్త్రంపైని ప్రత్యేకాభిమానమూ, ఆసక్తీ ఉన్నవి ఇది వరలో కేంద్ర సాహిత్య అకాడమీవారు వీరిచేత కుంతకుని వక్రోక్తి జీవితాన్ని అనువదింపజేసి ప్రకటించారు. అది ప్రశస్తిని గడించింది. ఇప్పుడు భామహుని అలంకారశాస్త్ర గ్రంథాన్ని రామచంద్రుడుగారు తమ బాలానందినీ వ్యాఖ్యతో ప్రకటింపజేస్తున్నారు.

భామహుడు ఆలంకారికుల్లో ఆద్యుడని చాలమంది అభిప్రాయం. విద్యానాథుడు 'పూర్వేభ్యో భామహాదిభ్యః' అని అతనినే మొదట పేర్కొన్నాడు. దండి, భామహులు–పేర్లు చెప్పకోకుండా ఒకరి నొకరు విమర్శించుకున్నట్లు పరిశోధకుల అభిప్రాయం. వీరు ఒకవేళ సమకాలికులయినా, భామహుడు వయస్సులో పెద్దవాడై ఉండునని కొందరి ఊహ. ఇతని గ్రంథమే మొదటిదని చాలామంది అభిప్రాయం.

దండి కావ్యాదర్శం, వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి, ఆనందవర్ధనుని ధ్వన్యాలోకం, పండితరాజు రసగంగాధరం మున్నగు గ్రంథాల కిది వరకే అనువాదాలు, వివరణలు వచ్చాయి. కాని భామహుని గ్రంథం ఎవరి దృష్టిలోను పడినట్లు లేదు. ఆ లోపాన్ని యిప్పుడీ బాలానందినీ వ్యాఖ్య తీరుస్తున్నది.

కావ్యాలంకారం శ్లోకరూపమైన గ్రంథం. ప్రాచీనాలంకార గ్రంథాలన్నీ శ్లోక రూపంగానే ఉండేవి. ఇందులో ఆరు పరిచ్ఛేదాలున్నవి. మొదటి పరిచ్ఛేదంలో అరవై శ్లోకాలతో కావ్యలక్షణ స్వరూపాలు, దాని అంగాలు మున్నగునవి తెలుపబడినవి. రెండవ, మూడవ పరిచ్ఛేదాలు రెండింటిలోను నూట అరవై శ్లోకాలతో అలంకారములు వివరించబడినవి. నాల్గవ పరిచ్ఛేదంలో ఏభయి శ్లోకాలలో దోషాలు, అయిదవ పరిచ్ఛేదంలో డెబ్బయి శ్లోకాలలో న్యాయపద్ధతి వివరించబడినవి. ఆరవ పరిచ్ఛేదంలో అరవై శ్లోకాలలో శబ్దశుద్ధి ఉన్నది. ఇందులో వ్యాకరణ శాస్త్రంలోని అర్థాంశాల చర్చ కానవస్తున్నది. ఈ విధంగా ఇందులో సమగ్రంగా – సంగ్రహంగా కావ్యానికి సంబంధించిన సమస్త విషయాలూ తెలుపబడి ఉన్నవి.

మూల గ్రంథం శ్లోక రూపంలో సూత్రప్రాయంగా ఉన్నందున వ్యాఖ్య లేకపోతే అర్థం కాదు. కేవలం తాత్పర్య రూపంలో ఉన్నా ప్రయోజనం ఉండదు. అవసరమైన స్థలాల్లో విపులంగా వివరణ ఉంటేనేగాని మూలకారుని అభిప్రాయం ఏమిటో తెలియదు.

ఈ గ్రంథంలో ఇంచుమించుగా ప్రతీశ్లోకంలోనూ వ్యాఖ్యకు తర్వాత, ఆ శ్లోకానికి సంబంధించిన విశేషాలు వివరించబడినవి. పాఠ నిర్ణయంలోను, అర్థ నిర్ణయంలోనూ వ్యాఖ్యాత చూపిన హేతువులు అందరూ ఆమోదించదగినవి. ప్రతిభాది వివరణలోను, స్వభావోక్తి విషయమునను, వైయాకరణుల స్ఫోట చర్చలోనూ – ఈ విధంగా పెక్కు విషయాల్లో వ్యాఖ్యాత చూపిన ప్రతిభ ప్రశంసించదగి ఉన్నది.

సాహిత్యవేత్తలు, సాహిత్యతత్త్వ జిజ్ఞాసులు, సాహిత్యాభిమానులు తప్పకచదువవలసిన గ్రంథం యిది. ఇది వ్యాఖ్యాత సాహిత్య శాస్త్రంలో చేసిన ప్రగాఢ కృషి వ్యక్తమగుతున్నది. ఇదివరలో అలంకార గ్రంథాలకు తెలుగులో వచ్చిన అనువాద, వ్యాఖ్యా లన్నింటికంటె విషయ స్పష్టీకరణలో మేలై ఉన్నది. ఇట్టి గ్రంథాన్ని కూర్చిన శ్రీరామచంద్రుడుగారు, ప్రకటించిన సురభారతీ సమితివారు మిక్కిలి అభినందనీయులు.

### కావ్య మీమాంసా

[బాలానందినీ వ్యాఖ్యా సహితం. వ్యాఖ్యాత: డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, డెమ్మీ సైజు, 16 + 340 పేజీలు, వెల : 15 రూ. ప్రతులకు: శ్రీమతి పుల్లెల సుబ్బలక్ష్మి, ఆర్. 33, ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు–7.]

బహుముఖ ప్రజ్ఞాధురీణుడు, సంస్కృత ప్రాకృత భాషల్లో పెక్కు గ్రంథాలు రచించినవాడును అయిన రాజశేఖరుడు సాహితీ శాస్త్రవేత్తలలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించిన మహామనీషి. అతవి

కావ్య మీమాంస విలక్షణమైన, సూత్ర రూపమైన అలంకార శాస్త్ర గ్రంథం. అది పద్దెనిమిది అధికరణాల గ్రంథమైనట్లు గ్రంథారంభంలో ఉన్న ''సోఽష్టాదశాధి కరణీం దివ్యేభ్యః కావ్య విద్యాస్నాతకేభ్యః సప్రపంచం ప్రోవాచ'' అనే దానివల్ల తెలుస్తున్నది. కాని ఇప్పుడు లభిస్తున్నది అష్టాదశాధ్యాయాలుగల మొదటి అధికరణం, కవి రహస్యం మాత్రమే ! రాజశేఖరుడు ఎన్నిఅధికరణాలు వ్రాశాడో, ఏ అధికరణంలో ఏమున్నదో తెలియదు. అది పూర్తిగా వున్నట్లయితే మహాభారతమంత గ్రంథమై ఉండుననీ, అది అలంకార శాస్త్రాన్ని గురించిన ఒక విజ్ఞాన సర్వస్వమై ఉండేదనీ ఊహించవచ్చును. ఉపలబ్ధమైన గ్రంథాన్ని తొలుత అర్ధ శతాబ్దానికి ముందే వెలుగులోనికి తెచ్చి, చక్కగా ముద్రింపించి ప్రకటించినవారు బరోడా ప్రాచ్య గ్రంథ మండలివారు !

ఇందులో సూత్రం, దాని వివరణ సోదాహరణంగా మిక్కిలి విపులంగాఉన్నవి. పూర్వోత్తర మీమాంసలు 'అథాతో ధర్మజిజ్ఞాసా, అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అనే సూత్రాలతో ప్రారంభమైనట్లే ఇదిన్నీ ''అథాతః కావ్యం మీమాంసి ష్యామహే'' అని ప్రారంభించబడింది. రచన చాలా సరళమైన భాషలో సాగింది. అలంకార గ్రంథాల ఆంధ్రీకరణ ప్రారంభమైన తొలిరోజుల్లోనే—నలభై అయిదేళ్లకు ముందే దీనిని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు తెలిగించి ప్రకటించారు. అది అప్పుడే విద్వాంసుల విమర్శలకుగురియై, అప్రశస్తంగా ఉన్నదని వెల్లడి అయింది. ఆ ప్రతులైనా యిప్పుడు లభ్యం కావు. తర్వాత మరెవ్వరూ దీని అనువాదానికిగాని, వ్యాఖ్యకుగాని పూనుకున్నట్లు లేదు.

బహుభాషావేత్తలు, ప్రతిభావంతులు, అలంకారశాస్త్ర నిష్ణాతులు అయిన శ్రీరామచంద్రుడుగారు 12 ఏళ్ల క్రిందటనే, తాము రసగంగాధరంపై సిద్ధాంత వ్యాసాన్ని రచిస్తున్నప్పుడు దీన్ని పరిశీలించడం, ఆయనకు దీనికి వ్యాఖ్య వ్రాయాలనే సంకల్పం కలగడం జరిగింది. ఆ ప్రయత్నం యిప్పుడు సఫలమై యీ బృహద్గ్రంథం వెలువడింది. రచనా శ్రమతోపాటు వ్యయప్రయాసానికిన్నీ లోనయి, ఈ గ్రంథాన్ని స్వయంగా ప్రకటించారు. దీనితో—కావ్యమీమాంసకు తగిన తెలుగు వ్యాఖ్యవచ్చి-జిజ్ఞాసువులకు మహోపకారం జరిగింది.

వ్యాఖ్యాత మూలం తొలుత ఇచ్చి, తర్వాత దాని అర్థాన్ని సులభంగా తెలిసేటట్లు వ్రాశారు. కాని, అంత మాత్రంతో గ్రంథకర్త అభిప్రాయం కాదు. అందువల్ల ఆ అభిప్రాయాన్ని వివరిస్తూ తిరిగి విపులంగా చెప్పవలసి వచ్చింది. అందువల్ల యిది పెద్ద గ్రంథంగా తయారయింది. ఒక్క ఉదాహరణచూపితే ఆయన యీ వ్యాఖ్యా రచనకు ఎంత పరిశ్రమించినదీ తెలుసుకోవచ్చు.

రాజశేఖరుడు శిక్షా, వ్యాకరణాది షడంగాలతో పాటు అలంకార శాస్త్రం కూడా అవసరమనీ, అందువల్ల అది ఏడవ అంగమనీ చెపుతూ, ఎలా అవసరమో తెలుసుకోడానికి ఒక మంత్రం ఉదాహరించాడు. కాని వివరణ ఇవ్వలేదు. ఆ మంత్రం ఇది —

''ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిష స్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాక శీతి.''

ఉదాహరణం ఇచ్చినంతమాత్రాన పైదానికి అలంకారశాస్త్రావశ్యకత ఎలా తెలుస్తుంది? దీని అర్థం ''మంచి రెక్కలుకలవి, కలిసి ఉండునవి, మైత్రితో కూడినవి అగు రెండు పక్షులు ఒకే వృక్షమును ఆశ్రయించియున్నవి. వానిలో ఒకటి మధురమైన ఫలమును (కర్మఫలమును) భుజించుచున్నది. రెండవది తినకుండగ ప్రకాశించుచున్నది'' అని.

దీని వివరణ ఇది —

''ఈ మంత్రము రూపక వ్యతిరేకాలంకారములను ఉపయోగించి, జీవాత్మ పరమాత్మలు ఒకే దేహమును ఆశ్రయించి యున్నవనియు, వారిలో జీవాత్మ కర్మఫలమును అనుభవించుచుండగా పరమాత్మ మాత్రము కర్మఫల భోగవిహీనుడై ప్రకాశించు చున్నాడనియు బోధించుచున్నది. ఈ విధముగ రూప కోపమాదులతో నిండిన వేదముల అర్థము స్పష్టముగ తెలియవలెనన్నచో అలంకార శాస్త్రము ఆవశ్యకమని అభిప్రాయము.''

పయి వివరణ లేకుండా — మంత్రార్థాన్ని గ్రహించడం, ఆ అర్థాన గతికి అలంకారశాస్త్రం ఎంత అవసరమో తెలుసుకోవడం కుదరనే కుదరదు.

డాక్టర్ శ్రీరామచంద్రుడుగారు దీని ప్రస్తావనలో రాజశేఖరుని యాయావరత్వాన్ని గురించీ, అతని కాలాన్ని గురించీ, గ్రంథాలను గురించీ, భార్య అవంతి సుందరీదేవిని గురించీ విపులంగా తెలియజేశారు. సంస్కృత కవి పండిత లోకంలో అతనికెట్టి ప్రతిష్ఠ ఉన్నదీ, సమకాలీనులు కూడా ఎలా ప్రశంసించినదీ తెలిపియున్నారు. ఆ కాలపు వనితల సంస్కృత పాండిత్యాన్ని గురించీ, రాజశేఖరునికి వారియెడ గల గౌరవాన్ని గురించీ వివరించారు. ఈ విధంగా వారి ప్రస్తావన కూడా వారి వ్యాఖ్యవలెనే విద్వాంసులకు, జిజ్ఞాసువులకు ఎంతో ఉపకారకమై ఉన్నది.

గ్రంథం చివర శ్లోకాలకు సూచిక కూడా ఇవ్వబడింది.

ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని రచించి వెలువడజేసిన డాక్టర్ శ్రీరామచంద్రుడుగారు అందరికీ అభివంద్యులు.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

# మూడు పరిశోధన పుస్తకాలు

# గతాన్ని గురించిన అపోహలు

[రచన-డాక్టర్ రొమిలా థాపర్, తెలుగు—డాక్టర్ బి. ఎస్. ఎల్. హనుమంతరావు, వెల: రు. 2-50.]

తెలుగులో చరిత్ర గ్రంథాలే తక్కువ. చారిత్రక పరిశోధన గ్రంథాల సంగతి వేరే చెప్పనవసరంలేదు. చరిత్ర పరిశోధన కత్తి మీద సాములాంటి పని. వాస్తవాలను వెలుగులోకి తీసుకురావడం పరిశోధనల లక్ష్యంకదా. అందుకు అనుగుణంగా గతంలో జరిగిన కృషి పర్యవసానంగా సామాన్యులకే కాక విజ్ఞులకు కూడా కొన్ని అభిప్రాయాలు ఏర్పడి ఉంటాయి. వాటిలో కొన్ని అపోహలుండవచ్చు. కానీ, ఒక అభిప్రాయం సరయినదికాదు. అపోహ అని ఎలా తేల్చ గలుగుతాము? అందునా చరిత్రలో యేది వాస్తవమో, మరి ఏది అపోహయో తేల్చడం మరీ కష్టం. ఎందుచేతనంటే వాస్తవాలను నిగ్గుతేల్చే ప్రమాణాలు స్పష్టంగాలేవు. చరిత్రకారులు తమ దృష్టితో వ్యాఖ్యానం చేయగలుగుతారు. వస్తునిష్ఠంగా వ్యాఖ్యానం చేయడం అంతసులభంకాదు. భారతదేశ చరిత్రలోని పలు అంశాలను ఈ అపోహలలో కొన్నింటిని ఈ పుస్తకంలో డాక్టర్ రొమిలా థాపర్ చక్కగా పరిశీలించారు. శ్రీ హనుమంతరావుగారి అనువాదం బాగున్నది. కాని ఇంకా బాగా అనువదించే అవకాశం లేకపోలేదు. పాత అపోహలను చారిత్రక దృష్టితో రచయిత పరిశీలించి, కొత్త వెలుగు ప్రసరించారు. యూరోపియన్ల పరిశోధనలలో జాతీయ దృష్టిని అవలంబించినందున ప్రాచీన భారత చరిత్ర సంస్కృతుల పట్ల అనేక అపోహ లేర్పడినాయి (7వ పుట). నిజమే. కానీ అవి అపోహలని ఎలా తేల్చగలిగాము? భారత జాతీయ భావంనుంచి వెలువడిన రచనలు ఆ అపోహలను ఎంతవరకూ తొలగించగలిగాయి? పైగా యీ రచయితయే అంగీకరించినట్లు మరికొన్ని అపోహలకు జాతీయవాదం దారితీసిందిగదా? ఇలాంటి విశ్లేషణ యీ పుస్తకంలో విశేషంగా జరిగింది. భారత సమాజం, భారత సంస్కృతంలో ఆధ్యాత్మికత, జాతి భేద సిద్ధాంతంవంటి అంశాలను గురించిన కొన్ని అపోహలను తొలగించే కృషి యీ పుస్తకంలో జరిగింది. 18వ శతాబ్దానికి పూర్వము భారతీయు లెన్నడూ తాము ఆధ్యాత్మిక జాతియని చెప్పుకోలేదు (8వ పుట). ''లౌకిక, పారలౌకిక విధానాలలో దేనిలోనూ నిమగ్నంకాక ధర్మ, అర్థ కామ పురుషార్థాల మధ్య సమతూకం సాధించడమే ఆదర్శ జీవిత లక్ష్యమని మన పూర్వులు భావించారు.'' ఇలాంటి అంశాలను వెలుగులోకి తీసుకు రావడంద్వారా భారత చరిత్రకు యీ రచయిత నిజమయిన సేవ చేసిన వారయినారు. గర్హ్యములైన విధానాలద్వారా లాభాలు గడిస్తూనే హిందూస్థాన్‌లో బ్రిటిష్‌వారు సాంఘిక విప్లవానికి కారకులయినమాట నిజమే. ఈ సందర్భంగా మాక్స్‌ముల్లర్ ప్రభావం గురించి ఇంకా కొంచెం వివరంగా పరిశీలించడం అవసరంకాదా? భారతీయ చరిత్రకారులను గురించిన యీ రచయిత అభిప్రాయాలను చారిత్రకులు పరిశీలించడం అవసరం.

ఆర్యజాతి సిద్ధాంతం, బంకించంద్ర ఛటర్జీ, అరవిందుల అభిప్రాయాలను గురించి యీ రచయిత మదింపు సహేతుకంగానే ఉన్నది. అయితే ఇక్కడ ఒక విషయాన్ని గమనించడం అవసరం అనుకుంటాను. ఏదయినా ఒక అభిప్రాయం సరయినదో కాదో నిర్ణయించేముందు ప్రతి చారిత్రకవేత్త తను అనుసరించే ప్రమాణాలను వివరించితే బాగుంటుంది. ఇంతేకాదు. శిలాశాసనాలవంటి ఆధారాలను కూడా ఉటంకించాలి.

గతాన్ని ఆదర్శంగా చిత్రించడం, పునరుద్ధరణవాదుల్లో ప్రస్తుత భంగపాటుకు పరిహారంగా ఉపకరించినమాట నిజమే. కాక యీ రచయితయే (15వ పుట) అన్నట్టు జాతీయ చారిత్రక రచన బహుముఖంగా జరిగినప్పుడు ఎడనెడ పొరపాట్లు జరగడంలో వింతయేమీ లేదేమో!

భారతదేశ చరిత్రను గురించిన విపరీత సిద్ధాంతాలను సరిదిద్దే యత్నం యీ పుస్తకం రెండవ భాగంలో జరిగింది. రాజకీయాధికారానికి కులం ఆటంకం కాలేదు (23వ పుట) అన్న సత్యాన్ని గురించి వర్తమాన రాజకీయాలలో ఎంత ఎక్కువ ప్రచారం జరిగితే అంత మేలు జరుగుతుంది. రాజకీయాలస్థాయి పెరిగే అవకాశం ఉంటుంది

భారత చరిత్రలో రైతుల తిరుగుబాట్లు లేకపోవడానికి కారణం సారవంతమైన భూములు సులభంగా లభించడమే (37వ పుట) నన్న అభిప్రాయానికి యీ రచయిత ఎలా వచ్చినదీ వివరించితే బాగుండేది. అయితే, వాణిజ్యానికి, పరిశ్రమలకూ కేంద్రాలుగా నగరాలు పెరగలేదనడం కూడా చారిత్రక సాక్ష్యానికి వ్యతిరేకము (39వ పుట) అనే అభిప్రాయం సహేతుకంగా ఉన్నది. పరిశోధనల ఫలితాలున్న మంచి పుస్తకం ఇది. ఇంతకూ అనువాదకుని ప్రసంగాల సంకలనం ఇది. అయినా బాగున్నది, చదువ తగినది. చదివి, చారిత్రక దృక్పథం అలవరచుకుంటే యీ కృషి సార్థకమవుతుంది.

## ప్రాచీన భారత సమాజంలో బానిసల స్థితిగతులు

[జర్మన్ మాతృక — వాల్టర్ రూబెన్. తెలుగు — డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు వెల : అయిదు రూపాయలు.]

ఈ పుస్తకంలో ఆరు ప్రధాన భాగాలున్నయ్. కొన్ని ఉపశీర్షికలున్నయ్. మానవ సమాజ పరిణామంలో బానిస వ్యవస్థ ఒక దశ అయి వుండొచ్చు. వర్ణవ్యవస్థ పెరిగిన కొలదీ బానిస వ్యవస్థ క్షీణించిందని ఒక అభిప్రాయం. పరిణామదశలో వ్యవస్థలన్నీ మార్పుకు గురి అయినట్లే బానిస వ్యవస్థకూడా మారినదని మరొక అభిప్రాయం. ప్రాచీన భారత సమాజంలో బానిస వ్యవస్థ అసలు ఉండేదా! ఉంటే దాని స్వరూప స్వభావాలు ఎలా ఉండేవనే ప్రశ్నలకు ఖచ్చితమయిన సమాధానాలు లేవని కొందరు చారిత్రకుల అభిప్రాయం.

హరప్పా—మొహంజదారో నాగరకత కాలంలో అంటే క్రీస్తుకు పూర్వం 2500—3000ల మధ్య కాలంలో బానిస, బానిస యజమాని వ్యవస్థ ఉండేదని మార్క్సిస్ట్ చరిత్రకారుల అవగాహన. ఈ అవగాహనమునే వాల్టర్ రూబెన్ జర్మన్ భాషలో యీ పరి

శోధనా గ్రంథాన్ని వ్రాయగా డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు దాన్ని తెలుగులోకి అనువదించారు.

బౌద్ధ జాతక కథలలో సామాన్యులు తెలుసుకొనవలసిన పెక్కు విశేషాలున్నయ్. ఆ కథలన్నీ బానిస వ్యవస్థను ప్రస్తావించాయి. వాటి విశ్లేషణ యీ పుస్తకంలో జరిగింది. విశ్లేషణ బాగున్నది కాని సామాన్యులకు సయితం అర్థమయ్యేటంత స్పష్టంగా లేదు. రూబెన్ అభిప్రాయాలన్నీ అందరకూ ఆమోదయోగ్యం కాకపోవచ్చు. అయినా ఇది చదవతగిన శాస్త్రీయగ్రంథం. శాస్త్రీయ దృష్టితో చరిత్ర వ్రాయడం ఎంత కష్టమో? ఆ పద్ధతిలో వ్రాసిన గ్రంథాన్ని చదవడం కూడా అంత కష్టమే. చరిత్రలోని పెక్కు అంశాలపై ఇంతకుముందే మనకు ఏర్పడిన అభిప్రాయాలకు భిన్నమయిన వాస్తవాలు శాస్త్రీయదృష్టితో వ్రాసిన చరిత్రలో ఉన్నప్పుడు వాటిని మనం ఆమోదించగలగడం కూడా కష్టమే. ఇవన్నీ ఇలా ఉండగా కేవలం జాతక కథలను ఆధారంగా చేసుకునే పురాతన భారత సమాజంలో బానిస వ్యవస్థ ఉండేదని తీర్మానించడం శాస్త్రీయ దృక్పథం అవుతుందా! ఇతర ఆధారాలను పేర్కొనవవసరంలేదా?

బానిస అనే మాట అర్థం కూడా కాలానుగుణంగా మారడం లేదా? అనాటి బానిస వ్యవస్థను యీనాటి ప్రమాణాలతో నిర్ణయించడం సబబవుతుందా? ఇలాంటి చర్చనీయాంశాలు కొన్ని ఉన్నా ఇది మంచి శాస్త్రీయ గ్రంథమే. అయితే అచ్చు తప్పులు ఇన్ని లేకుండా, ఇంకా బాగా అర్థమయ్యేట్టు యీ అనువాదం వ్రాయడం కష్టంకాదు.

# అలీన విధానం
## దాని మిత్రులూ, శత్రువులు

[రచన ఎన్. సిమోనియా, వెల: మూడు రూపాయలు.]

అలీనోద్యమం ప్రారంభ దినాలనుంచి జరిగిన చారిత్రక పరిణామాలను రేఖామాత్రంగా యీ పుస్తకంలో యీ రచయిత వ్రాశారు. అలీనోద్యమంయొక్క సాధికార చరిత్ర 17 సంవత్సరాల కిందట ప్రారంభమయినా వాస్తవానికి యీ ఉద్యమం రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఆసియా ఆఫ్రికా ప్రజల జాతీయ విముక్తి కృషితోనే ప్రారంభమయింది. 1949లో ఢిల్లీలో జరిగిన విదేశాంగ మంత్రుల స్థాయి సమావేశంలోనే యీ ఉద్యమం ప్రారంభమయినదనవచ్చు. ఆయా వివరాలు యీ పుస్తకంలో ఉన్నయ్. బాండుంగ్ సమావేశం ఆమోదించిన ప్రాతిపదిక సూత్రాలను అలీనదేశాలలో ఎన్నిదేశాలో యీనాడు పాటించి అమలు జరుపుతున్నాయి?

పలుకుబడిగల శక్తులలో ఒకటిగా అలీనోద్యమం రూపొందడానికిగల కారణాలను ''ప్రపంచ రాజకీయాలలో ఒక ముఖ్యాంశం'' అనే భాగంలో యీ రచయిత చర్చించారు.

కొత్త అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకోసం అలీనదేశాలు యే విధంగా కృషిచేస్తున్నదీ నాలుగవ భాగంలో యీ రచయిత వివరించారు. సామ్రాజ్యవాదంవల్లా, వయావలసవాదులవల్లా అలీనోద్యమానికి ప్రమాదం ఏర్పడిందని ఈపుస్తకం అయిదు, ఆరుభాగాలలో యీ రచయిత వివరించారు. సామ్రాజ్యవాదుల దురాక్రమణ తత్వం గతంలోకన్నా ఇప్పుడు ఎంతమాత్రమూ తగ్గలేదు (33వపుట) అని యీ రచయిత అభిప్రాయం ఆర్థికశాస్త్రవేత్తలు ఇంకొకరకంగా చెబుతారు. సామ్రాజ్యవాదుల పాలనలోని వలసలలో ఒక్కొక్క దానికీ స్వాతంత్ర్యం లభిస్తున్న ఫలితంగా సామ్రాజ్యవాద దేశాలు ఆర్థికంగా దెబ్బతింటున్నాయి. పర్యవసానంగా ఆయా దేశాలలోని ప్రజల సమస్యల పరిష్కారకృషితోనే సామ్రాజ్యవాద దేశాలు సతమతమవుతున్నయ్. ఇలాంటి దేశాలు దురాక్రమణకు పూనుకొనగలవా? అలీనోద్యమానికి అవి హాని చేయగలవా? అంటారు కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు.

కొన్ని పాశ్చాత్య బృందాలు ఒక దశలో ప్రపంచ యుద్ధ ప్రమాదం తగ్గిపోవటం, స్థానిక ఘర్షణలు నానాటికి మరింత ఎక్కువ సంభవించేలా, యించుమించు అనివార్యమయేలాచేస్తుంది అనే సిద్ధాంతాన్ని ప్రచారంలో పెట్టాయట. ఈ సిద్ధాంతం ఎంత ప్రమాదకరమయినదో అలీనదేశాలు గుర్తించలేదని అనగలమా?

భారతదేశంవంటి తృతీయ ప్రపంచంలోని దేశాలతో అమెరికా అధ్యక్షుడు కార్టర్ స్నేహం సత్సంబంధాలను అభిలషించినంతమాత్రానే ఇండియాపై అమెరికా పలుకుబడి పెరుగుతుందా!

సామ్రాజ్యవాద వ్యతిరేకత ఇండియా విదేశవ్యవహారాల విధానంలోని ప్రధానాంశాలలో ఒకటిగా ఉన్నంతకాలమూ ఇండియా అలీన స్వభావం అంత సులభంగా మారుతుందా? అమెరికా పరిభాషలో ''తటస్థత''కు అర్థం యేమయినప్పటికీ తన జాతీయ ప్రయోజనాలేమిటో బాగా అర్థంచేసుకున్న ఒకదేశం ఆ ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యవహరించజాలదు కదా!

ఈ పుస్తకం అంతటిలో ''పెకింగూ అలీనోద్యమం'', ''ప్రపంచ సోషలిజమూ అలీనోద్యమం'' అనే భాగాలు చాలా ముఖ్యమయినవి. ఇది మంచి పుస్తకం.

ఈ మూడూ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ– 520 004, ప్రచురణలు. మూడూ మంచి పుస్తకాలే.

**శ్రీ వి. ఎస్. అవధాని**

# లోకమేరీతి మారును నాకముగ

[శతకము–తల్లోజు యాదవాచార్యులు. క్రౌన్ 24 పేజీలు; ధర రూపాయ; ప్రతులకు : గ్రంథకర్త, 20–1–217, పురానాపూల్; హైదరాబాదు]

రచనా విధానం మరల ఛందోమార్గాన పడినదన్న ఆత్మానందంతో ఈ కవి ఈ శతకం వ్రాస్తున్నాడు. ఎవరు ఎట్లా వ్రాసినా, గుణం ప్రధానం; అది ఉంటే అందరినీ ఆకర్షిస్తుంది—రచన.

ఈ శతకం కాలగతిని లోకపు తీరును విమర్శిస్తున్నది నీతి ధర్మము మానవత క్షీణించి, జాతి దానవత్వాన్ని పొందినందుకు విమర్శ—సానుభూతి పొగడ్త ఇందున్నవి. కాబట్టి లోకాన్ని నాకం చేయమంటున్నాడు. అనుకొన్నది సూటిగా చెప్పగలిగిన శక్తి ఈ భాషకు ఉన్నది. పద్యాలన్నీ అవహేళనలే! లోకపు నడవడికను విమర్శించను ఇది చాలా మంచి పద్ధతి. ''కళలు చచ్చిన జగతికి కలదె కలిమి'' అని వాపొయ్యే శిల్పారాధకుడు—ఈకవి.

స్నేహ శోభను మూఢులు చెరుస్తున్నారని ధర్మావేదన పొందుతున్నాడు. ''కులమని గుణం లెక్కబెట్టని'' ఈ ప్రపంచ అవినీతికి బాధపడి, విమర్శక ధ్వజమెత్తినాడు. ఈ కవిది ఆర్ష సంప్రదాయము.

రచనా విధానం మంచిదారిన బడినది. సాధనలో ఇది గుణ పూర్ణం అయ్యేటట్లున్నది.

## గ త స్మృ తు లు

[రష్యా కవితల్లజుడు—రసూల్ గమ్జతోవ్. క్రౌన్, 42 పేజీలు; ప్రతులకు : యువక, సాహితీ సాంస్కృతిక సమాఖ్య, కాకినాడ—7]

ఇంతవరకు సంస్కృత కవులు—ఇంగ్లీషు కవుల రచనలనే తెలుగువారు ఎక్కువగా అనువదిస్తూ వస్తున్నారు. ఇది ప్రపంచ వాఙ్మయ సమగ్ర రూపం కాజాలదు. ఇతర దేశాల కవితలను గూడ ఆంధ్ర భారతికి నైవేద్యం పెట్టి ప్రజలకు పంద్యారం చేయవలసి ఉన్నది. ప్రపంచ సాహిత్యమంతా ఆంగ్లంలోనికి దిగి ఉన్నది కాబట్టి, ఆ భాషా పండితులు వివిధ దేశాల గ్రంథాలను తెనుగు చేయవలసిన అగత్యం ఎంతైనో ఉన్నది. ఈ యువక విద్యార్థి కవి అనువదించిన ఒక రష్యా కవి రచనలకు ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. అందులో ఈ కవి ముస్లిం కావడంచేత, ఇస్లాంమతము—ముస్లిం కవిత రష్యాలో ఏ రూపాన్ని పొంది ఉన్నవో తెలుసుకొని ఆనందించేదానికి మంచి అవకాశం ఏర్పడుతున్నది.

ఈ రసూల్ మహాకవి, రష్యన్ బహుమతులు పొందిన సిద్ధహస్తుడు. ఇది చాలా చిన్న సంకలనమైనా కవితలో శిల్పగుణం కలిగి మనోజ్ఞంగా ఉన్నది. భావుకత నవ్యశోభతో విప్పారి ఉన్నది. ''వృద్ధాప్యం నా దారికి అడ్డంగా నిలబడి క్రూరంగా నవ్వుచున్నది'' తప్పించరాని ప్రకృతిని గూర్చి బాగా చెప్పినారు. ఈ మధుర భావన చూడండి:—ఒక్కొక్కటిగా పండుటాకులన్నిటిని అనాథలు చేసి వీధుల కెక్కిస్తున్నది, ఆకురాల్చే కాలం; కాల ప్రభావాన్ని గురించి మనోజ్ఞంగా చెప్పిన ఉక్తి ఇది. ''కొంగొత్త అందాన్ని సంతరించుకొన్నా ప్రకృతి చర్య అన్యాయం'' అనడం మనవారు కాలం నిర్ణయం అన్నదానికి సరిపోతున్నది. ''కొండలు నాకు అండగా ఉండి, నన్ను స్వర్గానికి చేరుస్తాయి'' అన్నది నాస్తిక కమ్యూనిజానికి స్వర్గ వాసనలు పట్టిస్తున్నట్లున్నది. రష్యాలో అంతర్జాతీయతస్థానే జాతీయత గూడా నెలకొంటున్నది గదా !

కాని, ఇందు కొన్ని ఖండికలు అయోమయంగా పేలవంగా ఉన్నవి. ఇంగ్లీషుమూలం ఎట్లా ఉన్నదో చూస్తే బాగుంటుంది. రచయిత, మనసు రచనపేరీ పేరని స్థితిలో ఉన్నది కాబట్టి ఈ కొద్ది పాటి లోపానికి తావిచ్చి ఉంటుంది. చదువు సాధన ఎక్కువయ్యే కొలది ఈ యువకుడు మంచి కవి కాగలడని అనిపిస్తున్నది.

## హా ర తి

[వికారాబాదు సాహితీ సమితి సభ్యుల రచనలు. క్రౌన్—80 పొరటలు; వెల:-రు. 3/—; ప్రతులకు : సాహితీ సమితి, వికారాబాదు, రంగారెడ్డి జిల్లా—501101.]

మన సంస్కృతిని మరచి, విదేశాల వేదాంతాలకు రాజకీయ సిద్ధాంతాలకు అర్రులుచాచే భావదాస్యాన్ని నిశితంగా విమర్శించి, జాతీయతను తెనుగుదనాన్ని పోషించి ఆరాధించే యువకుల సాంప్రదాయిక కవితా సుమగుచ్ఛం ఇది. కప్ప ఎలుగుపామువంటి విదేశ వాదాల పొంతపోనివారుగా ఉన్నారు—ఈ రచయితలు. వివిధ వృత్తుల వారు—వివిధ వర్ణాలవారు—స్త్రీ పురుషులు. అన్యప్రీతికర వ్యాసంగం (హాబి)గా వ్రాసిన వ్రాత లివి. ఈ సంకలనం చదువరికి ప్రీతి, వ్రాసిన వారికి ఆత్మానందం కలిగించ గలవు. ఇట్టి సమాజాలు సంకలనాలే, నేటి వాఙ్మయ అరాచకాన్ని పరిహరించి పాఠకులకు కొత్త ఛవులు కల్పించగలవు. అర్థపుష్టి, భావశుద్ధి గలిగిన రచనలు చాలా ఇందున్నవి. అరవైకి పైబడిన ఖండికలలో ప్రతిదానిలో ఒక కొత్త పోకడ, భావంలో పేర్మి, భాషలో తీపు, నడకలో ఒయ్యారం ఉన్నవి.

సాధనవల్ల వీరందరూ మేలిమి వ్రాయస గాండ్రుగా తీరి, ఆంధ్రభారతిని, భారత జాతీయతను పెంపొందించగలరు. సమతపై పాడిందే పాడే ప్రగతి వాఙ్మయానికి అవలిగట్టు రచన ఇది.

## భూ పా ల్ పా ట లు

[జానపద గేయాలు. డెమ్మీ 60 పేజీలు, వెల : ఒకటిన్నర రూపాయి, ప్రతులకు : దేశి బుక్ హౌస్, నారాయణగుడా, హైదరాబాదు — 24.]

జానపద గేయాలే మన అనాదిగా మౌఖిక వాఙ్మయంఅనాల. భావుకుడైన ప్రతి గ్రామీణుడూ, కండచేవ ఊపిరిగల పదాలు వ్రాసి పాడి ఆనందించి, ఆనందింపజేసేవాడు...అవి ఇంకా పల్లెలలో కొన్ని వేలకు తరబడి నిలిచి ఉన్నవంటే — ప్రజల భాషలో ప్రజల భావాలు ప్రజల కొరకు చెప్పబడి, లయ ఛందము కవితా శిల్పం కలిగియున్న

కారణమే అనాల. ఈ యాల పదాలలో గ్రామీణుల అకళంక మధుర హృదయాలు ప్రతిబింబించి ప్రతిధ్వనిస్తున్నవి.

భూపాల పల్లె ప్రజల జీవిత కష్ట సుఖాలను గమనించి (నిజాము—భూస్వాముల నిరంకుశ పాలన దినాలలో స్థితి; ఇప్పుడు కూలి రైతుకు మగడై ఉన్నాడు) అర్థం చేసుకొని జీవం ఉట్టి పడేటట్లు నానా కంఠాలతో పాడినాడు. భాషలో ఎన్నో తియ్యటి పదాలు చవులూరిస్తున్నవి. నవనాగరికులు ఈపదాలను విడనాడటం భాషకు వెలితి అయినది. ఈ రచయిత అక్కనును (దాన్నోట్లో మన్ను వొయ్య) మాని ఉంటే, సౌహార్దాన్ని పెంచి ఉండేవాడు. తెలంగాణా పదాలలో ఎంత మాధుర్య మున్నదో — పల్లెసీమ భావాలు ఎంత సొంపైనవో, ఇందు ప్రదర్శింపబడి ఉన్నవి. ఈ కవికి కథక చాతురి, చిత్రీకరణ వైభవం బాగున్నవి. ఇప్పుడు ఈ దృశ్యాలు మారడం ప్రగతి అనిపించుకోదు. కొన్నిటిని కోడ్ చేయకతప్పదు:— దబ్బున్న ఉరికొచ్చి డొక్కచూపి ఇంత బువ్వ పెట్టామంటె; బండ మీద పూమూంచి ఎండేవర కొచ్చేయనె (గడువు ఎంత పసందుగా చెప్పబడినది) ఆకలి పేగుల కడ్డం రంపమేసి కోతగోసి; తైదంబలి తైదరొట్టె నిర్వకాయ ఉల్లిగడ్డ (జొన్నన్నం జొన్నంబలి సన్నన్నం సున్నసుడీ అన్నట్లు) ఉత్తరా నురిమింది తూర్పున శింగిణి వూసిందిరా (ఇందు కవితాశిల్పం ఉట్టిపడుతున్నది, కొరడు—ఇంద్రధనుస్సు వర్ణనం) తెల్లదొరలూ పోయి నల్లదొర లొచ్చారు, మన రక్త మాంసాలు పీల్చి మసి చేశారు; మూలసుక్క పొడవగానే మోటగట్టి కొట్టినావు.

## కాలం కదలికలు

[ఎం. రాములు, వెల : రు. 2/–; ప్రతులకు : కేకలు, తెలుగు వార పత్రిక, వీక్లీ బజార్, నిజామాబాద్–503 001.]

పుస్తకం పేరులో సొంపైన నుడికారం ఉన్నది.

ఇది విప్లవ కవిత; విషయము భాష పరిపాటి పడికట్లలో ఉన్నవి. ఆకటి మంటలు తాడిత పీడిత బహిష్కృత ప్రజలపై దయను కురిపిస్తున్న యువక హృదయం—ఈ కవిది. మేధావియై అమెరికాలో ఉన్నత ఇంజనీరింగ్ విద్య నభ్యసిస్తూ, ఆ దేశ ఐహిక సంపదను రుచిచూస్తూ, వెనుక చూపుతో మనదేశ స్థితికి వగస్తున్నాడు. రాజకీయాల–రాజకీయవాదుల కల్మషాలను బాగా తూర్పార బట్టినాడు. భావావేశం ఉన్నది.

భాషకు మున్ముందు మెరుగెక్కితే కవితలెక్కలో పడగలదు. (నిజం తెలుసుకో) సైన్సు పురోగతిని గమనించి మానవుడు శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకోమంటాడు; ఇది చాలా మంచి మాట...దీనితో మూఢ విశ్వాసాలు విరగడైపోగలవు. చాలా వ్రాతలలో సాంకేతిక విధానంవల్ల మర్మ కవిత్వ మనిపిస్తున్నది.

## నవత

[వేములవాడ, నటరాజ కళానికేతన్ సభ్యుల కవితా సంకలనము.]

ఉత్తర తెలంగాణాలో తెనుగు వికాసాన్ని ప్రకటిస్తున్నది—ఈ సంకలనం. హన్మంతరావు అనే సంశ్లేషపు స్పెలింగ్ ఇంకా వీరిని వదలకపోయినా, ఇందు జాను తెనుగు వికసిస్తున్నది.

కవితా వస్తువు నేటి ప్రగతిశీలియే. పెట్టుబడి దోపిడీల నిరసనమే కావడంచేత రచనలలో నవ్యతగాని నాణ్యముగాని లేవు. వీరు కమ్యూనిష్టు దేశాల ధాన్య బాధ వినిగూడ, ఆ దేశాలను పొగుడుతున్నారేమబ్బా అని, చదువుతుంటే ఆశ్చర్యం కలుగుతుంటుంది. అగ్నిని — గుడిసెలు అడవులు కాల్చేదాని కంటె, భాగ్యవంతుల భవనాలు కాల్చమని కోరుతాడు — ఒక కవి. ఈ కార్పణ్యం సమత అవుతుందా? నాగుబామువలె పసిబట్టి కాటు వేయడం మానవత్వం అనిపించుకొంటుందా? వ్రాయనీయండి, వీరికే వినుగుబుట్టి మున్ముందు కవితకు మంచి ప్రయోజనం కల్పించబోతారు.

ముఖ చిత్రంలో అందం లేదుగదా—అర్థమూ కావడం లేదు. డా. దయాదేవి—నిప్పును రాజేయడం గొప్పనుకున్నాడు ఆదికాలపు అమాయక మానవుడు; సుదూరతీరానమున్న జాబిల్లి నందుకొన్నాడు ఆధునిక యుగపురుషుడు — అన్న మాటలు లలితభావ సమన్వితంగా ఉన్నవి.

కళాప్రపూర్ణ మదుపూరు కోదండరామరెడ్డి

## జయంతి

[కావ్యకంఠ గణపతిముని శతతమ జన్మదిన స్మారక సంచిక. వెల : 12 రూపాయలు. ప్రాప్తిస్థానం : డా. జి. శ్రీరామమూర్తి, వైస్ ప్రిన్సిపాల్, ఎ. ఎమ్. ఎ. ఎల్ కాలేజి, అనకాపల్లి, విశాఖజిల్లా.]

కావ్య కంఠ వాసిష్ఠ గణపతిముని నూరవ పుట్టిన రోజు పండుగ చేయాలనే సత్సంకల్పముతో ప్రసిద్ధ మేధాశాలి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షులుగా, డా॥ జి. శ్రీరామమూర్తిగారు కార్యదర్శిగా కొందరు పెద్దలు (వివిధ భాషలవారు) సభ్యులుగా ఒక సంఘం ఏర్పడి 1978 నవంబరు 17, 18, 19 తేదీలలో అనకాపల్లిలో ఉత్సవాలు చేశారు. ఆ ఉత్సవాలలో పాల్గొన్న కవి పండితులు చదివిన వ్యాసాలూ, పద్యాలూ, రాలేక పంపిన వారి వచనాలూ క్రోడీకరించి 'జయంతి' పేరుతో ముద్రించిన అమూల్య సంచిక ఇది. పై సంఘం గణపతిముని గ్రంథాలను ముద్రించడానికి దీక్ష వహించి యీ సంచికను మున్ముందు ప్రకటించింది. దీనికి గాను ఇచ్చే పన్నెండు రూపాయలూ ఒక ఘనకార్యానికి తోడ్పడతాయి కనుక వ్రక్కాణించ నక్కరలేదని నా అభిప్రాయం.

శ్రీ గణపతిమునిని 'నాయన'—అని భగవద్రమణ మహర్షి దేశానికి ఎరుకపరిచి తాము అలాగే పిలిచేవారు. ఈ సమాచారం

తెలుగువారికన్న తమిళ కర్ణాటదేశీయులకు అవిరళ సంఖ్యలో తెలుసును. మరొక విశేషం: రమణమహర్షికి ఆ పేరుపెట్టినవారు గణపతిముని—ఈ విషయం కూడా ఈ సంచిక మూలాన తెలియనివారికి తెలుస్తుంది.

గణపతి తెలుగు జాతిచేసిన పున్నెపు పంటగా అవతరించిన మహానుభావుడు. ఉమాసహస్రం, ఇంద్రాణీ సప్తశతి—అనే దేవీ తాత్విక గ్రంథాలు దేవీసూక్త సమ్మితములుగా చెప్పిన ప్రత్యక్ష గణపతి. ఇంకా భారత చరిత్ర పరీక్ష మున్నగు అపూర్వ విషయాలు సప్రమాణముగా చెప్పిన మంత్రద్రష్ట. ఆయన గ్రంథాలకు సంబంధించిన విషయాలను సంగ్రహించి శ్రీ ప్రసాదరాయ కులపతి, శ్రీ దివాకర్ల వెంకటావధాని వంటి విద్వన్మణులు చెప్పిన రచనలు ఈ జయంతి సంచికలో ఉన్నాయి. ఆ మహనీయుని జ్యోతిశ్శాస్త్ర విజ్ఞతను గూర్చి ప్రఖ్యాత జ్యోతిష్కులు శ్రీ నిష్ఠల సీతారామ శాస్త్రిగారు చెప్పిన విషయం జ్యోతిశ్శాస్త్రములో జాతక భాగం అభ్యసించిన వారికీ అధ్యయనం చేసేవారికీ చాలా ఉపకరిస్తుంది.

భక్తితో గణపతిమునిని ఆరాధించేవారి పద్యాలూ రచనలూ చాలా ఉన్నాయి.

అలాగే ఇంగ్లీషులోనూ, సంస్కృతములోనూ కూడా కొన్ని రచనలు ఉన్నాయి.

**Homage to Ganapatimuni** అనే డా॥ శ్రీరామమూర్తిగారి రచన, **'Nayana'** అనే శీర్షికతో ఉన్న శ్రీ కె. ఆర్. శ్రీనివాసయ్యంగారి ఆంగ్లకవిత ఆణిముత్యాలు.

సంస్కృత రచనలు శ్రీ విశ్వనాథస్వామి, మధుకేశ్వర, విఘ్నేశ్వరశర్మగార్లవి అవశ్యం పఠనీయాలు.

శ్రీ గణపతిముని స్వరూప స్వభావాలూ, అలౌకిక శక్తులూ ఈ 'జయంతి' సంచికలో మూర్తి మంతములై కనిపిస్తాయి.

శ్రీ గణపతిమునికీ, ఆయన శిష్యులకూ సంబంధించిన శ్రీ డి. గజానన, డి. ఎస్. విశ్వామిత్ర, గుంటూరు లక్ష్మీకాంతం వంటివారి చిత్రాలతో సహా ఈ సంచిక తెలుగువారి యింటింటా ఉండదగిన ఒక పవిత్ర గ్రంథమని చెప్పడం సామాన్యోక్తి.

*యామిజాల*

## వృక్షాభివృద్ధి

[డాక్టర్ ఎస్. కె. అయ్యర్, అనువాదం: పి. బి. భాస్కరరావు, ఆక్స్‌ఫామ్ పబ్లికేషన్సు, హైదరాబాదు, వెల: ఉచితము. ప్రతులకు: నాస్తిక కేంద్రము, విజయవాడ–520 006.]

ఈ పుస్తకాన్ని ఆక్స్‌ఫామ్ పబ్లికేషన్సు వారు ఉచితంగా ఇవ్వడానికి ప్రచురించారు. చెట్లు పెంచడంలో గ్రామీణాభివృద్ధి కార్యకర్తలకు సూచనలు ఇవ్వడానికి ఈ పుస్తకాన్ని ప్రచురించారు. చెట్ల పెంపకం, అడవుల పెంపకం, వాటి ఆవశ్యకత, పెంచతగిన చెట్లు, వాటి శాస్త్రీయనామాలు, వ్యవహారిక నామాలు, నాటుమట్టిపోయడం ఇత్యాది విషయాలన్నీ ఈ పుస్తకంలో ఉన్నాయి.

## అంధులకు వెలుగు

[రచన: కె. రామారావు, వెల: ఉచితం. ప్రతులకు కె. రామారావు, హెచ్. నెం. 31–433/1, నిమ్‌బోలిద్దా, హైదరాబాదు–500 027.]

అంధుల మానసిక ప్రవృత్తిని గురించి రచయిత గ్రంథ ప్రారంభంలో చెప్పారు. అంధుల తల్లిదండ్రులు తీసుకోవలసిన జాగ్రత్తలు. అంధుల విద్యావిధానంలో ప్రారంభం నుంచి వచ్చిన సాంకేతిక పరిణామాలు వివిధ శాస్త్రజ్ఞుల ప్రయోగాలు 'ఏకీకృత విద్యా విధానం' అనే వ్యాసంలో వివరించారు. అంధుల చరిత్ర, కంటి జబ్బులు. అంధుల పునరావాస సమస్యలను గురించి గ్రంథంలో చర్చిస్తూ—వారికి ప్రభుత్వం కల్పించిన సదుపాయాలు, ఎక్కడెక్కడ అంధుల పాఠశాల లున్నది, అంధుల గురించిన సమస్త వివరాలు చివరి పేజీల్లో ఇచ్చారు. నిస్వార్థంగా, మానవతా దృక్పథంతో ఇట్లాంటి పుస్తకాన్ని అచ్చువేసి ఉచితంగా పంచడం రామారావుగారి ఔన్నత్యానికి, ఔదార్యానికి నిదర్శనం.

*శ్రీ టి. ఎల్. కాంతారావు*

## గ్రంథస్వీకారాలు

* తెలుగు హనుమాన్ చాలీసా. రచయిత: శ్రీ భ్రా. వేం. రామబ్రహ్మశాస్త్రి, పేజీలు: 28, ప్రతులకు: రచయిత, 15–35/8, దయానందనగరు, మల్కాజిగిరి, హైదరాబాదు.
* చేతన (గాంధీజీ సంస్మరణ సంచిక). కడపజిల్లా రచయితల సంఘంచే రచింపబడిన రచనలు యిందులో వున్నాయి. పేజీలు: 32, వెల: ఒకరూపాయి. ప్రచురణ: కడపజిల్లా రచయితల సంఘం, కడప.
* శ్రీ మద్భాగవత సారామృతము (పద్య కావ్యము) (దశమ స్కంధ పూర్వభాగము ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ బిందువులు కలిపిన రెండు పుస్తకము) రచయిత కవితా విశారద టంకాల సత్యనారాయణ, వెల: రు. 25/-. పేజీలు: 600, ప్రతులకు: రచయిత, నివగాం – 532 457, శ్రీకాకుళం జిల్లా.
* గురుకులము, రచయిత: శ్రీ రావికంటి వసునందన్, పేజీలు: 102, వెల: రు. 5/–, ప్రతులకు: శ్రీమతి ఆర్. సత్యావసునందన్, 54 ఇ డబ్ల్యు యస్–11, ఎన్. సి. హెచ్. కాలనీ, పార్సిగుట్ట, హైదరాబాదు–500 048; ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్–3; ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్, హైదరాబాదు – 500 001.

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226**